# మనిషిలో మనిషి

(Dr. Jekyll & MR. Hyde)



మూలం:

రాబర్ట్ లూయీ స్టీవెన్సన్

అనువాదం:

దాసు వామనరావు

ఆంధ్ర గ్రంథమాల,
మద్రాసు-1

# మనిషిలో మనిషి

## 1. ఇంటిగుమ్మం వింతవిషయం

ఆర్ట్టర్స్‌న్ మంచి లాయరు. ముఖంమాత్రం చెకుముకి రాయిలాగున గంభ్రగాఉంటుంది. ఆముఖంలో నవ్వు అనేది నహి. మాట్లాడేటప్పుడు అతనిమాటలు తుంపులుతుంపులుగా అతుకులబొంతలాగునఉంటాయి. అభిమానాలూ, అనురాగాలూ అంతగా అతనిని బాధించవు. పొడుగ్గా, సన్నగాఉంటాడు. అయితేనేం? మనిషిదగ్గర ఆకర్షణశక్తి ఉంది. స్నేహితుల సమావేశాలలో మంచిద్రాక్షారసం నోటికింపుగా బల్లమీద పెట్టినట్లయితే, అతనిలోకొంతసరదాఉట్టిపడుతున్నట్లుగా అతనికళ్ళల్లోనే కన్పిస్తూఉంటుంది. అటువంటి సరదాగుణం అతనిసంభాషణలో వెల్లడి కాకపోయినప్పటికీ, అతనియొక్క సత్కార్యములలో స్పష్టంగా కన్పిస్తూ ఉంటుంది. స్వవిషయములో కొంత కట్టుదిట్టంగానే ఉంటాడు. త్రాగుడువిషయములో అతనికి ఉన్నటువంటి దిలాసాను కొంతవరకు అణచివేయడానికి చాలా ప్రయత్నించేవాడు. ఒంటరిగా ఉన్నప్పుడు ఘాటులేని సారా కొంత త్రాగేవాడు. నాటకములు చూడడం అతనికి యిష్టమే—కాని, ఇరవై ఏళ్ల యీ మధ్యకాల

ములో ఏ నాటకశాలలోనికీ అతను అడుగుబెట్టి యుండ లేదు. ఇతరుల విషయములో చాలా సహనం ఉండేది అతనికి—ఇతరులు ఏమైనా పాడుపనులుచేసి, తామేదో ఘనకార్యం చేసినట్లుగా ఎగిరినప్పుడు, అటువంటి వాళ్లను చూచి ఆశ్చర్యపడడు. మొత్తముమీద అటువంటి వాళ్ళను నిందించడంకంటె వాళ్ళకు ఏమైనా కించిత్తు మేలు చేసేవాడు "నా సోదర మానవుడు తప్పు చేస్తే వాడి పాపకర్మమున వాడే పోతాడు" అనే మాటలు తరుచు అంటూ ఉండేవాడు. ఇటువంటిమనిషి తన వద్దకు వచ్చిన మనుష్యులయొక్క తత్వాలను స్వభావాలను మార్పు చేయగలిగినంత ప్రభావం కలవాడు కాడు. ఆయన ప్లీడరుఅగుటవల్ల ఆయనవద్దకు ఏమైనా వ్యవహారాలనిమిత్తమై చాలామంది వచ్చిపోతూ ఉండే వారు. అటువంటి వారితో మాట్లాడేటప్పుడుకూడా ఆయన తీరులో మార్పు ఉండేది కాదు.

ఈవిధంగా ప్రవర్తించడం అట్టర్సన్‌కు సులభ సాధ్యమే. స్నేహితులను ఆకర్షించే ఆడంబరలక్షణాలు అతనిలో లేకపోయినప్పటికీ, అతనికి చిరమిత్రులుగా ఉన్నవారు అతని మంచిహృదయం గ్రహించి అతనికి స్థిరమిత్రులైనారు. కాకతాళీయంగా తనతో స్నేహంచేసి తన స్నేహబృందంగా ఏర్పడినవారినే, తన ఆప్త కూటంగా ఏర్పరచుకొనడం ఆయన తత్వం. ఆయన మిత్రులలో చాలామంది ఆయనతో బంధుత్వం ఉన్నటువంటివాళ్లు; లేదా చిరకాల పరిచయం ఉన్న

టువంటివాళ్లు - కంచెలమీద తీగెలు వ్రాకినట్లుగా ఆయన పరిచితులు దీర్ఘకాల పరిచయంవల్లనే అతనికి స్నేహితులైనారు. "రిచర్డు ఎన్ఫీల్డు"తో ఆయనకు దోస్తీ ఉంది. అతడు లాయరుగారి సన్నిహిత జ్ఞాతి. ఊళ్ళో పేరుప్రసిద్ధి గలవాడు. వీళ్ళిద్దరికీ ఏవిధంగా శ్రుతి కలిసిందో ఊహించడం కష్టం. వారిద్దరిలో ఒకరిలో ఇంకొకరికి కన్పించిన మహత్తర విషయమేమిటో ఎవరికీ తెలియదు. ఆదివారం వచ్చిందంటే ఇద్దరూ కలిసి సాయంకాలం వేళ షికారు వెళ్ళేవారు. అప్పుడు వారిద్దరూ మాట్లాడుకొనే విషయాలు ఏమీ ఉండేవికావు. మూగనోము పట్టినట్లుగా నడిచేవారు. కాని, త్రోవలో ఎవరైనా స్నేహితుడు కన్పిస్తే ఇద్దరూ సరదాగా "ఓహోహో!" అనేవారు. ఇంత మౌనంగా వారు కలిసి నడిచినప్పటికిన్ని, యీ ఆదివారం షికారు అంటే వారికి ప్రాణం లేచివచ్చేది. ఆనాడు ఇతర పనులు ఎన్ని ఉన్నప్పటికీ, అవన్ని మానుకొని, ఇతర వినోద కాలక్షేపములను కూడా వదలుకొని, యీ సాయంకాలం షికారు నిర్విఘ్నంగా సాగించేవారు.

ఈరీతిగా ఒక ఆదివారం సాయంకాలం వారిద్దరూ షికారుగా నడిచిపోతూఉన్నారు. లండను నగరంలో బాగా వ్యాపారపు సందడి ఉన్నటువంటి ప్రాంతంలో ఒకప్రక్క వీధిగుండా నడిచిపోతున్నారు. వీధి చిన్నదే. ప్రశాంతంగా ఉందని చెప్పవచ్చు.

మామూలు రోజులలో ఇక్కడ వ్యాపారం చురుకుగానే సాగుతూ ఉంటుంది. ఈ వీధిలో ఉండేవాళ్లు మంచి స్థితిపరులే. వ్యాపారం మరింత ఎక్కువగా చేసి ఎక్కువ లాభాలు గడించాలనే ఆశ కలవారుకూడా-- ఎందుచేతనంటే, తమ దుకాణాలకు బయటివైపున జనాన్ని ఆకర్షించే షోకులు అలంకారాలు చాలా చేశారు. ఆ షాపులన్ని సింగారించిన అంగనలవలె ఉన్నాయి. ఆనాడు ఆదివారంరోజున ఆ వీధిలో బండ్ల రద్దీ గాని, జనసమ్మర్దంగాని లేకపోయినప్పటికీ, ఆ చుట్టుపక్కల ప్రాంతంకంటె ఆ వీధి చాలా శోభాయమానంగా ఉంది. అడవిలో పోతూఉంటే ఆలయం కన్పించినట్లుగా ఉంది. వీధివైపు తలుపులు చక్కగా రంగులు వేయబడి ఉన్నాయి. చక్కగా తోమి తుడిచిన ఇత్తడి గుబ్బలు, కమ్ములు, బంగారంలాగున మెరుస్తున్నాయి. మొత్తంమీద వీధి అంతా తీర్చి దిద్దినట్లుగా తాజాషోకుతో కళకళలాడుతూ ఉంది.

వీధిలో ఒకమూలనుంచి తూర్పువైపుగా ఎడమవైపు యిండ్ల శ్రేణిలో రెండుయిండ్లు దాటగానే, సందు ఒకటి ఉంది. అక్కడనే ఒక పెద్ద భవనం వీధిమీదకు త్రోసికొని వచ్చినట్లుగా కన్పిస్తుంది. అది రెండంతస్తుల భవనం. క్రింది అంతస్తుకు ముందరివైపున కిటికీ ఏమీ లేదు. ద్వారం ఒకటి మాత్రం ఉంది. పైఅంతస్తుకు రంగు వెలిసిన గోడమాత్రము తెర కట్టి

నట్లుగా ఉంది. చాలాకాలంనుంచీ యీ యింటివిష యమై ఎవ్వరూ శ్రద్ధవహించడంలేదని దాని ముఖం చూస్తేనే తెలుస్తోంది. ఇంటిలోనివారిని పిలువడానికి తలుపునుకొట్టేటందుకు కొక్కెంగాని, బయట ఏదైనా గంటగాని ఏమీలేదు. తలుపుమీద రంగువూత చిట్లి, పగుళ్లు ఇచ్చింది. వీధిలో తిరిగేటటువంటి సోమరి పోతులు భవనం బయటభాగంలో హాయిగా పవళిస్తూ ఉంటారు. ఆ కిటికీలమీద నిప్పుపుల్లలు గీస్తూఉంటారు. అక్కడ ఉండే తిన్నెలమీదను దిమ్మలమీదను బడి పిల్లలు తమ పేనాకత్తులకు పదునుపెట్టూ ఉంటారు. రమారమి ఒక పురుషాంతరం యీ మధ్యకాలంలో, యీ చిల్లరజనాన్ని తరిమి వెళ్ళగొట్టినవా డెవ్వడూ లేడు. ఆ భవనమునకు వాళ్లుచేసిన పాడు పనులకు ప్రతిక్రియగా మరమ్మతులు చేసినవాడుకూడా ఎవ్వడూ లేడు.

ఎన్ఫీల్డునూ, లాయరునూ ఆ సందు మొద ట్లోకి రాగానే, ఎన్ఫీల్డు తన చేతిలోఉన్నకర్ర పైకెత్తి ఆయింటివైపు చూపించాడు.

"ఆ ద్వారబంధం ఎప్పుడైనా నీవు శ్రద్ధగా గమ నించావా?" అని ప్రక్కనున్న తన స్నేహితుణ్ణి ప్రశ్నించాడు. అతడు అవునని చెప్పగానే, "ఒక విచిత్రమైన విశేషం యీ ద్వారబంధం చూడగానే నామనస్సుకు జ్ఞాపకం వస్తూఉంటుంది" అని ఎన్ఫీల్డు అన్నాడు.

"నిజంగా! ఏమిటది?" అని అట్టర్సన్ స్వరం మార్చి ప్రశ్నించాడు.

"ఆ విషయం ఏమిటంటే" అని ఎన్ఫీల్డు అందుకొని ఆరంభించాడు. "ఒకనాడు శీతకాలం నేను అంతులేని దూరం వెళ్ళి తెల్లవారుజామున మూడు గంటలకు తిరిగి యింటికి వస్తూఉన్నాను. చీకటిగా ఉంది. ఈ నగరభాగ ప్రాంతంలోనే నేను నడిచి వస్తున్నాను కాని, ఆ ప్రదేశంలో దీపాలు దీపస్తంభాలు తప్ప ఏమీ కన్పించలేదు. వీధి వెంటవీధి దాటి నడుస్తున్నాను. జనం గాఢనిద్ర పోతున్నారు. వీధులలో దీపాలు బారులుతీర్చి ఊరేగింపుకు నిలువబడిన ట్లున్నాయి. రైలు వెళ్ళిన తర్వాత రైలు ప్లాటుఫారం ఉన్నట్లుగా వీధి అంతా నిర్జనంగా నిశ్శబ్దంగా ఉంది. వినిపించిన శబ్దములన్నీ ఆలకించి ఆలకించి, ఆఖరుకు ఎక్కడైనా ఒక పోలీసువాడు కన్పిస్తే బాగుండు ననే ధోరణిలో పడ్డాను. అప్పుడు హఠాత్తుగా రెండు ఆకారాలు నాకు కన్పించాయి. ఒక చిన్నసైజు మనిషి తూర్పుదిశగా చకచకా నడుస్తూ వస్తున్నాడు. ఎనిమిదేళ్లు ఉంటాయో, పదేళ్లుంటాయో, ఒక ఆడపిల్ల అడ్డంగా పోతున్న మరొక రోడ్డుమీద గబగబా పరుగెత్తుకుంటూ వస్తోంది. అడ్డరస్తా నిలువు రస్తా కలిసేచోట, ఒకరినొకరు ఢీకొట్టుకొన్నారు. అప్పుడే అమితఘోరమైనపని జరిగింది. ఆ మొగవాడు, క్రింద పడిపోయిన పిల్లనుపచ్చడిపచ్చడిగా త్రొక్కుకుంటూ,

నడిచి వెళ్ళాడు. నేలపైన పడిఉన్న పిల్ల కాకిగోల పెట్టి ఏడ్చింది. అది మాటలతో చెప్పితే అర్థమయ్యేది కాదు. అది కేవలం నరక వేదన అంటే నమ్మ. వాడు చూస్తే మనిషిలాగున లేడు. జగన్నాథ రథంలాగున నడిచి వెళ్ళాడు. వెంటనే నేను అరెరే అని ముందుకు పరుగెత్తుకొని వెళ్లి ఆ పెద్దమనిషి గొంతుక లంకించుకొని వెనుకకు లాగుకొని వచ్చాను. ఏడ్చి గోల పెట్టుతున్న ఆపిల్ల చుట్టూ, అప్పటికే కొంతమంది జనం, చేరారు. ఇంతపనిచేసిన ఆ పెద్దమనిషి అదరూ బెదరూ లేకుండా నిల్చున్నాడు. అతడు నన్ను ఎదిరించ డానికికూడా ప్రయత్నించలేదు. నావంకమాత్రము ఒక రాక్షసపు చూపు చూచాడు—దానితో నాకు ఒళ్లు చెమటలుపోసింది. అక్కడకు వచ్చిచేరిన జనం ఆపిల్ల బంధుజనమే—ఆపిల్లను డాక్టరుకోసం పంపించా రట. ఆ డాక్టరుకూడా అప్పుడక్కడకు హాజరైనాడు. పిల్లకు ఎక్కువ దారుణమైన దెబ్బలు తగులలేదు. "సాబోన్సు" అనే యింటిపేరుగలవాళ్ల పిల్ల అది. సాబోన్సు కుటుంబంవాళ్లు చెప్పినదానినిబట్టి, ఆపిల్ల పూర్తిగా బెదరిపోయింది. ఇంతటితో ఈకథపూర్తిఅయిం దని నీవు భ్రమపడవద్దు. మరొక విచిత్రవిషయంకూడా జరిగింది. ఆ పెద్దమనిషినిచూస్తే మొదట్లో నాకు బలే రోతపుట్టింది. ఆపిల్ల తాలూకు బంధువులకుకూడా రోత పుట్టింది. అక్కడకు వచ్చిన డాక్టరు వైఖరి మాత్రం నాకు చోద్యంగా ఉంది. అతడొక చిన్న డాక్టరు.

ముక్తసరిగా కత్తిరించినట్లు మాట్లాడే మనిషి. ఎడింబరో నగరపు యాస అతని మాటలలో ఉంది. స్కాట్లండు దేశపు సన్నాయి తిత్తిలాగున ఆయనకు ఆవేశం కూడా వస్తుంది. నా చేతజిక్కిన దొంగవలెక అతడు పరికించి చూచినప్పుడెల్లా, సాబోన్సు కుటుంబం తాలూకువారు ఆ దుర్మార్గుణ్ని హత్య చెయ్యాలన్న ట్లుగా కోపంతో కంపించారు. ఆ డాక్టరు మనస్సులో ఉన్న దేమిటో నేను గ్రహించాను. నా మనస్సులోది అతను గ్రహించాడు. హత్యమార్గ్యడం అనేది అసంభవం. అందువల్ల చేతనైనదానిలో ఉత్తమమైన పని చేశాం. ఆ పెద్దమనిషితో స్పష్టంగా చెప్పివేశాం. ఇప్పుడు జరిగిన యీ పనికి అతనిని తల ఎత్తుకొని తిరుగనివ్వకుండా లండను నగరంలో అంతా అతనిని అల్లరిచేసి అప్రతిష్ఠపాలు చేయగలమని తెలియబరిచాము. ఎవరైనా పెద్దమనుష్యులు అతనికి స్నేహితులుగా ఉన్నట్లయితే, అతనికి యీ ఊళ్ళో ఏమైనా పలుకుబడిగాని పరపతిగాని ఉన్నట్లయితే, వాని కన్నింటికీ సెల్లు వదలుకోవలసిందే అన్నాము. అతనితో యీ మాటలన్నీ మేము కాల్చి వాతబెట్టినట్లుగా చెప్పతూఉన్న సమయంలో, ప్రక్కనున్న ఆడవాళ్ళను దగ్గరకు రానీయకుండా దూరంగాఉంచాము. ఎందుచేతనంటే ఆడవాళ్లు లంకిణీల లాగున అతని చుట్టూ చేరి అతనిని మింగివేసేటట్లుగా ఉన్నారు. అంత కోపం కక్కుతూఉన్న ముఖాలు నేను ఎప్పుడూ

చూడలేదు. వాళ్ళందరి మధ్యనూ ఆ పెద్దమనిషి కొరివిలాగున వెకిలినవ్వు నవ్వుతూ నిల్చున్నాడు. మనిషి లోలోపల జంకుతూనే ఉన్నాడు. కాని, సైతాను లాగున కదలకుండా నిల్చున్నాడు. "ప్రమాదవశాత్తుగా జరిగినదానిని పట్టుకొని మీరు నన్ను పిండి సాధించ దలచినట్లయితే, నేను ఏమీ చేయలేను. అల్లరి చెయ్యాలనీ అల్లరిపాలు కావాలనీ ఏ పెద్దమనిషీ కోరడు" అని అతడు అన్నాడు. "నీ బేరం ఏమిటో లెక్క తేల్చి చెప్పు" అని అతనిని బొడ్డులో చెయ్యివేసి నిలువబెట్టి, ఆ పిల్లతాలూకు కుటుంబానికి వంద పౌనుల మొత్తం పరిహారం యిచ్చేటట్లుగా ఒప్పించాము. కొంచెం దేహశుద్ధికి సిద్ధమయ్యేవాడే. కాని, అతనిని ఏలాగయినా చిక్కులలో బెట్టి నొక్కుదామనే సంకల్పం మాలో చాలామందికి కలిగింది. అందువల్ల ఆఖరుకు అతడు ఆ బేరానికి ఒప్పుకొన్నాడు. ఇక తర్వాత జరుగవలసిన పని ఏమిటంటే పైకం వసూలు చేయడం. మమ్ములను వెంటబెట్టుకొని అతడు ఎక్కడికి యీడ్చుకొని వచ్చాడో తెలుసా? ఈ గుమ్మందగ్గరికే తీసికొని వచ్చాడు. జేబులో నుంచి ఒక తాళంచెవి తీశాడు. వెంటనే లోపలికి వెళ్ళి, పది బంగారు నవరనులు పట్టికొనివచ్చి, మిగతా 90 పౌన్లకు కూట్సుబ్యాంకుకు ఒక దర్శన హుండీ (చెక్కు) వ్రాసి యిచ్చాడు. ఆ హుండీమీద అతను సంతకంచేసిన పేరు సుప్రసిద్ధమైనది. తరచు

పత్రికల్లో కూడా కన్పించేది. ఈ కథలో ఆ పేరు ముఖ్యమైన అంశమేగాని ప్రస్తుతం నేను వెల్లడించడానికి వీలు లేదు. మనిషి ఖడాయించి ఉన్నాడు. సంతకంకూడా బాగానే చేశాడు అది సరియైన సంతకం అవునో కాదో అనిపించింది. ఆ పెద్దమనిషితో స్పష్టంగా అన్నాను. "అయ్యా! మీ వ్యవహారం అంతా చూస్తే నమ్మడానికి అవకాశం లేకుండా మిథ్యగా ఉంది. నిజమైన వ్యవహార ప్రపంచంలో చీకట్లో తెల్లవారుజామున నాలుగు గంటలకు ఎవ్వరున్నా ఒక మారుమూల యింట్లోకి చొరబడి వందపౌనుల మొత్తమునకు మరొకని పేరుతో హుండీ వ్రాసియివ్వడం జరగదు." అతడు నామాటలకు ఏమీ తోచక లేదు. కాని వెక్కిరించినట్లుగా పండు ఇకిలించాడు. "నీవు ఏమీ గాబరాపడకు. బ్యాంకులు తెరచేవరకు నేను మీతో ఉండి ఈ హుండీని నేనే రొక్కంగా మార్పించి పెడ్తాను" అన్నాడతను. అటుపిమ్మట, నేనూ, డక్టరూ, పిల్లింగ్రీ, మా మిత్రుడూ కలిసి బయలుదేరి, తెల్లవారేవరకూ నేనుఉన్న ఇంటిలోనే గడిపి తెల్లవారిన తర్వాత, రవ్వంత అల్పాహారం పుచ్చుకొని, మేమందరమూ ఒక్కముఠాగా బ్యాంకుకు వెళ్ళినాము. రొక్కంకోసం ఆ హుండీని బ్యాంకులో నేనే సమర్పించాను. అది దగా హుండీ అని నేను అనుమానించాను. కాని, అది ఎంత మాత్రమూ అటువంటిది కాదు. అది నికరమైనహుండీ.

"చా! చా!" అని అట్టర్సను ఆశ్చర్యంగా అన్నాడు.

"అవును. యీ కథంతా నాకు ఎట్లా కన్పిస్తున్నదో నీకు కూడా అదేవిధంగా కన్పిస్తోంది" అని ఎన్ఫీల్డు అతని మాట అందుకొని యిల్లా అన్నాడు. "అవును. యిదంతా చాలా అధ్వాన్నపు అవకతవక కథ. నిజమే. ఎందుచేతనంటే నేను ప్రస్తావించిన మనిషిని చూస్తే ఊరుపేరు లేని వట్టి బేవారసు కోన్‌కిస్కా మనిషిగా కన్పించాడు. కాని, అతనికి ఎవడో యింకో పెద్ద మనిషి వంద పౌనులకు బ్యాంకుహుండీ వ్రాసి యిచ్చాడు. హుండీ వ్రాసియిచ్చినటువంటి వాడెవరో గాని చాలా ఆస్తిగల ఆసామీలాగున కన్పించాడు. అంతే కాదు. పుణ్యకార్యాలు చేసే పెద్ద ఘరానా ఆసామీలాగున, మీ సమానస్థాయీ మనిషిలాగున, కన్పించాడు. ఒక దగుల్బాజీవాడు చేసిన పాడుపనికి పరిహారంగా మరొకమర్యాదస్థుడు కైకంకుమ్మరించడం చూస్తే, అతని పరువు తీస్తానని బెదరించి పైసా లాగినట్లుంది. అందుచేత యీ గుమ్మంగల యీ యింటిని, పరువుతీసి పైసాలాగే అప్రతిష్ఠ వ్యాపారపుకొంప అని నేను అంటాను. కాని, అంతమాత్రముచేత యీ యింటిమర్మం అంతా విశదమైనదని భావించవద్దు" అని ఎన్ఫీల్డు తన కథ ముగించి, ఏదో ఆలోచనలో పడ్డాడు.

"అయితే, ఆ బ్యాంకుహుండీని స్వదస్తూరీతో వ్రాసియిచ్చిన ఆసామీ యీ యింట్లో ఉన్నాడో లేదో నీకు తెలియదంటావా?" అని అట్టర్సన్ వెంటనే ప్రశ్నించాడు.

"ఇది మొత్తంమీద అటువంటి కొంప అవునంటావా? లేదా? హుండీ వ్రాసిన ఆసామీయొక్క చిరునామా నేను చూచినట్లే జ్ఞాపకం. అతడేదో చౌకుదగ్గర కాపురం ఉంటాడు" అని ఎన్ఫీల్డు ప్రత్యుత్తర మిచ్చాడు.

"అయితే, యీ గుమ్మంగల యింటి సంగతి ఏమైనా నీవు అడుగలేదా?" అని అట్టర్సన్ అన్నాడు.

"అదిమాత్రం నేను అడుగలేదు. నాకు అది సున్నితమైన అమర్యాదవిషయంగా కన్పించింది. ఇతరులను నిలువబెట్టి సోదాచేసినట్లుగా ప్రశ్నలువేయడం నాకు మనస్కరించదు. ఒక ప్రశ్న వేయడం ప్రారంభిస్తే కొండమీదనుంచి బండరాయి దొర్లించినట్లుగా ఉంటుంది. ఆ రాయివెంట యితర రాళ్ళు కూడా దొర్లుకుంటూ వస్తాయి. అది వెళ్ళి వెళ్ళి తలవని తలంపుగా ప్రక్కతోటలోని ఏ ముసలివాని నెత్తిమీదనో విరిగిపడ్తుంది. ఇంటివాళ్ళకు చెడ్డపేరు వస్తుంది. అందువల్ల ప్రశ్నలు అడగడం అంటే సూదికోసం సోది అడిగినట్లుగా అవుతుంది. అందువల్ల నాకు ఏదయినా "వింత వీధి"గా తోస్తే దాని వివరమే అడగను" అని ఎన్ఫీల్డు అన్నాడు.

"ఇది మంచిపద్ధతిగానే ఉంది" అని లాయరు అట్టర్సన్ అందుకున్నాడు.

ఎన్ఫీల్డు తిరిగీ యిలా ప్రస్తావించాడు. "నేను ఈ కాంపసంగతి కొంత పరిశీలించాను. ఇది కాపురంఉండే యిల్లులాగున లేదు. దీనికి రెండో ద్వారం కన్పించదు. ఈ ఒక్క ద్వారంగుండా అయి నప్పటికీ, వచ్చిపోయేవా డెవ్వడూ కన్పించడు. ఎప్పుడో ఒకనాడు నాకథకు సంబంధించిన మనిషి మాత్రము ఆయింట్లో ప్రవేశిస్తూ ఉంటాడు. క్రింద అంతస్తులో మూడుకిటికీలు ఉన్నాయి. అవి యీసందు వైపుకు తిరిగి ఉన్నాయి. ఇంటిక్రిందిభాగంలో కిటికీలు లేనేలేవు. ఈ కిటికీలు ఎప్పుడూ మూసిఉంటాయి గాని శుభ్రంగానే ఉంటాయి. ఇంటికి పొగగూడు ఉంది. దానిలోనుంచి పొగపైకి లేస్తూనే ఉంటుంది. కాబట్టి యింట్లో ఎవరో కాపురం ఉంటున్నారని అర్థం — కాని, అదికూడా నిర్ధారణగా చెప్పలేము. ఈచౌకులోఉండేయిళ్లన్నీ ఒకదానిమీాద యింకొకటి క్రిక్కిరిసి ఉంటాయి. అందువల్ల ఏ యింటి హద్దు ఎక్కడివరకో చెప్పలేము."

పైరీతిగా ఎన్ఫీల్డు ముగించిన తర్వాత ఎన్ఫీ ల్డున్నూ అట్టర్సనున్నూ కలిసి కొంతసేపు మౌనంగా నడక సాగించారు. అప్పుడు అట్టర్సను యిలాఅన్నాడు. "ఎన్ఫీల్డు! నీపద్ధతిమాత్రం మంచిపద్ధతి."

"నా అభిమతంకూడా అంతే" అని ఎన్ఫీల్డు అన్నాడు.

"అదంతా సరేగాని, ఒక్కవిషయం నిన్ను అడుగవలెననుకొన్నాను. ఆ పిల్లమీాదనుంచి నడచి వెళ్లిపోయిన మనిషి పేరేమిటి? అదే నిన్ను అడుగవలెననుకున్నాను" అని అట్టర్సన్ అన్నాడు.

"సరి. పేరుచెప్పితే వచ్చినప్రమాదంఏముందిలే. —అతడు 'హైడ్' అనే పేరుగల పెద్దమనిషి."

"అల్లాగా! అత డెల్లా ఉంటాడు చూాడడానికి?" అని అట్టర్సన్ ప్రశ్నించాడు

"అతన్ని వర్ణన చేయడం తేలికైన పనికాదు. అతని ఆకారంలోనే ఏదో అవకతవక ఉన్నట్లుగా కన్పిస్తుంది. ఏదో అసహ్యంగా, రోతగా ఉంటాడు. ఎందుచేతనో చెప్పలేనుగాని అంత వెగటైన మనిషిని నాజన్మలో చూడలేదు. అతని రూపురేఖలలో ఎక్కడో వికృతలక్షణం ఉంది. ఆ వికృతం ఎక్కడ ఉన్నదో వివరించలేను. చాలావిపరీతమైనరూపం అతనిది. ఆ వైపరీత్యం ఏమిటో వేలుపెట్టి చూపలేను. అతని రూప మేమిటో నాకు అంతు చిక్కడంలేదు. వివరంగా వర్ణించలేను. అతని ఆకారం నాకు జ్ఞాపకం లేకపోవడం కాదు. ఇప్పుడు కూడా నా కండ్లకు కట్టినట్లుగా ఉన్నాడు" అని ఎన్ఫీల్డు సమాధానమిచ్చాడు.

అట్టర్సన్ తిరిగి కొంతదూరం మౌనంగా నడక సాగించాడు. బహుశః ఏదో ఆలోచనలో పడ్డాడు. "అయితే, అతడు తాళంచెవిని ఉపయోగించిన మాట నిశ్చయమేనా?" అని ఆఖరుకు ప్రశ్నించాడు.

"బలేవాడివి నీవు!......" అని ఎన్ఫీల్డు ఆశ్చర్య సూచకంగా అన్నాడు.

అట్టర్సన్ అందుమీదట అంది పుచ్చుకొని, "ఇదంతా వింతగానే కన్పిస్తుంది—నాకు తెలుసు. రెండో ఆసామీ పేరు నిన్ను అడుగుటలేదు. ఎందు చేతనంటే, ఆ రెండో ఆసామీ పేరు నాకు అప్పుడే తెలిసింది, రిచర్డు ఎన్ఫీల్డ్! నీవు చెప్పిన కథంతా నాకు అంతు చిక్కింది. నీవు చెప్పిన విషయములలో ఎక్కడైనా తేడాలుంటే సరిచూచుకో" అన్నాడు.

"ఎందుకైనా మంచిదని నీవు నన్ను హెచ్చరిస్తున్నావు. కాని, నేను చెప్పిన విషయాలన్నీ తూచాలు తప్పకుండా వ్యాసప్రోక్తంగా చెప్పాను. అతనివద్ద తాళంచెవి ఉంది—అంతే కాదు. అతనివద్ద అది యిప్పటికీ ఉంది—వారంరోజులుకూడా కాలేదు. తిరిగి అతడది ఉపయోగిస్తూఉండగా నేను కళ్లార చూచాను" అని ఎన్ఫీల్డు జవాబు యిచ్చాడు.

అట్టర్సన్ దీర్ఘంగా ఒక నిట్టూర్పు విడిచాడు. కాని ఏమీ మాట్లాడలేదు. అప్పుడు ఆ యువకుడు ఎన్ఫీల్డు యిలా అన్నాడు. "మరొక్క నీతిపాఠం నేను నేర్చుకోవాలి. నేను నాలుక బుజాన వేసికొని వాగు

తూఉండడం నాకే బాగాలేదు. ఈ విషయమై మనం తిరిగీ ప్రస్తావన చెయ్యకూడదనే ఒప్పందం ఒకటి చేసికోవాలి."

"నా మనస్ఫూర్తిగా నీకు ఆ ఒప్పందం చేస్తాను. రిచర్డూ! ఇదిగో నీ చేతిలో చేయి వేస్తాను" అని లాయరు వాగ్దానంచేశాడు.

## 2. హైడ్‌కొరకై అన్వేషణ

ఆనాటి సాయంకాలం అట్టర్సను తన ఇంటికి వచ్చాడు. అది బ్రహ్మచారి నివాసం. అట్టర్సను గ్లూమీగా ఉన్నాడు. భోజనానికి కూర్చున్నాడు. కాని తిండిమీద ధ్యాసలేదు. సామాన్యంగా ఆదివారంరాత్రి భోజనం అయినతోడనే ఆయన ఏదైనా భగవత్సంబంధమైన గ్రంథమొకటి తన బల్లమీద ఉంచుకొని నెగడు ప్రక్కనే వెచ్చగా పారాయణం చేస్తూ కూర్చుండడం అలవాటు. చేరువలో ఉన్న చర్చిలో రాత్రి 12 గంటలు కొట్టినతర్వాత నిద్రపోవడం అలవాటు. కాని, యీ ఆదివారంనాటి రాత్రి భోజనానంతరం బల్లమీదిగిన్నెలు వగైరా తీసివేయబడినతోడనే, ఒక కొవ్వొత్తిగీపం చేతబట్టి తన కచేరీ గదిలోకి వెళ్లాడు. అక్కడ ఒక ఇనుపపెట్టెను తెరచి దానిలో అంతర్గర్భితంగా దాచియుంచబడిన ఒక దస్తావేజును పైకితీశాడు. "డక్టరు జెకిల్‌వీలునామా"

అని ఆకవరుమీద వ్రాయబడి ఉంది. అందులో ఉన్న విషయములను అతిశ్రద్ధగా ఏకాగ్రచిత్తంతో పరిశీలించడం ప్రారంభించాడు. డాక్టరు జెకిల్‌గారి ఈ వీలునామా యావత్తూ ఆయన స్వహస్తంతో నే వ్రాయబడింది. సదరు వీలునామాను తయారు చేయడంలో అతనికి అట్టర్సను కించిత్తయినా తోడ్పడ లేదు. కాని, తయారుచేయబడిన వీలుకాగితాన్ని తాను భద్రపరచి ఉంచుటకు మాత్రము ఒప్పుకొన్నాడు. హెన్రీ జెకిల్, యం. డి., డి. సి. యల్., యల్. యల్. డి., యఫ్. ఆర్. యస్., వగైరా వగైరా గతించిన పక్షమున అతని ఆస్తులూ పొత్తులూ అన్నీ అతని "మిత్రుడున్నూ క్షేమాభిలాషియున్నూ అయిన ఎడ్వర్డు హైడ్"కు సంక్రమించవలెను అని ఆ వీలునామాలో వ్రాయబడి ఉంది. అంతేకాదు. డాక్టరు జెకిల్ ఒకవేళ "మూడు నెలలకుమించి అదృశ్యుడైనపక్షంలో గాని, దురూహ్యమైన కారణాలవల్ల గైరు హాజరైన యెడలగాని," సదరు ఎడ్వర్డు హైడ్ అను నతడు డాక్టర్ జెకిల్ యింటిలోని కొందరికి బట్వాడా చేయవలసిన కొన్ని స్వల్ప మొత్తములను యిచ్చివేయవలసిన బాధ్యత తప్ప ఏయితర పూచీలు పేచీలు లేకుండా కించిత్తు కాలహరణం లేకుండా హెన్రీ జెకిల్ యొక్క స్థానే, ఆస్తికి సర్వాధికారి కావలెను అని ఆవీలునామాలో వ్రాయబడి ఉన్నది. చిరకాలంనుంచీ అట్టర్సనుగారికి యీ వీలునామా అంటే కన్నెఱ్రగానే

ఉంది. ఆయనయొక్క లాయరుతత్వానికి అది చాలా వెగటుగా ఉంది. అంతేకాదు. సాధారణ మైన లోకమర్యాద పద్ధతులనుబట్టి కూడా ఆ సీలు చామా ఆయనకు వెగటుగా ఉంది. ఇంత వెర్రి పోకడలుపోవడం ఆయనకు బేమర్యాదగా కన్పిస్తూ ఉంటుంది. ఇంతకాలంనుంచి హైడ్ అంటే ఎవరో తెలియకపోవడంవల్లనే ఆయానకు అంత కడుపు మంటగా ఉండేది. ఇప్పుడు యీ హైడ్ సంగతి హఠాత్తుగా చెవిని పడుటవల్లనే ఆయన ద్వేషభావము మరింత హెచ్చింది. హైడ్ అంటే ఎవరో అజ్ఞాత పురుషుడనిన్ని కల్పన అనిన్ని ఆయనకు స్థిరాభిప్రాయం ఏర్పడింది. అందువల్లనే ఆయనకు అసహ్యం కలిగింది. ఇప్పుడు యీ హైడ్ అనబడేవాడు చాలా హేయలక్షణాలు కలవాడని తెలిసినతర్వాత అసహ్యం మరింత అధికమైంది. ఇదివరకు ఏవో ఊహాలు మేఘాలులాగున ఆయనకు హైడ్ నుగురించి ఉండేవి. కాని యిప్పుడు కేవలము ఒక రాక్షసప్రకృతి ప్రత్యక్ష మైనట్లుగా ఉంది ఆయన కండ్లముందు.

ఆ రోత కాగితాన్ని తిరిగి యినుపపెట్టెలో దాచి వేస్తూ "ఇదంతా ఒక వెర్రి తరహా అనుకున్నాను. కాని, యిప్పుడిది కేవలము హేయమైన అవమానకర మైన వ్యవహారం అని నాకు తోస్తోంది." అన్నాడు.

ఆ మాటలు తనలో తాను అనుకొని, ఆ కొవ్వొత్తిని ఊది ఆర్పివేసి, పెద్ద బురఖాకోటు తొడుగుకొని,

కావెండిష్‌స్క్వేరు వైపు బయలుదేరాడు. అక్కడ ఇతని స్నేహితుడైన డాక్టరు లాన్యనుగారియిల్లు ఉంది. ఆయనవద్దకు వచ్చేరోగులు అందరూ అక్కడికేవస్తారు. "ఈ విషయంగురించి ఎవరికైనా తెలిసిఉంటే, లాన్యనుకు మాత్రమే తెలియాలి" అని తనలో తాను అనుకున్నాడు.

అక్కడికి వెళ్లగానే అక్కడఉండే బట్లరు ఆయనను గుర్తుపట్టి లోపలికి దయచేయండి అన్నాడు. అనవసరమైన కాలహరణం చేయకుండా, వాకిలి గుమ్మం నుంచి సరాసరి భోజనంచేసే గదిలోనికి తీసికొని వెళ్లాడు అక్కడ డాక్టరు లాన్యనుగారు ద్రాక్షారసం స్వీకరిస్తూ ఒంటరిగా కుర్చీలో కూర్చున్నారు. మనిషి సదయహృదయుడు, సరసుడు. ఎర్రని మొగం-తోందరగా నెరిసిన వెంట్రుకలు తలనిండా ఉన్నాయి. సందడి మనిషి—ఖండితంగా మాట్లాడుతాడు. అట్టర్సను లోపలికి రాగానే, తన కుర్చీలోనుంచి తటాలున లేచి రెండుచేతులతో ఆయనకు ఆదరణగా స్వాగతమిచ్చాడు. మనిషియొక్క ఆదరణచూస్తే నాటకంలో నటించినట్లుంటుంది--కాని, హృదయంలోనుంచి వచ్చిన నిజమైన ఆదరణ అది

వీరిద్దరూ పాత స్నేతులు. స్కూలులోను కాలేజీలోను కలిసి చదువుకొన్నారు. ఉభయులూ ఆత్మగౌరవం అన్యోన్యగౌరవం కలవారు. అంతేగాక, ఇద్దరూ సమావేశమైనప్పుడు ఒకరినిచూస్తే ఇంకొకరి

ప్రాణం లేచివచ్చినట్లుగా చాలా సరదాగా కాలక్షేపం చేస్తారు.

మొదట్లో కొంత ఇష్టాగోష్ఠి జరిగిన తర్వాత లాయరు తన మనస్సును కలవరపెట్టుతున్న అసలు విషయాన్ని ప్రారంభించాడు.

"హెన్రీ జెకిల్ కు ఉన్న టువంటి ఆ బాల్యమిత్రు లలో మన మిద్దరమూ అతి పురాతన వృద్ధమిత్రులమని నా అభిప్రాయం-ఏమంటావు లాన్యన్?" అని అట్టర్సను ప్రస్తావించాడు.

"ఈ పాతమిత్రులు పడుచువాళ్లయితే బాగుం డునని నా కోరిక - మనం అట్లాగే ఉన్నామనుకుం టాను - అయితే సరేగాని, ఆ సంగతెందుకు? ఇప్పుడు అతను కంటికి కన్పించడంలేదే!" అని డాక్టరు లాన్యను అన్నాడు.

అట్టర్సను ఆ మాట విని, "నిజంగా! మీ కిద్ద రికీ అన్యోన్యానుబంధం చాలా ఉన్నదని అనుకుంటు న్నానే!" అన్నాడు.

"మా కిద్దరికీ అన్యోన్యానుబంధం చాలా ఉన్న మాట నిజమే. హెన్రీ జెకిల్ నాతో ఖులాసాగా మాట్లాడి ఇప్పటికి పదేండ్లకుపైగా అయింది. అతని కేదో బుద్ధి పెడత్రోవల పట్టింది. ఏదో పాతకాలపు స్నేహంవల్ల అతని విషయమై నేను వ్యాకుల పడు తూవచ్చాను కాని, ఆ మనిషి యిప్పుడు హుష్‌కాకి

అన్నట్లుగా ఆచూకీ చిక్కకుండా ఉన్నాడు. అతను చేసే అకటావికటపు పిడివాదాలమూలంగా ఎటువంటి పరమమిత్రులైనా పరాయివాళ్ళవుతారు" అని డాక్టరు లాన్యను అన్నాడు.

ఈవిధంగా అతడు పెదవివిరుస్తూ జెకిల్ విషయంలో మాట్లాడినందువల్ల అట్టర్సనుకు కొంతవరకు సేదతీరినట్లుగా ఉంది. వారిద్దరికీ శాస్త్రవిషయ చర్చలోనే ఏదో భేదాభిప్రాయం కలిగిఉంటుందని అట్టర్సను అనుకొన్నాడు. అటువంటి శాస్త్రసంబంధమైన రగడలో అట్టర్సను ఆసక్తికలవాడు కాడు అందువల్ల "అంతకంటె అప్రాచ్యమైన విషయం మరేమి లేదు కదా?" అని అట్టర్సను తలఊపుతూ అన్నాడు. తన మిత్రుడైన డాక్టరు లాన్యను కొంచెం సంబాళించుకొనేటందుకు కొలదిక్షణముల వ్యవధియిచ్చి తాను వచ్చిన అసలు పనినిగూర్చి ప్రస్తావన సాగించాడు.

"అతని ఆప్తాభిమాని 'హైడ్' అనే పెద్దమనిషినిగూర్చి నీకు ఏమైనా తెలుసునా?" అని ప్రశ్నించాడు.

"హైడ్ ఏమిటి? నేనెప్పుడూ వినలేదే! నేను పుట్టినతర్వాత ఆపేరు వినలేదు" అని లాన్యను బదులు చెప్పాడు.

ఈ స్వల్ప సంజాయిషీ మాత్రమే అట్టర్సనుకు లభించింది. దానితోనే అట్టర్సను తిరిగి తన మకామునకు

తాను చేరి తన పడకమీద పరుండి పరిపరి విధాలుగా ఆలోచిస్తూ, తూర్పు తెల్లవారేవరకు ఇటుఅటు దొర్లుతూ ఉన్నాడు. అతనిది అసలు తీరిక లేని మెదడు- ఆ రాత్రిఅంతా ఏవేవో సందేహాలూ, ప్రశ్న పరంపరలూ అతని మనస్సును వేధిస్తూనే ఉన్నాయి

అట్టర్సను యింటికి సమీపంగా ఉన్న పాదరీ గుడిలో తెల్లవారుజామున ఆరుగంటలు కొట్టడం అతను విన్నాడు. కాని, అతని మనస్సును బాధిస్తున్న సమస్యను అతనింకామధిస్తూనేఉన్నాడు. ఇంత వరకూ ఈ విషయాన్ని వ్యవహార సరళిగా తర్కించాడు. కాని యిప్పుడు ఆ కథంతా విచిత్రగాథలాగున, అతని గదిలోని తెరమీద ఆడిన బొమ్మలాటవలె కన్పించింది. ఎన్ఫీల్డు చెప్పినదంతా కండ్లకు కట్టినట్లుగా ఉంది. రాత్రివేళ మహానగరంలో బారులుతీర్చిన దీపాలు- చకచకా నడిచిపోతున్న ఒక మనిషి ఆకారం— డాక్టరు యింటినుంచి పరుగెత్తికొని వస్తున్న ఒక ఆడ పిల్ల -ఇద్దరూ డీకొట్టుకొనడం—జగన్నాథ రథంలాగున ఆ పిల్లను త్రొక్కుకుంటూపోవడం—ఆ కుర్రదాని ఏడ్పులు లక్ష్యంచెయ్యకపోవడం—ఇవన్నీ అతని మనస్సులో మెదులుతున్నాయి. లేదా, మంచి సంపన్నమైన ఒకయింట్లో ఒక చక్కని గదిలో తన మిత్రుడు నిద్ర పోతూ ఉండడం - ఏదో స్వప్నప్రపంచంలో అతడు తనలోతాను నవ్వుకుంటూఉండడం; ఇంతలో అతని

పడక గదితలుపు తెరచుకొని మరొక మనిషి అతని కళ్లెదుట నిలువబడడం; ఆ మనిషి అభిమతానుసారం అట్టి అర్ధరాత్రివేళకూడా మన మిత్రుడు విధేయుడై ప్రవర్తించడం—ఇవన్నీ అతని కళ్ళల్లో ఆడుతున్నట్లుగా కన్పిస్తున్నాయి.

ఈ రెండు ఘట్టాలలోనూ ఈకథానాయకుడైన వ్యక్తి ఆ లాయరు మనస్సును రాత్రి అంతా వేధిస్తూనే ఉన్నాడు. ఎప్పుడైనా మధ్యలో కునికిపాట్లు పడినట్లయితే, ఆ నిద్రమత్తులోకూడా నగర నిద్రాణభవనములగుండా దొంగచాటుగా మసలుచున్న మనిషి లీలగా కన్పిస్తూఉంటాడు. లేదా, ఇంకా గాఢంగా నిద్ర కళ్లమీద తూగుతూఉన్నట్లయితే, దీపాలవెల్తురులో మెలికలు తిరిగిన ఆ మహానగరవీధులలో ఏవీధివంక తిరిగినప్పటికీ, ఆడపిల్లను ఘోరంగా కాళ్ల క్రింద త్రొక్కడం, ఏడుస్తున్నపిల్లను కళ్లార చూస్తూ విడిచివెళ్లడం—ఇవే దృశ్యాలు అతని తలలో తిరుగుతున్నాయి. ఆ నిద్రకళలోకూడా, ఆస్వప్నావస్థలో కూడా, ఆ ఘోరపురుషుని ముఖం యిట్టిదనే ఊహ ఏమీ తట్టడంలేదు. అతడు ముఖంలేని ప్రముఖుడుగా ఉన్నాడు. అతడేదో అవాఙ్మానసగోచరుడుగా అగమ్యగోచరుడుగా అయోమయస్వరూపిగా ఉండి ఊహాతీతుడగుటవల్ల, హైడ్ ఎట్టివాడో ప్రత్యక్షంగా చూడవలెననే సంకల్పం లాయరుకు నానాటికి తీవ్రమైంది. ఒక్కపర్యాయము అతనిని కంటితో చూచి

నట్లయితే యీ అగమ్యగోచర వ్యవహారంలోఉన్న తెరమరుగు అంతా తేటతెల్లమవుతుంది గదా అని మనస్సులో ఒకసారి అనుకున్నాడు. తన మిత్రుడు ఆమనిషియెడల అంతటి విచిత్ర విపరీత గాఢాభిమానం ఎందుకు కలిగియున్నాడో, తన మిత్రుని వీలునామాలో వింత విపరీతపరతు వాక్యాలు ఎందుకు ఉన్నాయో అదంతాకూడా చాలావరకు బోధపడగలదు. ఏమైనప్పటికీ ఆమనిషిముఖం ఒకసారి చూడవలసినదే— పొట్టకోసిచూచినా కించిత్తయినా దయా దాక్షిణ్యం లేని మనిషిముఖం—ఎన్నెల్లకు ఎక్కడలేని ద్వేషం అసహ్యం కలిగించినటువంటి మనిషిముఖం, ఎట్లా ఉంటుందో ఒకసారి చూడదగినదే అని అట్టర్సను నిశ్చయించుకొన్నాడు.

అది మొదలుకొని షాపులూ దుకాణాలతో కిక్కిరిసియున్న ఆ ప్రక్కసందులోని యింటిగుమ్మం వద్దకు తరచు వెళ్లసాగాడు. ఆఫీసులకు వెళ్లే వేళకు కొంచెముందుగా ఆ యింటిగుమ్మంవద్దకు పోయిచూచేవాడు. వర్తకవ్యాపారం చురుకుగా జరిగే సమయంలో కూడ మధ్యాహ్నవేళ వెళ్లేవాడు. ఆ మహానగరంలో పొగమంచులో అర్ధరాత్రివేళకూడా అక్కడికి వెళ్లేవాడు. ఎటువంటి ఏకాంత నిశ్శబ్ద నిర్జనసమయములలోనైనా, జనసమ్మర్దం ఎక్కువగా ఉన్న రద్దీ సమయములలోనైనా, తాను శోధించదలచిన ప్రదేశానికి వేంచేస్తూ ఉండేవాడు.

"అతడు అంతర్థానమయ్యే మానవుడైతే, నేను అతని అంతరార్థం గ్రహించే మానవుడను కావాలి" అని తన మనస్సులో అనుకున్నాడు.

ఏమైతేనేమి? చిట్టచివరకు అతనికృషి ఫలించింది—ఒకనాటి రాత్రివేళ అది. వీధులన్నీ ఖాళీ చేసిన నాట్యమందిరముల లాగున ఉన్నాయి. వీధులలోని దీపాలు ఆ నిశీథమందు గాలికి తూలక నిశ్చలంగా ఉన్నాయి. వీధివెంట నీడలూ వెలుగులూ ముగ్గులు తీర్చినట్లుగా ఉన్నాయి. రాత్రి పదిగంటల వేళప్పుడు ఆప్రక్కనందు అంతా నిర్మానుష్యంగా ఉంది. లండనునగరపు ఘోష నీరసించిన మూలుగు లాగున వినిపిస్తూనే ఉంది. అయినప్పటికీ ఆసందు అంతా గుప్ చప్ గా ఉంది. చీమ చిటుక్కుమంటే వినబడుతూ ఉంది. ఇండ్లల్లో ఏకించిత్తుశబ్దం అయినప్పటికీ ఎంతో దూరం వినిపిస్తోంది. ఆ వీధిలోకి ఎవడైనా నడచివస్తున్నాడంటే, ఆ కాలిచప్పుడు అతడు అడుగుపెట్టకముందే ఆలకించవచ్చు. అట్టర్సను తన గస్తీపనిమీద అక్కడకు హాజరై కొన్ని నిమిషాలు గడిచాయి. అప్పుడొక అడుగుచప్పుడు విడ్డూరంగా వినిపించింది. కొన్నిదినాలనుంచీ యీవిధంగా యీ వీధిలో ఒంటరిగా రాత్రిళ్లు మాటువేసి తిరుగుతూ ఉండడం అట్టర్సనుకు అలవాటైంది. ఇటువంటి కాలి చప్పుళ్లు అప్పుడప్పుడు అతను వింటూనే వచ్చాడు.

ఆ లండనునగరపు అర్ధరాత్రి నిద్రగుర్రులో అట్టి అడుగుల చప్పుడు, అసలు మనిషి కన్పించకపూర్వమే, అతని చెవికి ఆచూకీ యిచ్చినట్లుగా వినిపించేది. కాని, యీ పర్యాయము వినిపించిన బూటుల చప్పుడు మాత్రము అతనిని "అవధరింపుడు" అన్నట్లుగా హెచ్చరించింది. ఈరాత్రి తన కృషి ఫలించగల దనే నమ్మకము అతనికి అప్రయత్నంగా కలిగింది. ఆ నమ్మకంతోనే ఆసందు మొదట్లోకి అట్టర్సను మెల్లిగా నడిచాడు.

ఆ సందులోనికి వస్తున్న మనిషి అడుగులు కొంచెం వడిగా వేశాడు. అడుగుల చప్పుడు వీధికొనకు రాగానే మరింత పెద్దగా వినిపించాయి. సందు మొదట్లోకి లాయరు వచ్చి నిల్చుండి చూచేసరికి తనతో వ్యవహార సంబంధం ఉన్న ఆ మనిషి ఎటువంటివాడో బాగా చూచాడు. ఆ మనిషి పొట్టివిగ్రహం—సాదా దుస్తులలో ఉన్నాడు. అంత ఎదురుగా నిల్చుండి చూచినప్పటికీ ఆ మనిషి ఆకారం చూచేవానికి చూడబుద్ధి అగుటలేదు. అయినప్పటికీ, ఆ గుమ్మం వైపుకు ముందంజవేశాడు. స్వగృహానికివచ్చి చేరుకొన్న యింటియజమానివలె జేబులోనుంచి తాళంచెవి తీశాడు.

అట్టర్సను కొంచెం ముందుకువచ్చి అతని బుజం మీద చెయ్యివేసి తట్టి "మీరే హైడ్ అనుకుంటాను-అవునా ?" అన్నాడు.

హైడ్ కొంచెం వెనుకకు జంకి, ఒక్కదమ్ముగాలి ఎగపీల్చాడు. అతని జంకు క్షణమాత్రమే కన్పించింది. లాయరుముఖంవైపు అతడు తేరిపారచూడలేదు. కాని, "అదే నా పేరు. అయితే, మీకేం కావాలి?" అని ప్రశ్నించాడు.

"మీరు లోపలికి పోతున్నా రనుకుంటాను. నేను డాక్టరు జెకిల్‌కు స్నేహితుణ్ని - నా పేరు అట్టర్సన్ .. గాంట్ వీధిలో నేను ఉంటేది—నా పేరు మీరు వినిఉంటారు. ఇప్పుడు తిరికగా మన మిద్దరమూ కలిసికొనడం సంభవించింది కనుక నాకుకూడా లోనికి అనుజ్ఞ యిస్తారా?" అని లాయరు అన్నాడు.

"డాక్టరు జెకిల్ మీ కిప్పుడు కన్పించడు—ఆయన ఇంట్లో లేడు" అని హైడ్ తన తాళంచెవిని ఊదుతూ అన్నాడు. అంతటితో ఊరుకొనక, తల పైకెత్తకుండా నే, చివాలున యిలా అన్నాడు. "అయితే నన్ను మీరు ఎట్లా ఎరుగుదురు?"

అప్పుడు అట్టర్సను యిలా అన్నాడు "మీరు మాత్రం నా కొక సహాయంచేయగలరా?"

"చిత్తం - అభ్యంతరమేమిటి? అల్లాగే చేస్తాను. ఏమిటది మీకుకావలసింది" అని ఆ మనిషి ప్రశ్నించాడు.

"మీ ముఖం ఒకసారి నన్ను చూడనిస్తారా?" అని లాయరు అడిగినాడు.

హైౕడ్ కొంచెం సంకోచించినట్లుగా కన్పించాడు. కాని, అంతలో ఏమనుకున్నాడో, వెంటనే ఎదురు తిరిగి ధిక్కరించినట్లుగా, అట్టర్సను ముందర ముఖాముఖి నిల్చున్నాడు. కొలది రెప్పపాట్లకాలం ఇద్దరూ ఒకరిముఖం ఇంకొకరు ఎగాదిగా చూచుకొన్నారు. "ఇక మీరు నాకు గుర్తుఉంటారు. ఎరుక ఎందుకైనా అక్కరకు వస్తుంది" అని అట్టర్సన్ అన్నాడు.

"అవును. మనం కలిసికొనడం మంచిపనే అయింది. ముందుగా నా అడ్రెసు మీవద్ద ఉండాలి" అని చెప్పి సోహో చౌకులోని ఒకవీధినెంబరు చెప్పాడు.

"వీడిల్లు బంగారంగాను! వీలునామా సంగతి వీడి బుర్రలోకూడా ఉన్నట్లుంది!" అని లాయరు తనలోతాను అనుకొని పైకి ఏమీఅనకుండా, అతడు అతని అడ్రెసు చెప్పినందుకు "చిత్తం" అని గొణిగి ఊరకున్నాడు.

"అయితే, నాసంగతి మీకెట్లా తెలుసు?" అన్నాడు ఆమనిషి.

"మిమ్మలను గూర్చిన వర్ణనవల్ల" అని జవాబు యిచ్చాడు.

"ఎవరి వర్ణన ?"

"మనకు సమష్టి సంబంధంగల మిత్రులు ఉన్నారు" అని అట్టర్సను అన్నాడు.

"సమష్టిమిత్రులా! ఎవరబ్బా వారు ?" అని హైౕడ్ బొంగురుపోయిన కంఠంతో అన్నాడు.

"ఉదాహరణకు కావాలంటే, జెకిల్ మన స్నేహితుడే" అన్నాడు లాయరు.

"అయితే, అతడు నీకు నాసంగతి అంతా వర్ణించి ఎప్పుడూ చెప్పిఉండడు. కాని, మీరు అబద్ధ మాడుతున్నారని మాత్రం నేను అనలేను" అని కోపా వేశంగా హైడ్ అన్నాడు.

అట్టర్సను ఆమాటవిని, "ఏమండోయి! మీరు మాట్లాడేది సరసంగా మర్యాదగా మాత్రంలేదు" అన్నాడు.

ఆ రెండోమనిషి పండ్లికిలించి అడవిమనిషి లాగున బిగ్గరగా నవ్వాడు. మరుక్షణంలో అతి చలా కిగా, తాళం త్రిప్పి తలుపుతెరచి ఇంట్లోకి వెళ్లి అదృశ్యుడైనాడు.

హైడ్ నిష్క్రమించిన తర్వాత అట్టర్సన్ నివ్వెర పోయినిల్చున్నాడు. అటుపిమ్మట వీధి ఎగువకు మెల్లిగా అడుగులువేస్తూ, మధ్యమధ్య రెండేసి అడుగుల కొక సారి ఆగి, ఏదో ఆలోచిస్తూ తికమక పడ్తున్న రీతిగా తన నొసలును చేతితో పట్టుకొనడం ప్రారంభించాడు. అతడప్పుడు మథిస్తున్న విషయం సామాన్యధోరణిలో పరిష్కార మయ్యేదికాదు. హైడ్ ముఖం పాలిపోయి నట్లుంది. మట్టిగుజ్జు వాడ ల్లేఉన్నాడు. అతనికి జన్మతః ఏర్పడిన అంగవైకల్యం లేకుండానే మనిషియందు వికృత స్వరూపం కన్పిస్తోంది. చిరునవ్వు నవ్వినా

వెక్కిరించినట్లుగా వెగటుగా ఉంటుంది. లాయరుతో మాట్లాడినంత సేపూ, పిరికిగుండె వాడు పైకి దబాయించినట్లుగా, ఖూనీ చేసిన వాని ధోరణిగా, అదరా బాదరాగా, కంగారైన కంఠస్వరంతో అతను మాట్లాడినాడు. ఇవన్నీ అతని తరహాలో పాడులక్షణాలే--ఇన్ని అవకతవకలు అతనిలో కన్పించినప్పటికీ, అతని యెడల ఇంత కాలంనుంచీ అట్టర్సనుకు అమితమైన అసహ్యం భయం ఎందుకు కలిగినవో ఆ మూలకారణం అతనికి బోధపడ లేదు. "ఇతనిలో ఇంకా నాకు అర్థం కాని గొడవ ఏదో ఉంది. ఇదేదో చిద్విలాసంగా ఉంది. మనిషిలో చూస్తే మానవత్వం కన్పించదు. కొండగుహాలలో ఉండే అశివిగొడవమనిషి లాగున ఉన్నాడు. ఏదైనా మాయరూప కామరూప పిశేషమా యిది ? ఏదైనా భూతం అతనిలో ప్రవేశించి యీ విధంగా వికృతరూపంలోకి అతనిని మార్చివేసిందా ? ఇదే యితని విషయంలో నిజమని నాకుతోస్తోంది. మిత్రమా ! హెన్రీ జెకిల్ మహాశయా ! సైతాను శిఖాముద్ర ఎవరిముఖంమీదనైనా తాండవమాడుతూ ఉన్నట్లయితే, అది నామిత్రుడైనగనీ ముఖంమీదనే అని నాకు స్పష్టంగా కన్పిస్తోంది" అని అట్టర్సను తనలో తాను మథనపడ్తూ అనుకొన్నాడు

ఆ సందుమొన దాటి తిరిగితే, ఒక చౌకుఉంది. అక్కడ పురాతనములైన రమ్యములైన భవనములు చాలాఉన్నాయి. ఆ భవనములు చాలా పెద్ద

హోదా బాపతువి అగుటవల్ల చాలాభాగం మరమ్మతు లేక శిథిస్థ అయిపోయినాయి. ఆ మేడలలోని మిద్దె లలోని భాగాలు రకరకాలవారికి అద్దెలకిచ్చారు. మ్యాపులు ప్లానులువ్రాసేవాళ్ళకూ, శిల్పులకూ, పేచీ కోరు లాయర్లకూ, దగా వ్యాపారాల ఏజెంట్లకూ అద్దెలకిచ్చారు. వీధిమూలనుంచి లెక్కిస్తే రెండో యిల్లు పూర్తిగా ఒకరి ఆక్రమణలో ఉంది. ఈ యింటి సింహద్వారం శ్రీమంతులయిల్లు అన్నట్లుగా ఉంటుంది. బయటఉన్న దీపాల వెల్తురుతప్ప మరేవిధమైన కాంతి ఆ గుమ్మంలో ప్రకాశించడంలేదు. అట్టర్సను అక్కడ ఆగి తలుపుతట్టినాడు. మంచి ముస్తాబులోఉన్న వయో వృద్ధుడైన ఒక నవుకరు వచ్చి తలుపు తెరచెను.

"డాక్టరు జెకిల్ యింట్లోఉన్నారా, పూల్!" అని లాయరు ప్రశ్నించాడు.

"అట్టర్సన్ గారా! చూచి చెప్తాను ఉండండి" అని పూల్ అన్నాడు. విశాలమైన హాలులోకి అట్ట ర్సనుగారిని తీసికొని వెళ్ళాడు. ఈ హాలు ఎత్తు తక్కువ దైనప్పటికీ, సుఖంగా నేఉంది. నేలచప్టామీద నిగనిగ లాడే రాళ్లు పరచబడిఉన్నాయి. హాలులో వెచ్చగా ఉండేటందుకు నెగడు ఒకటి ఉంది. ఆ హాలులో చంద్రపుచెక్కతో చేయబడిన కుర్చీ వగైరా మేజా సామాన్లు అమర్చబడిఉన్నాయి. "బాబూ! మీరిక్కడ యీ నెగడుప్రక్కను కాసేపు కూర్చుంటారా? లేక

పోతే భోజనశాలలోకి దారిచూపించమంటారా?" అని ఫూల్ ప్రశ్నించాడు.

"ఎందుకులే-ఇక్కడ యీహాలులోనే కూర్చుంటాను" అని లాయరు బదులుచెప్పాడు. అక్కడే కుర్చీని లాగుకొని నెగడుకు సమీపంగా ఆనుకొని హాయిగా కూర్చున్నాడు. ఇతడు కూర్చున్న యీ హాలు అంటే డాక్టరుగారికి మక్కువ ఎక్కువ-లండను నగరం అంతటిలోను యీ హాలులో ఉన్నంతహాయి ఏ హాలులోనూ లేదని అట్టర్సనుగారుకూడా అనేక పర్యాయములు అన్నారు: కాని; నేటిరాత్రి అతని ఒళ్లు కంపిస్తోంది హైడ్‌యొక్క ముఖము చూచినప్పటినుంచీ ఆ ముఖబింబం అతని మనస్సును మథన పెడ్తూనేఉంది. జీవితం అంటే అతనికొక వింత వెగటు అసహ్యం ప్రారంభమైంది. అతని మనస్సు యీవిధంగా ఆందోళనపడ్తూఉన్న సమయంలో హాలులోని మేజా సామానులమీద నెగడులోని మంటల దీప్తి ప్రకాశిస్తోంది. నీడయొకటి పైన తనాబీమీద కదలుతూఉంటే అతని మనస్సుకూడా కలవరపడింది. ఇంతలో ఫూల్ ప్రవేశించాడుగాని అట్టర్సను తన కలవరపాటుకు తానే కంగారుపడ్డాడు. డాక్టరు జెకెలుగారు యింట్లో లేరని-ఎక్కడికో బయటకు వెళ్ళి యున్నారనన్నీ ఫూల్ అన్నాడు.

"శల్యశోధనమందిర ద్వారంగుండా హైడ్ లోపలికి ప్రవేశించాడు. నేను చూశాను ఫూల్!

డాక్టరు జెకిల్ యింట్లో లేనిసమయంలో అది ధర్మ మేనా ?" అని అట్టర్సను అన్నాడు.

"అందులో అక్రమం ఏమీలేదండీ అట్టర్సను గారూ! హైడ్ గారివద్ద మరొక తాళంచెవి ఉంది" అని ఆ సేవకుడు సమాధానమిచ్చాడు.

"అయితే, ఆ యువకునియెంను మీ యజ మానికి అమితమైన నమ్మకమున్నట్లుంది" అని ఆయన ఏదో ఊహాధోరణిగా అన్నాడు.

"అవునండి బాబూ ! ఆయనకు చాలా నమ్మ కం ఉంది - హైడ్ గారి మాటప్రకారం మేము నడుచు కోవాలని మాకు ఉత్తరువులు జారీ చేశారు" అని పూల్ అన్నాడు.

"హైడ్ తో నా కెప్పుడూ సమావేశభాగ్యం లభించలేదనుకుంటాను" అని అట్టర్సను అన్నాడు.

"లేదు బాబూ లేదు—ఆయన ఎప్పుడూ యిక్కడ భోజనం చెయ్యరు. ఆయన అసలు యీ యింట్లో యీ వైపుభాగంలోకి రానే రారు! ఆయన ఎప్పుడూ పరిశోధనామందిరంగుండానే వెళ్తాడు" అని బట్లరు పూల్ జవాబిచ్చాడు.

"సరే మంచిది - వెళ్ళివస్తా పూల్ ! నమస్తే."

"నమస్తే ! అట్టర్సన్"

లాయరు యింటిదోవపట్టి నడకసాగించాడు. కాని, ఆలోచనలమీద ఆలోచనలతో తల బరువెక్కి

తనలో తాను యిలా అనుకొంటూ నడుస్తున్నాడు—
"పాపం! హెన్రీ జెకిల్ ఏదో పెద్దగోతిలో పడ్డాడు. చిన్నప్పుడుకూడా చాలా విచ్చలవిడిగా ప్రవర్తించిన మనిషి—అదంతా చాలాకాలం క్రిందటి మాట—అయితేనేం? భగవంతుని చిద్విలాసానికి హద్దుమేరలుంటాయా ఉండవు. ఆ! అసలుసంగతి అదేఅయి ఉంటుంది. అతని తాలూకు పాపిష్ఠి సాంగత్యదోషం ఏదో యీ విధంగా అతనిని పట్టుకొని పీడిస్తోంది. అతను బయట పెట్టుటకు వీలులేని పాపకర్మఫలితం ఏదో అతనికొక వ్రణంలాగున తగులుకున్నది—ఏనాడో ఏండ్లక్రిందట అతడు చేసిన అపచారం ఏదో, మనస్సుకు మళ్ళీ జ్ఞాపకంరాకపోయినా, దాని ప్రాయశ్చిత్తం యిప్పుడు అతను అనుభవిస్తున్నాడు" అని తనలోతాను అనుకుంటూ అట్టర్సను నడుస్తున్నాడు. మధ్యమధ్య కొంతసేపు తన పూర్వప్రవర్తననుకూడా ఆత్మపరిశీలన చేసుకుంటూ, ఎక్కడెక్కడి మామూలు విషయాలనూ మననం చేయడం ప్రారంభించాడు. ఏమైనా ఒక పాత అపచార దోష పిశాచము తన కంటుకొని యున్నదేమో నని తనకుతానే శోధించి చూచుకున్నాడు. అతని గత జీవితప్రవర్తనం నిష్కల్మషంగానే ఉంది. నిజంగా వారి పూర్వచరిత్రలో అపచారదోషాలు అనుమానించ గలిగినవాళ్లు ఎవ్వరూ ఉండరు. అయినప్పటికీ, తన జీవితంలో తనకుకన్పించిన అనేక దుష్కర్మదోషాలకు తానే మనస్సులో క్రుంగిపోయినాడు. కాని, తాను

కొన్ని పాపపనులను సంకల్పించి విరమించిన విషయం తలచుకొని తనలో తానే సంకోచిస్తూ సంతోషించాడు—ఇంతలో తాను యోచిస్తున్న అసలు విషయానికి తిరిగివచ్చాడు—ఒక ఆశావకాశం హఠాత్తుగా అతనికి స్ఫురించినట్లయింది. "హైడ్ సంగతి ఏమిటో కొంత తరచిచూచినట్లయితే, అతని మర్మం ఏదో కొంత తప్పక బయటపడుతుంది—అతని చూపులను బట్టి కొన్ని కృత్రిమ తంత్రాలు ఉండి ఉంటాయి—జెకిల్ ప్రవర్తనలో ఎటువంటి ఎంతటి మహాచారములు కన్పించినప్పటికీ, యీ హైడ్ యొక్క క్రూరతత్వాంతర్గత రహస్య విశేషములతో పోల్చిచూచినప్పుడు జెకిల్ ప్రవర్తన పట్టపగటి సూర్యకాంతివలె నిర్మలంగా కన్పిస్తుంది—ఇప్పుడు నడుస్తూఉన్న వ్యవహారం ఎల్లకాలం సాగనేరదు. హెన్రీ జెకిల్ మంచం దగ్గరకు దొంగవలె యీ దుర్మార్గుడు చాటుమాటుగా చేరుతూ ఉండడం ఏమిటో తల్చుకుంటే నాకు గుండె స్తంభించినట్లవుతోంది. పాపం! హెన్రీ జెకిల్ వ్రాసిన వీలునామా సంగతియున్నా అందులోని అంశములున్నా యీ హైడ్కు తెలిసినట్లయితే, ఆస్తికి అంతటికీ తానే ఉత్తరాధికారియై త్వరగా భుక్తపరచుకోవలెననే ఆతురత అతనిలో అమితమైపోతుంది—ఏమైనాసరే, జెకిల్ గనుక నాకు అవకాశమిస్తే, యీ విషయంలో నేను పట్టుదలగా కల్పించుకోవాలి. జెకిల్ గనుక నాకు అవకాశమిస్తే—"అని అట్టర్సను తనలో

తాను తర్కించుకుంటూనడిచాడు. ఎందుచేతనంటే, ఆ వీలునామాలోని షరతు వాక్యాలు అతని కండ్లముందర అద్దంలో కన్పించినట్లుగా కన్పించాయి.

## 3. డాక్టర్ జెకిల్ నిశ్చింతగా ఉన్నాడు

పదిహేను దినములు గడచిన పిమ్మట, అదృష్ట వశాత్తు, డాక్టరు లాన్యను తన తాలూకు అయిదారుగురు పాతస్నేహితులకు విందు చేశాడు. విందుకు వచ్చిన వాళ్లందరూ ముసలివాళ్లే -- అందరూ ద్రాక్షారసం అంటే రుచి తెలిసి దాని మంచిచెడ్డల విమర్శించగల్గినవాళ్లే. వీరందరూ బుద్ధిమంతులు— మర్యాదస్థులు. అట్టర్సను మాత్రము, విందు అంతా అయినతర్వాత, మిగిలిన వాళ్లందరూ వెళ్లిపోయిన తర్వాత, అక్కడే తిష్ఠ వేసి కూర్చున్నాడు. ఈ విధంగా తానుమాత్రము దిగబడి బాతాఖానీ చేస్తూ ఉండడం యీ పర్యాయమే అతను క్రొత్తగా చేసిన పన్నాగము కాదు. ఈ విధంగా ఇదివరకు అనేక డజనుల పర్యాయము చేశాడు. అట్టర్సను అంటే కొందరికి యిష్టుడు. ఇష్టుడైనవారికి పరమయిష్టుడు. డబ్బామ్రోగినట్లుగా ఊకదంపుగా తియ్యగా మెర మెచ్చులు మాట్లాడే స్నేహితబృందమంతా గడపదాటి బయటకు నిష్క్రమించినతర్వాత, సరదాలేని అట్ట ర్సనుగారితో గోష్ఠి సాగించవలెననే దిలాసాగలవాళ్లు

చాలామంది ఉన్నారు. సాధారణంగా ముఖప్రీతి పేలపిండి కబుర్లతో కంది మొత్తినప్పుడు ఇటువంటి మిత్రభాషితో ఏకాంత ప్రియునితో కాలక్షేపం చేయడంవల్ల మనస్సుకు ఎంతో స్థిమితముగా ఉండేది. అతని సావాసం వల్ల వారి మనస్సు నిదానంగా ఉండేది. ఈ విషయంలో డాక్టరు జెకిల్ కూడా, అట్టర్సనుగారి గోష్ఠికి మక్కువపడేవాడని చెప్పవలసిందే. అక్కడ హాలులో ఉన్న నెగడుకు ఎదురుగా డాక్టరు జెకిల్ కూర్చున్నాడు. యాభైఏండ్లవాడు. నున్నని ముఖం. భారీసైజు ముఖం. దృఢకాయుడు. మనిషిలో కొంత ఓరచూపు ఉంది. అతనిలో సామర్థ్యం కన్పిస్తోంది. దాక్షిణ్యం కూడా చాలా ఉంది. అట్టర్సను అంటే అతనికి నిజమైన, గాఢమైన అభిమానం అంతరంగంలో ఉంది. ఆ విషయం అతని చూపులోనే కన్పిస్తుంది

అట్టర్సను సంభాషణ ప్రారంభించి, "నీతో మాట్లాడవలెనని నాకు చాలా ఆసక్తిగా ఉంది. నీవు వ్రాసినటువంటి ఆ వీలునామా సంగతి నీకు తెలుసు కదా ?" అన్నాడు.

ఈ విషయం అతనికి అంతగా రుచించదని పరాయివాడు అనుకుంటాడు. కాని, డాక్టరు జెకిల్‌కు ఆ ప్రస్తావన సరదాగానే ఉంది. "అట్టర్సన్ ! నావంటి వాడు నీకు పార్టీనై నీఖాతాదారు అవడం నిజంగా నీ దురదృష్టం. నావీలునామా విషయమై నీవు పడుతున్నంత ఆందోళన నేనింకెవ్వరిలోనూ చూడలేదు.

శాస్త్ర చర్చలలో నా అప్రాచ్యపు సిద్ధాంతములకు డాక్టరు లాన్యనువంటి పాతధోరణి పండితుడు నీ మాదిరిగానే నన్నుగూర్చి కొంతఆవేదన పడుతూ, ఉంటాడు. అతను చాలా మంచివాడు. నాకు తెలుసు. ఆవిషయమై నీవేమీ ముఖం చిట్లించనక్కర లేదు. డాక్టరు లాన్యను దివ్యమైన సత్పురుషుడు. అతని మంచితనం యింకా నాకు బోధపడవలసింది చాలా ఉంది. ఎన్ని చెప్పినా, అతనిదిమాత్రం తాతలనాటి పాతపాండిత్యం. పాత సిద్ధాంతాలకు సాష్టాంగప్రణామాలుచేసే వట్టి అంధప్రాయుడు. డాక్టరు లాన్యను విషయములో నాకు ఉన్న ఆశలు భంగమైనట్లుగా యింకెవ్వరి విషయంలోనూ భగ్నం కాలేదు." అని డాక్టరు జెకిల్ ప్రస్తావించాడు.

"మీ వీలునామాను నేనెన్నడూ హర్షించ లేదు. ఆసంగతి మీకు తెలుసుగదా" అని అట్టర్సను తన వ్యవహారవిషయం తిరిగి సాగించాడు. డాక్టరు లాన్యను విషయమై ప్రారంభించిన కొత్తవిషయాన్ని అంతగా అట్టర్సను లక్ష్యం చేయలేదు.

"నావీలునామా విషయమా? అవును. నిజమే. అదంతా నాకు తెలుసు. నీవు నాతో అన్నావుకూడా." అని డాక్టరు జెకిల్ చలాకిగా మాట అనుకున్నాడు.

"మంచిదే. ఆవిషయమే తిరిగీ నీతో చెప్పుతున్నాను. హైడ్ అనే యువకుని గూర్చి యిటీవల

నాకు కొంత తెలియవచ్చింది." అని లాయరు చర్చ సాగిస్తూ అన్నాడు.

ఆ మాటతో డక్టరు జెకిల్ ముఖం తెల్లబోయింది. పెదవులు పాలిపోయినాయి. అతని చూపులో కళ లేదు. "ఆవిషయమై యింకా చెప్పితే నేను వినదలచుకోలేదు. ఈ ప్రస్తావనకు స్వస్తి చెప్పవలెనని మన మిద్దరమూ యిదివరకే ఒప్పందం చేసికొన్నాం" అని డక్టరు జెకిల్ అన్నాడు.

"నేను విన్నదంతా చాలా ఘోరంగా ఉంది" అన్నాడు అట్టర్సను.

"ఆ వ్యవహారంలో కలిగే కొత్త మార్పు ఏమీ ఉండదు. నా సందర్భస్థితి ఏమిటో నీవు సరిగ్గా గ్రహించడంలేదు. నాపరిస్థితి అంతా ఒక సంకటావస్థగా ఉంది అట్టర్సన్! నా వ్యవహారం అంతా విపరీతావస్థగా ఉంది. చాలా విపరీతావస్థగా ఉంది. కేవలం మాటలతోనూ చర్చలతోనూ చక్కబడే వ్యవహారం కాదిది." అని డక్టరు జెకిల్ కొంత అగమ్యగోచరంగా సంభాషించాడు.

అప్పుడు అట్టర్సను యిలా అన్నాడు. "జెకిల్! నీవు నన్ను ఎరుగుదువుగదా. నేను నమ్మదగిన మనిషినేగదా. ఈవిషయంలో నీవు నాతో మర్మం విడిచి ఉన్నదంతా వివరించి చెప్పు—నిన్ను నీ చిక్కులలో నుంచి నేను నిస్సంశయంగా తప్పించగలను."

ఆ మాటలకు డాక్టరు జెకిల్ యిచ్చిన ప్రత్యుత్తరం ఇది. "అట్టర్సన్ మహాశయా! నీవు నా మేలు చాలా కోరినవాడవు. నిజం. ముమ్మాటికీ నా మేలు కోరినవాడవు. అందుకై నా కృతజ్ఞత వెల్లడించటానికి మాటలు చాలవు. నీవంటే నాకు పూర్తినమ్మకం ఉంది నిన్ను నమ్మినట్లుగా బ్రతికిఉన్న వాళ్ళల్లో ఏనర మానవుణ్ణీ నేను నమ్మను. ఆమాటకు వస్తే అంతగా నన్ను నేనే నమ్మను. కాని, అసలువిషయం నీవు అపోహ పడుతున్నది కాదేకాదు. నీవు అనుమానించినంత అధ్వాన్నంకాదు నా విషయం. నీకు ఒక్కవిషయం నొక్కి వక్కాణిస్తున్నాను. కావాలంటే ఈక్షణంలో హైడ్‌తో సంబంధం లేకుండ నేను ఉండగలను ఆ విషయంలో నీకు నేను చేతిలో చేయివేస్తాను. నీకు నేను కృతజ్ఞుణ్ణి అని మరీ మరీ నివేదించుకుంటున్నాను. అట్టర్సన్! నీకొక్క చిన్నమాట చెప్తాను. అది నీవు సావధానంగా చిత్తగిస్తావని నా ఊహ. ఇది కేవలము నా అంతరంగిక వ్యవహారవిషయం. గనుక, దానిని పైకెత్తవద్దని నా మనవి—"

నెగడువంక చూస్తూ అట్టర్సన్ కొంచెంసేపు ఏదో ఆలోచన చేశాడు.

"అవును నీవు చెప్పినదంతా చాలా సబబుగా ఉంది" అని అట్టర్సను లేవబోతూ చిట్టచివరకు అన్నాడు.

ఆమాటమీద డాక్టరు జెకిల్ తిరిగీ ప్రస్తావిస్తూ, అన్నాడు. "మంచిది - సరే - ఈవ్యవహారవిషయమై మనము కొంత ప్రస్తావించాము గనుకనున్నూ యీ విషయమై యిదే ఆఖరుసారి న్యాయంగా మనం ముచ్చటించడం అవుతుంది గనుకనున్నూ ఒక్క విషయం నీవు గ్రహించాలని నా అభిలాష. పాపం! హైడ్ విషయంలో నాకు చాలా సన్నిహితప్రసక్తి ఉంది. అతనిని నీవు చూచావని నాకు తెలుసు అతను కూడా ఆసంగతి నాతో చెప్పాడు అతను నీతో చాలాదురుసుగా బేమర్యాదగా ప్రవర్తించిఉంటాడు. అయినప్పటికీ, ఆ యువకుని విషయంలో నాకు చాలా ఆప్తసంబంధం ఉంది. నేను లేకుండా పోయినట్లయితే, అతనిని నీవు సహించి, అతనికి చెందవలసిన హక్కు-భుక్తములు అతనికి చెందేటట్లుగా నీవు చేస్తానని నాకు వాగ్దానం చేయి. అంతేచాలు అట్టర్సన్! నిజవిషయం అంతా నీకుబోధపడితే నీవు తప్పకుండా అలా చేస్తావనే నావిశ్వాసం. నీవు ఆ వాగ్దానం నాకుచేస్తే, నా మనస్సులో ఉన్న బరువు చాలా తొలగిపోతుంది.

ఆమాటలు లాయరు విని "అతడంటే నాకు యిష్టమే అని మాత్రము నేను నీతో సుఖప్రీతిగా అనలేను" అన్నాడు.

అట్టర్సను బుజంమీద డాక్టరు జెకిల్ తన చెయ్యివేసి తట్టుతూ "అదికాదు నేనుకోరేది. జరుగవలసినదంతా న్యాయంగా జరిగితేచాలు.

నేను యీ తనువు చాలించినతర్వాత నాయందు గౌరవముంచి నీవు అతనికి చేయవలసిన సహాయం చేయవలెనని మాత్రమే కోరుతున్నాను" అన్నాడు.

అట్టర్సన్ అణచుకోలేని నిట్టూర్పువిడిచి "సరే! అల్లాగే నేను నీకు వాగ్దానం చేస్తున్నాను" అన్నాడు.

# 4 క్యారూ హత్యావ్యవహారం

ఒక సంవత్సరకాలం గడచిన పిమ్మట 18-సం॥ అక్టోబరు మాసంలో కనివిని యెరుగని ఘోరమైన హత్య ఒకటి జరిగింది. ఈ హత్యా వ్యవహారంతో లండనునగరం అంతా అట్టుడికినట్లుడికి పోయింది. హత్య చేయబడిన మనిషి చాలా ఘరానా కుటుంబం లోని వాడగుటవల్ల నగరంలో మరింత గగ్గోలు పుట్టింది. హత్యనుగూర్చి తెలియవచ్చిన వివరములు ఎక్కువగా ఏమీ లేవు. కాని, తెలిసిన కొద్ది వివరము లైనా చాలా దారుణంగా ఉన్నాయి. నదిఒడ్డున సమీపంలోనే ఒకయిల్లు ఉంది. ఆయింట్లో ఒక పనికత్తె (పెండ్లికానిపడుచు) నివసిస్తోంది. ఆమె రాత్రి పదకొండు గంటలవేళ నిద్రపోదామనే ఉద్దేశంతో మేడమీదకు వెళ్ళింది. తెల్లవారుజామున పొగమంచు నగరమంతా ఆవరించింది. కాని, తత్పూర్వం రాత్రి అంతా మబ్బూగిబ్బూ లేకుండా

ఆకాశంఅంతా నిర్మలంగా ఉంది. ఆనాడు పౌర్ణమి. పండువెన్నెలతో వీధిఅంతా పిండి ఆరబోసినట్లుంది. ఆమేడమీాది కిటికీలోనుంచి చూస్తే వీధి అంతా చక్కగా కన్పిస్తుంది. ఆపడుచుపిల్ల కొంచెం విలాసంగా వెన్నెలవిహారాలు చేసేరకం అంటారు. ఆనాటిరాత్రి కిటికీప్రక్కనేఉన్న ఒక పెట్టెమీాద ఆపిల్ల కూర్చుంటే, తియ్యనికమ్మని తలపులు ఏవో కలలవలె అలలవలె ఆ అమ్మాయి మనస్సులో తిరుగుతున్నాయి. ఆనాటి రాత్రి ఆపిల్లకు ఈప్రపంచంమీాదనే మంచిసరదా కలిగిందట. మానవలోకం అంటే ఆనాటిరాత్రి కలిగినంత మక్కువ యింకెప్పుడూ ఆమె జన్మలో కలుగలేదట. ఆరాత్రి జరిగిన ఘోరవిషాదం ఆపిల్ల వివరించి చెప్పినప్పుడు, కంటతడిపెట్టి పిరీతిగా అంటూ ఉండేది. ఆరీతిగా ఆపిల్ల అక్కడ కూర్చుండి కిటికీలోనుంచి చూస్తూఉంటే తెల్లని తలవెంట్రుకలు కలిగి వయస్సు ముదిరినటువంటి అందగాడైన ఒక పెద్దమనిషి ఆసందు లోనికి వస్తూ ఉన్నట్లుగా ఆమె కనిపెట్టింది. ఆపెద్ద మనిషికి ఆసందులోనే ఒక పొట్టిమనిషి ఎదురుగా నడిచివస్తున్నాడు. ఇతనిని ఆపిల్ల మొదట్లో అంత ఎక్కువగా లక్ష్యంచేసి గమనించలేదు. మేడ కిటికీవద్ద కూర్చున్న ఆపిల్లకు ఎదురుగా సందులో వాళ్లిద్దరూ కలిసికొన్నారు. ఒకరితోఒకరు మాట్లాడు కొనుటకు వీలైనంత దగ్గరలోకి వచ్చారు. పొడగరి యైన పెద్దమనిషి చాలా మర్యాదగా రెండోమనిషిని

పలుకరించాడు. పలుకరించిన పిమ్మట ప్రస్తావించిన విషయంలో విశేషమేమీ లేదు. అతడు తన చేయి చాపి ఏదో చూపించు చుండుటను బట్టి చూడగా, తనకు కావలసిన త్రోవ ఏదో అడుగుతున్నాడని అర్థమౌతూ ఉంది. ఆపొడుగుపాటి మనిషి ముఖం వెన్నెలలో బాగా ప్రకాశిస్తోంది. అతని ముఖంవంక ఆపిల్ల సరదాగా చూస్తూ ఉంది. అతని ముఖంలో పాతరకపు సత్యకాలపు మానవుని మంచితనమూ, మర్యాదా బాగా కన్పిస్తున్నాయి. చక్కని సంపన్నగృహస్థుగా కన్పించాడు. రెండో మనిషివంక కూడా ఆపిల్ల దృష్టి మరల్చి చూచింది. ఇదివరలో ఒక పర్యాయము తన యజమాని సందర్శనార్థం వచ్చియుండిన నటువంటి హైడ్ అనేటటువంటివాడే యితడని గుర్తుపట్టింది. ఇదివరకు అతనిని చూడగానే ఆపిల్లకు ఒక విధమైన అసహ్యం కలిగింది. అతని చేతిలో లావుపాటి చేతికర్ర ఒకటి ఉంది. ఆకర్రను అతడు సరదాగా యిటూ అటూ ఆడిస్తున్నాడు. అతను అక్కడ నిల్చున్నంతసేపూ ఒక్కమాటయినా మాట్లాడలేదు. ఆ మనిషికి ఓర్పు అనేది లేనట్లుగా పళ్లబిగువున చెప్పినదంతా వింటూ నిల్చున్నాడు. అప్పుడు అతనికేదో శివమెత్తినట్లుగా ఆగ్రహావేశం హఠాత్తుగా వచ్చింది. తన పాదంతో నేలను ఒక్క తన్నుతన్ని తన చేతికర్రను గిరున బాణాకర్రలాగున త్రిప్పి, పిచ్చి ఎత్తినవానిలాగున హుంకరించాడు. ఆ పొడుగాటి పెద్ద

మనిషి ఈ తరహా చూచి నిర్ఘాంతపోయి వెనుకకు అడుగు వేశాడు. ఇక హైడ్‌కు పట్టపగ్గాలు లేవు. వెంటనే ఒక్క దెబ్బతో ఆ పెద్ద మనిషిని నేలమీదకు పడగొట్టివేశాడు మరుక్షణంలోనే అతడు క్రూర కిరాతునివలె లంఘించి క్రింద పడియున్న మనిషిమీద తన కాళ్లు పెట్టి త్రొక్కుతూ చేతి కర్రతో దెబ్బమీద దెబ్బ ఆపకుండా కొట్టడం సాగించాడు. ఆ దెబ్బలకు ఎముకలు పెళ పెళమని విరిగిపోయినాయి. కళేబరం రస్తామీద ఎగిరిపడింది. ఈ ఘాతుక దృశ్యములతో ఈ భీకరధ్వనులతో ఆ పిల్ల గుండె తల్లడిల్లి మూర్ఛ పోయింది.

ఆ పిల్లకు తిరిగి స్పృహ వచ్చేసరికి రాత్రి రెండు గంటలయింది. అప్పుడు పోలీసువారికి ఆమె కబురు చేసింది. ఖూనీ చేసినవాడు పలాయనమై అప్పటికే చాలా సేపయింది. కాని, అతడు చంపినటువంటి మానవుడు ఆ సందుమధ్య తుక్కు-తుక్కు అయి పడిఉన్నాడు. అతనిని ఏ కర్రతో చావగొట్టినాడో ఆ కర్ర చాలా గట్టి చేవగల మంచిరకం కర్ర. అటువంటికర్ర కూడా, యీ కిరాతక కృత్యంలో మధ్యకు విరిగిపోయింది. విరిగిపోయిన సగం భాగం ఆవిసురులో వెళ్లి రోడ్డు ప్రక్కనున్న మురుగు కాల్వలో పడింది. ఆ కర్ర తాలూకు రెండో అర్థభాగం హంతకుని చేతిలోనే ఉండడంవల్ల అతడు వెంటతీసికొనిపోయిఉంటాడు. చనిపోయినవాని దుస్తులలో ఒక

పర్సున్నూ, ఒక బంగారు గడియారమున్నూ కన్పించాయి. వేరే కార్డులుగాని, కాగితాలుగాని ఏమీస్నీ లేవు. చీట్లు అంటించి సీలువేసిన కవరు ఒక్కటి మాత్రం ఉంది. బహుశః దానిని పోస్టులో వేయడానికి తీసికొని పోతూ ఉండవచ్చు. ఆ కవరుమీద అట్టర్సను పేరూ, చిరునామా వ్రాయబడి ఉన్నాయి.

మరునాడుదయము, లాయరు గారైన అట్టర్సను వద్దకు ఆయన యింకా నిద్రలేవకపూర్వమే, ఆ కవరును తీసికొని ఒకరు వచ్చారు. సంగతి సందర్భములన్నీ అతనికి వివరించారో లేదో, ఆ కవరును అతడు చూచాడో లేదో, వెంటనే అట్టర్సను గంభీరంగా మూతివిరిచి, "శవాన్ని నేను చూచేవరకు ఇప్పుడేమీ చెప్పలేను" అన్నాడు. ఇది చాలా పెద్ద గాథ కావచ్చు. నేను డ్రెస్ వేసికొని వచ్చేవరకు దయచేసి కొంచెం కూర్చోండి" అని అట్టర్సను పలికి, అదే గంభీర ముఖవైఖరితో ఆదరాబాదరా ఏదో కాఫీ నీళ్లూ ఫలాహారమూ ఆరగించి, పోలీసుస్టేషనుకు బండీమీద వెళ్లాడు. అక్కడికి శవాన్ని అదివరకే చేర్చారు. పోలీసుస్టేషనులో ఒక గదిలో ఉంచబడిన ఆ శవాన్ని అతడు చూచి తల పంకించాడు.

"అవును. ఈయనను నేను గుర్తుపట్టగలను. ఈయనే 'సర్ డాన్వెర్సు క్యారూ' అని చెప్పవలసి వచ్చినందుకు నాకు విచారంగా ఉంది." అని అట్టర్సను అన్నాడు.

వెంటనే పోలీసుఅధికారి ఆశ్చర్యపడి, "ఏమిటండీ! ఎంతమాట! అటువంటిది సంభవమా ?" అని ప్రశ్నించాడు. కాని యిటువంటి పెద్దకేసులలో తన పోలీసువృత్తికి సహజమైన ఉత్సాహాసక్తితో కళ్లుత్రిప్పి, "అయితే, ఇది చాలా పెద్దగొడవ అవుతుందన్నమాట — మనిషిని వెతకిపట్టడం విషయంలో మీరుకూడా మాకు సహాయం చెయ్యవచ్చు" అన్నాడు. మేడమీద ఉండే పనికత్తె చూచి చెప్పిన సంగతులన్నీ సంగ్రహంగా వివరించిన పిమ్మట విరిగిన చేతికర్ర ముక్కను అట్టర్సనుకు చూపించాడు.

ఈ సందర్భంలో హైడ్ పేరు ఎత్తగానే అట్టర్సను వెనక్కి జంకి కలవరపడ్డాడు. కాని, చేతికర్రముక్కను చూపించగానే ఆయనకు సంశయనివృత్తిఅయింది. విరిగినకర్ర తునకను చూడగానే అది తానిదివరకు పెక్కేండ్లక్రిందట హెన్రీ జెకిల్‌కు బహుమానంగా యిచ్చిన చేతికర్ర యని సులభంగా గుర్తించాడు.

"ఈ హైడ్ అనేమనిషి చాలా పొట్టివాడేనా?" అని అట్టర్సను ప్రశ్నించాడు.

"విశేషంగా పొట్టివాడనిన్నీ చాలా దురాగ్రహపు చూపులు గలవాడనిన్నీ ఆపనికత్తె చెప్పింది" అన్నాడు పోలీసు ఆఫీసరు.

అట్టర్సను కొంచెంసేపు యోచించాడు. చివరకు

తలపైకెత్తి, "నాబండిలో మీరు వస్తే అతను ఉండే యిల్లు మీకు నేను చూపిస్తాను" అన్నాడు.

అప్పటికి ఉదయము తొమ్మిది గంటలైంది. ఆ ఋతువులో అదే మొదటిరోజు మంచు ప్రారంభం. ఆకాశం అంతా గోధూళి కప్పినట్లుగా మంచు తెరలు ఆవరించాయి. కాని ఈదురుగాలి దిట్టంగా వీస్తూ ఉండడంవల్ల మంచు తెరలు మధ్యమధ్య చెదరి పోతున్నాయి. ఆ మంచులో గుర్రపుబండి వీధి తర్వాత వీధి దాటి మెల్లిగా నడుస్తోంది. ఆ నీరెండలో వింతరంగుల కాంతులు మంచుతెరలమధ్య అట్టర్సనుకు కన్పించాయి. ఇక్కడ ఈనగరభాగంలో వెల్తురు తక్కువగా ఉంటుంది. సాయంకాలపు కనుచీకటివలె ఉంటుంది. మంటల్లోనుంచి వచ్చిన ఎర్రని వెల్తురువలె మంచులోనుంచి ఉదయదీప్తి ఎర్రగా కన్పిస్తుంది. మధ్య మధ్య రవ్వంత మంచు చెదిరిపోయినప్పుడు సూర్యకిరణం బాణాలాగున తగులుతూ ఉంటుంది. సోహో చౌకు అసలే బావురుమన్నట్లుంటుంది. ఆనాటిఉదయం వింత రంగుల మంచు ముసుగులలో, బురదరస్తాలతో, మురికి బొడ్డె బాటసారులతో, యిదివరకెప్పుడూ ఆర్పి యుండని దీపాలతో, లేదా ఇప్పుడు చుట్టూ ముట్టడించిన మసక చీకటిని పారద్రోలుటకై తిరిగి వెలిగింపబడిన దీపాలతో, లాయరు కళ్ళకు ఆవీధి ఎట్లా ఉన్నదంటే, పీడకలలలో కన్పించిన పాడుపట్టణములోని ఒక మారుమూల వాడవలె ఉంది. అంతేకాదు.

అప్పు డాయనమనస్సులో తిరుగుతున్న ఆలోచనలు కూడా చాలా అయోమయంగా ఉన్నాయి. తన ప్రక్కనే బండిలో కూర్చుండిన పోలీసు అధికారిని చూచినప్పుడు ఆ దండనాధికారుల మూలంగా కలిగే టటువంటి మామూలు గుండెదడ కలిగింది. ఎందుచేత నంటే ఈ పోలీసుఅధికార్లు ఒక్కొక్కప్పుడు ఏమీ సంబంధం లేని వాళ్లను కూడా బాధించి నిర్బంధించి బాధిస్తారు.

చేరవలసిన చిరునామాగల యింటికి బండి సమీపిస్తోంది. ఆ సమయంలో మంచు తెర కొంచం విచ్చిపోతూ ముసిరిపోతూ ఉంది. ఒక చీకటిగొంది కంటికి ఎదుట కన్పిస్తున్నట్టు నాటుసారా దుకాణమూ, ప్రెంచి కాఫీ హోటళ్లూ, అర్ధణాలకిచ్చిర సరకులూ రెండణాల ముగ్గుల్లూ అమ్మే దుకాణమూ, గుమ్మములముందు గుంపుకూడిన చింపిరిగుడ్డల పిల్లలమూకలూ, ఉదయం వేళ ఒక కప్పు సేవించేటిది తాగివద్దామని బయటకు బయలుదేరిన నానాజాతుల వనితలూ, యివన్నీ కన్పించాయి. ఇంతలోనే మంచుతెర తిరిగి దట్టంగా గోధుమరంగు బురఖాలాగున ఆవరించింది. ఆమురికి పరిసరప్రదేశం కంటికి కన్పించకుండా పోయింది. అక్కడే హెన్రీ జెకిల్ గారి ఆప్తమిత్రుని యిల్లు— రెండున్నర లక్షల సవరనుల ఆస్తికి ఉత్తరాధికారి కాబోయే ఆప్తమిత్రుని యిల్లు. అది.

తెల్లగా ముగ్గుబుట్టవలె తల నెరిసి, దంతం భరిణలాంటి ముఖంగల ముసలి దొకతె వచ్చి తలుపు తెరచింది. తెచ్చిపెట్టుకున్న కపటమర్యాదలు చూపించిందిగాని దాని ముఖంలో దుస్స్వభావం ఉంది. పైకిమాత్రం చాలా తియ్యగా మన్ననగా మాట్లాడింది. "అవును యీ యిల్లు హైంజ్ గారిదే కాని ఆయన యింట్లో లేరు ఎక్కడికో వెళ్లారు. గతరాత్రి ఆయన యింటికి రావడమే చాలా ఆలస్యంగా వచ్చారు. కాని, తిరిగీ మరొక గంటలోనే వెళ్లిపోయినారు." అని ఆముసలిది చెప్పింది. అవును అందులో వింత విశేషమేమీ లేదు. ఆయన కట్టుబాటైన క్రమమైన అభ్యాసాలు కలవాడు కాడు. తరచు యింట్లో ఉండడు. ఎందుచేతనంటే ఆ ముసలిది చెప్పినమాటలనుబట్టి ఆయనను ఆ ముసలిది నిన్ననే చూచింది. కాని అంతకుముందు రెండు నెలల యీ మధ్యకాలంలో ఎప్పుడూ చూడలేదు.

"సరే - మంచిదేగాని, ఒకసారి ఆయన ఉండే గదులు మేము చూడాలి" అని లాయరు అన్నాడు. అటువంటిపని సాధ్యపడదని ఆముసలిది అనబోతూఉండే సమయంలో లాయరుమాట అందుకొని, "నా వెంట వచ్చిన యీయన ఎవరో తెలుసుకో. నేర పరిశోధనలు చేసే పోలీసుశాఖలోని ఇనస్పెక్టరు అయిన న్యూకామెన్ గారు యీయన" అన్నాడు.

ఆమాటకు ఆస్త్రీముఖంలో సంతోషం కన్పిం చింది. కాని ఆ సంతోషంలో విద్వేషంకూడా ఉంది. "చిత్రం.అట్లాగా! మాయజమానిచిక్కులలోపడ్డాడన్న మాట! అయితే, ఆయన ఏంచేశాడు? అన్నది ఆమె.

అట్టర్సనునూ, పోలీసు ఇనస్పెక్టరునూ ఒకరి ముఖం ఒకరు చూచుకొన్నారు. "ఇతని సంగతి చూస్తే ఎవ్వరికీ నచ్చినవాడల్లే లేడు." అని పోలీసు అధికారి అట్టర్సనుతో అన్నాడు. ఆమెవంక తిరిగి, "ఇటు చూడు ముసలమ్మా! ఈ ప్రదేశం నలువైపు లనూ నేనూ నామిత్రుడూ చూడాలి. కనుక మమ్మ లోపలికి వెళ్ళనియ్యాలి" అన్నాడు.

ఆ యింటిలో ఆ ముసలమ్మతప్ప ఇంకెవ్వరూ లేరు. ఆమెకూడా లేకపోతే, యిల్లంతా ఖాళీయిల్లు అన్నమాటే—ఆయిల్లు అంతటిలో హైడ్ ఉప యోగించేవి రెండు గదులుమాత్రమే. ఈ రెండు గదులలో చాలాసొగసైన విలువగలబల్లలూ కుర్చీలూ వగైరా మేజాసామాన్లు దర్జాగా అమర్చబడి ఉన్నాయి. ఒక చిన్నగది నిండా ద్రాక్షారసం దండిగా ఉంది. బల్లమీద వెండిపళ్లెములూ, చక్కగా పరచిన సొగసైన గుడ్డలూ ఉన్నాయి. గోడకు తగి లింపబడిన చక్కనిపటం ఒకటి ఉంది. బహుశః అది డాక్టరు జెకిల్ గారు బహుమానంగా యిచ్చినదై ఉంటుందని అట్టర్సను ఊహించాడు. ఎందుకంటే

జెకిల్‌కు కళాభిరుచి కొంత ఉంది. గదులలో క్రింద పరచబడిన తివాసులరంగులు కన్నుల పండువుగా ఉన్నాయి. ప్రస్తుతము గదులను పరిశీలించి చూడగా, యిటీవలనే యింతకుముందే, చాలా హడావుడిగా సోదా చేసినట్లు వస్తువులు కొన్ని చిందరవందరగా ఉన్నాయి. దుస్తులు నేలమీద పడి ఉన్నాయి. చొక్కాలజేబులు ఉల్టాసీదాగా లోపలివైపు పైకితిరుగవేసి ఉన్నాయి బల్లసొరుగుల తాళాలు తీయబడి తెరువబడినాయి. అక్కడ ఉన్న నెగడువద్ద కాగితాలుకాల్చిన బూడిద ఉంది. ఆ బూడిదలో బ్యాంకు చెక్కుపుస్తకం తాలూకు పూర్వార్ధభాగాల ప్రతి ఒకటి నాశనంకాకుండా మిగిలింది, దానిని పోలీసు ఇన్స్పెక్టరు పైకితీశాడు. విరిగిన చేతికర్ర తాలూకు రెండో అర్థభాగం తలుపుసందున ఉంది. ఈ కర్రముక్క దొరకడం మూలంగా ఆ పోలీసుఅధికారి అనుమానాలు పూర్తిగా బలపడ్డాయి. అందువల్లనే, అది దొరికినందుకు అమితానందభరితుడైనాడు. ఖూనీచేసిన వాని బ్యాంకుఖాతాలో అనేక వేల సవరనుల మొత్తం నిల్వ ఉన్నట్లుగా కన్పిస్తోంది. కనుక బ్యాంకుకుకూడా వెళ్ళి విచారించవచ్చుననే ఆశతో పోలీసుఆఫీసరుకు పూర్తిగా సంతృప్తి కలిగింది.

ఆ కారణంచేత అట్టర్సనుగారితో . పోలీసు ఆఫీసరు యిలా అన్నాడు. "బాబూ! ఇక నాడ్

హామి. ఈ మనిషి నా చేతుల్లో చిక్కాడు. అతనికి బహుశః బుర్ర పోయింది. అలా కాకపోయినట్లయితే, యీ కర్రముక్క నాకు డిక్కుడ విడిచిపెట్టి ఉండడు. అంతకంటే ఎక్కువైన దేమిటంటే, యీ బ్యాంకు చెక్కు పుస్తకమును తగులబెట్టేవాడు కాడు. ఏ మనిషికైనా పైకంతోనే బ్రతుకు—ఇక మనం చేయవలసింది ఏమీ లేదు. బ్యాంకువద్దకు వెళ్లి, అతనికోసం కనిపెట్టుకుని ఉండి, అతడు తీసికొనివచ్చే బ్యాంకు చెక్కులను పట్టుకోవాలి.

ఈ చివరిపని అంత సులభసాధ్యమైనది కాదు. ఎందుచేతనంటే, హైంజ్‌తో బాగా ముఖపరిచయం గల్గిన వాళ్లు చాలా కొద్దిమంది మాత్రమే ఉన్నారు. పైజెప్పిన ముసలిపనికత్తెయొక్క పెనిమిటికూడా అతనిని రెండుసార్లే చూచియున్నాడు. హైంజ్ సొంత కుటుంబం వారెవ్వరూ ఎక్కడా కన్పించడం లేదు. అతని ఫొటో ఎన్నడూ తీయబడినట్లుగా లేదు. అతనిని వర్ణించి చెప్పగల కొద్దిమందికూడా లోకసహజంగా పరిపరివిధాలుగా వర్ణిస్తున్నారు. కాని ఒక్కవిషయంలో వీరందరూ ఏకీభవిస్తున్నారు. అది ఏమిటంటే, స్పష్టంగా వివరించడానికి వీలులేని ఒక విధమగు అనిర్వచనీయ వికృతత్వం అతన్ని చూచిన వారికందరికీ అతనిలో కన్పించింది.

# 5. ఒక ఉత్తరం _ దాని సంగతి, సందర్భం

సాయంకాలంవేళ అది. అట్టర్సనుగారు డాక్టరు జెకిల్ యింటికి చేరారు. అక్కడికి చేరగానే జెకిల్‌గారి బట్లరైన ఫూల్ వెంటనే వచ్చి అట్టర్సనుగారిని లోపలికి తీసికొనివెళ్లాడు. వంటయింటి గదులలోనుంచి ఒక విశాలమైన ఖాళీ జాగాలోనికి తీసికొని వెళ్లాడు. అది ఒకప్పుడు తోటగా ఉండేది. ఈ ఖాళీ జాగాగుండా ఒక భవనంలోకి తీసికొనివెళ్లాడు. ఆ భవనమును "పరిశోధనా మందిరం" అనిన్నీ, "శల్యతంత్ర శస్త్రశోధనశాల" అనిన్నీ పిలుస్తూఉండేవారు. సుప్రసిద్ధుడైన ఒక శస్త్రవైద్యునివద్దనుండి ఆ భవనమును డాక్టరు జెకిల్ కొన్నాడు. కాని డాక్టరు జెకిల్ పండితుడు శల్యతంత్ర శస్త్ర పరీక్షలలో అభిరుచి కలవాడు కాడు. ఆయనకు రసాయన ప్రక్రియలలో అభిరుచి ఎక్కువ. అందువల్ల ఆ తోటప్రదేశం చివరి భాగంలోకి తన మకామును మార్చుకున్నాడు. తన మిత్రుడైన జెకిల్ యీ భవనంలో ఉండగా ఆయనను కలిసికొనడం అట్టర్సనుగారికి యిదే మొదటిసారి. ఆ భవనము యించుమించు చీకటికోణంగా ఉంది. కిటికీలు లేవు. ఆ మందిరంలోనుంచి నడచిపోతూఉంటే, ఆ భవనాన్ని వింతవింతగా చూస్తూ అట్టర్సను అడుగులు వేశాడు. ఒకప్పుడు ఆ మందిరం విద్యార్థులతో

నిండిఉండేది. కాని యిప్పుడది బావురుమంటూ నిశ్శబ్దంగా ఉంది. ద్రావకాలు, రసాయన పరిశోధనలు చేసే పరికరాలు మేజా బల్లలనిండా ఉన్నాయి. నేలమీద సీసాలు వగైరా బంగీచేసే పెట్టెలు పడి ఉన్నాయి. బంగీచేయడానికి ఉపయోగించే చెత్త, పీచు చెల్లాచెదరుగా పడిఉంది. రసద్రవ్యములను కరగించే కొలిమి మీదుగా వెల్తురు మందంగా మసకగా పడుతోంది. ఆ మందిరం రెండో చివర ఒక మెట్లవరుస ఉంది. ఆ మెట్లవరుసమీద ఎర్రని బనాతుగుడ్డ కప్పబడి ఉంది. ఆ మెట్లవరుసను సరాసరిగాపోతే ఒక గుమ్మాం ఉంది. ఆ గుమ్మాంగుండా ఒక గదిలోకి ప్రవేశించగానే అక్కడ డాక్టరు జెకిలు ఆయనను స్వాగతమిచ్చాడు. ఆ గది చాలా విశాలమైనది. గదిలో గాజు బీరువాలు ఉన్నాయి. చట్రంమీద యిరుసు బిగించిన పెద్ద నిలువుటద్దం ఉంది. కచ్చేరి మేజా బల్లకూడా ఉంది. అక్కడ దుమ్ముపట్టిన మూడు కిటికీలు ఇనుపఊచలు కలవి ఉన్నాయి. నాటిగుండా చూస్తే బయాట తోట ప్రదేశమైన ఖాళీ జాగా కన్పిస్తుంది. గదిలో ఉన్న నెగడు చక్కగా మండుతోంది. దాని పొగ గూడుపక్కనున్న అరమీద ఒక దీపం వెలుగుతూఉంది. ఎందుచేతనంటే, యింట్లోకి కూడా పొగమంచు దట్టంగావచ్చి పడుతోంది. ఆ నెగడు సమీపంగానే డాక్టరు జెకిల్ చాలా సుస్తీగా ఉన్నట్లు కూర్చున్నాడు. లోపలికి అట్టర్సను రాగానే

ఆయనను కలిసికొనుటకై లేచి ఎదురు రాలేదు. లోపలికి వచ్చిన తర్వాత ముభావంగా చెయ్యి చాచి కరస్పర్శ చేసి, కొంచెం మారిపోయిన గొంతుకతో "రా! కూర్చో!" అన్నాడు.

అట్టర్సను వెంటవచ్చిన బట్లరు అగు ఫూల్ వెళ్ళిపోగానే, "అయితే, నీవు యీ వింత వార్త ఏమైనా విన్నావా?" అని అట్టర్సను ప్రశ్నించాడు. డాక్టరు కంగారుపడ్డాడు. "అవును చౌకులో వాళ్ళు అరుస్తున్నారు. నేను భోజనశాలలోనుంచి విన్నాను" అని డాక్టరు జెకిల్ జవాబు చెప్పాడు.

"అయితే ఒక్కమాట" అని లాయరు ప్రస్తావిస్తూ అన్నాడు. "క్యారూగారు నా ఖాతాదారైన పార్టీ—నీవుకూడా అటువంటివాడవే. మీ విషయంలో నేను కల్పించుకున్న వ్యవహారం ఏమిటో నేనే ముందుగా అవగాహన చేసికోవాలి. ఆ వెధవయొక్క సంగతి అంతా కప్పిపెట్టడంలో నీవు కేవలం వెర్రి పుల్లాయివని చేయడం లేదుగదా?" అన్నాడు లాయరు.

"భగవంతుని సాక్షిగా చెప్పుతున్నాను అట్టర్సన్! వాడిని నేను తిరిగి కన్నెత్తిచూడనని దేవునిముందర ప్రమాణంచేసి చెప్పుతున్నాను. ఈ ప్రపంచంలో ఇక నా ప్రాణం వాడితో పిసుగెత్తిపోయిందంటే నమ్ము. నామీద ఒట్టు. ఆ కథంతా అయిపోయింది. నిజంగా వానికి నా సహాయమే

అక్కరలేదు. వాని సంగతి నాకు తెలిసినంతగా నీకు తెలియనే తెలియదు. వాడు క్షేమంగా ఉన్నాడు. వాడు పూర్తిగా క్షేమంగానే ఉన్నాడు—నామాటలు బాగా విను. వాడి సంగతేమీ యికమీదట నీ చెవిని పడదు." అని డక్టరు జెకిలు బిగ్గరగా అన్నాడు.

లాయరు ఇదంతా ఏదో మనోవ్యాకులంతో వింటూ కూర్చున్నాడు. తన స్నేహితుడు యింత ఆవేశంతో యిట్లా అరవడం అతనికేమీ గమించలేదు. "అయితే, వాడి విషయంలో నీకు ఖచ్చితంగా తెలుసు నన్నమాట. నీ మాటలనుబట్టి, నివు చెప్పినదే నిజ మనుకుంటాను. ఒకవేళ యీ వ్యవహారం కోర్టు కెక్కితే నీపేరు కూడా అందులోకి రావచ్చు" అని లాయరు అన్నాడు.

అందుకు డక్టరు జెకిల్ యిలా బదులు చెప్పాడు. "వాడి విషయంలో నాకు పూర్తిగా తెలుసు. ఆ విషయమై నాకు ఉన్న ధైర్యంలో కించిత్తుకూడా యితరులకు ఉండజాలదు. కాని, ఒక్క విషయంలో నీవు నాకు సలహా యివ్వవచ్చు—ఇప్పుడు నావద్ద ఉంది—నావద్దకు ఒక ఉత్తరం వచ్చిఉంది. దానిని పోలీసువారికి నే నిప్పుడు చూపించవచ్చునో కూడదో నాకు తెలియడంలేదు. ఆట్టర్సన్! దీనిని నీ చేతికి ఒప్పగిస్తాను. నీవైతే తెలివిగా ఆలోచించి నిర్ణయిస్తావు.

అది నాకు తెలుసు—నీవంటే నాకు గట్టి నమ్మకం ఉంది."

లాయరు అదివిని, "దానిమూలంగా వాడు పట్టుబడతాడనే భయం నీకు ఉన్నట్లుంది?" అన్నాడు.

"లేదు" అని జెకిల్ వాదిస్తూ అన్నాడు, "హైడ్ గతి ఏమవుతుందనే విషయం నాకు పట్టలేదు. అతనితో నా ప్రాణం విసుగెత్తిపోయింది. ఈ పాడు వ్యవహారంలో నా పేరు బయటికి రావడం మూలంగా నా పరువుమర్యాదల సంగతి నేను ఆలోచిస్తున్నాను" అన్నాడు.

అట్టర్సను కొంచెంసేపు ఆలోచనలో పడ్డాడు. తన మిత్రుడు కేవలం స్వలాభపరాయణుడై మాట్లాడుతూ ఉండడం అట్టర్సనుకు ఆశ్చర్యంగానే ఉంది. కాని అట్టర్సను మనస్సుకది కొంత హాయిగానే ఉంది "సరేగాని ఆ ఉత్తరం ఏది? నన్నుకూడా చూడనియ్యి" అన్నాడు.

ఆ ఉత్తరంలోని దస్తూరి అంతా ఒక వింత నిట్టనిలువు అక్షరాలలో ఉంది. "ఎడ్వర్డు హైడ్" అని అడుగున సంతకం ఉంది.

ఆ ఉత్తరంలో ఈ క్రిందివిషయములు క్లుప్తంగా సూచింపబడినాయి. ఈ లేఖ వ్రాసినవానికి డాక్టరు జెకిల్ అనేక విధముల అండగా ఉండి సహాయం చేసి యున్నాడు. వేలకొలది పర్యాయములు అలా

సహాయం చేసియుండినవాని యెడల చాలా అయోగ్యంగా హైడ్ ప్రవర్తించాడు. కాని, హైడ్ యొక్క ప్రాణానికి అపాయమున్నదనే దిగులు జెకిల్‌కు ఉండనక్కర లేదు. ఎందుచేతనంటే, తప్పించుకొని పారిపోవుటకు నాకు మార్గోపాయాలు ఉన్నాయి. వాటినే పూర్తిగా నమ్ముకొని ఉన్నాను." అని ఆ లేఖలో ఉంది. ఈ లేఖను లాయరు చూచి చాలా సంతోషించాడు. జెకిల్‌కున్నూ హైడ్‌కున్నూ ఉన్నటువంటి పరస్పర సంబంధం విషయం ఎటువంటిదో దాని అసలు తత్వం యీ లేఖవల్ల బోధపడుతోంది. ఆ విషయంలో అడనరకు అనేక అనుమానాలూ అపోహాలూ పడుచుండినందుకు లాయరు తన్నుతానే నిందించుకున్నాడు.

"ఆ ఉత్తరం తాలూకు పై కవరు కూడా ఉన్నదా?" అని ప్రశ్నించాడు.

"నా చేతిలోని కాగితం ఏమిటో అవగాహన చేసికొనకపూర్వమే, నేను ఆ కవరును పరాకుగా తగులబెట్టివేశాను. అయినా, దానిమీద పోస్టుముద్ర ఏమీ లేదు. ఆ కవరు ఉత్తరము ఒక మనిషి తెచ్చియిచ్చాడు" అని జెకిల్ అన్నాడు.

"ఈ ఉత్తరమును నాదగ్గరనే ఉంచుకొని, తలక్రింద పెట్టుకొని నిద్రపొమ్మంటావా?" అని అట్టర్సను ప్రశ్నించాడు.

"నా విషయంకూడా నీవే యోచించి నిర్ణయించాలి. నాకు ఆత్మధైర్యం అనేది పోయింది" అని జెకిల్ జవాబు చెప్పాడు.

"సరే. నేను ఆలోచించి చెప్తాను. నిన్నొక్క మాట అడుగుతాను. నీవు అదృశ్యుడవైన పక్షంలో నెరవేరవలసిన షరతును నీ వీలునామాలో నీ చేత హైడ్ చెప్పి వ్రాయించినదేనా?" అని లాయరు ప్రశ్నించాడు.

డాక్టరు జెకిల్ ఆ ప్రశ్నతో స్తంభించినట్లయినాడు. కాని, తన నోటిని చేతితో గట్టిగా మూసికొని, తల ఊపెను.

"అది నాకు తెలుసు. వాడు నిన్ను చంపాలని ఉద్దేశించాడు. నీవుమాత్రం బలేగా తప్పించుకున్నావు" అన్నాడు అట్టర్సను.

ఆ మాటమీద డాక్టరు కొంచెం గంభీరంగా యిల్లా అన్నాడు "అసలు మనకు ఇంకా ఎక్కువైన మేలులభించింది. స్వామీ! తండ్రీ! బుద్ధివచ్చే నీతిపాఠం నేను నేర్చుకున్నాను అట్టర్సన్!" అని రెండు చేతులతో రవ్వంతసేపు తన ముఖం మూసుకొన్నాడు.

లాయరు వెళ్ళిపోతూ వెళ్ళిపోతూ జెకిల్ గారి బట్లరు అయిన పూల్‌తో ఒకటిరెండు మాటలు మాట్లాడి వెళ్ళాడు. "దేవుడు చాలా మేలు చేస్తే— ఈ వేళ ఒక ఉత్తరం ఎవరో తెచ్చియిచ్చారట. అది

తెచ్చినమనిషి ఎట్లా ఉంటాడు?" అని లాయరు ప్రశ్నించాడు. పోస్టులో వచ్చిన ఉత్తరాలు తప్ప యింకేవీ రాలేదని పూల్ స్పష్టంగా చెప్పాడు. "పోస్టు ద్వారా వచ్చినవికూడా ఏవో ప్రకటనపత్రాలు మాత్రమే" అన్నాడు.

ఈ వార్త మూలంగా అట్టర్సనుకు తిరిగీ అనుమానాలు పొడబడ్డాయి. ఆ లేఖ పరిశోధనా మందిర ద్వారంగుండానే జెకిల్‌కు చేరిఉంటుంది. బహుశః వెనుకనున్న గదిలో ఆ ఉత్తరం వ్రాయబడిఉంటుంది. అదే నిజమైతే దానిని మరోవిధంగా విమర్శించాలి. ఎక్కువ జాగ్రత్తగా దానిసంగతి పరిశీలించవలసి ఉంటుంది. అట్టర్సను వెళ్ళుతూఉంటే, త్రోవలో పత్రికలు అమ్మే పిల్లకాళ్లు రస్తా ప్రక్కల చప్టాలమీద గొంతుక చించుకొని కేకలు వేస్తున్నారు. "ప్రత్యేక సంచిక! పార్లమెంటు సభ్యుని ఘోరహత్య!" అని అరుస్తున్నారు. అట్టర్సనుగారి మిత్రుడున్నూ, ఖాతాదారున్నూ మరణించినందుకు యీ కేకలన్నీ ఆయన ప్రశంసా ప్రసంగాలవలె ఉన్నాయి. ఈ మహాపాతక సుడిగుండంలోపడి మరొక మిత్రుని పరువు ప్రతిష్ఠలుకూడా గంగపాలై పోతాయేమోనని భయంకూడా అట్టర్సనుకు కలిగింది. అతనికి కొంచెం ఆశ పుట్టించిన ఊహ ఒకటి ఏదో మనస్సుకు తట్టింది. వస్తుతః తనకు తానే అన్నీ ఆలోచించుకొనే మనిషి అయినప్పటికీ, సలహాకోసం ఎవరినైనా సంప్రతించాలనే

కోరిక ఆయనకు కలిగింది. ఆ సలహానుకూడా సరా సరిగా అనుకగదలచుకోలేదు. కాని ఎట్లాగైనా మాటల సందర్భముగా రాబట్టవచ్చుననుకొన్నాడు.

త్వరలోనే ఆయన యింటికిచేరి, నెగడువద్ద ఒక ప్రక్కగా తాను కూర్చుండి తన పెద్ద గుమాస్తా అయినటువంటి గెస్ట్‌ను నెగడుకు మరొకప్రక్కను కూర్చుండనిచ్చి, యిద్దరికీ మధ్యగా బల్లమీద ద్రాక్షా రసం సీసా ఒకటి నెగడుకు తగినంత దూరంలో పెట్టు కొన్నాడు. చాలా కాలం గా ఆ యింటి నేల మాళిగలలో ఎండ కన్నెరుగకుండా బాగా మాగిన ద్రాక్షారసం అది—మాటుమణిగిన ఆ మహానగరం మీద వ్రాలిన పొగమంచు కూడా రెక్కలల్లార్చి నిద్రపోతున్నట్లుగా ఉంది. రాజవీధులలో దీపాలు రాచపుండ్లవలె మసకగా మండుతున్నాయి. కంబళ్లు కప్పినట్లుగా క్రిందకు వాలిన మేఘాల ముసుగుక్రింద, ఝంఝామారుత ఝుంకారపు హోరుతో ఆ మహానగ రపు రస్తాలమీద అంతులేని ఊరేగింపులాగున రహదారీ సాగుతూనేఉంది. వారు కూర్చున్న గది మాత్రము నెగడుమంట వెలుగులో హాయిగా ఉంది. ప్రక్క నున్న ద్రాక్షారసంసీసాలో పులుపు విరిగిపోయి చాలా కాలమైంది. రంగులద్దిన కిటికీఅద్దాలరంగు కాలంగడిచినకొద్దీ మెరుగెక్కింది. కొండచరియల నుండు ద్రాక్షతోటల ప్రాంతములలో ఈ శరదృతువు సాయంకాలపు పొద్దుల వెచ్చదనం ఈ లండను నగ

రపు పొగమంచు తెరలను చెదరకొట్టడానికి దండెత్తు తోంది. యథాదాలాపంగా లాయరుగారు మాటల ధోరణిలోకి దిగారు. ఆయన తన రహస్యవిషయాలు దాచకుండా చెప్పకొనుటకు గెస్ట్‌కంటె అంతరంగికుడు ఆయన కెవ్వరూ లేరు. గెస్ట్‌కు కూడ తెలియకుండా ఏవైనా విషయాలు రహస్యాలుగా ఆయన ఉంచదలచినప్పటికీ, ఆయన తలంచినన్ని ఉంచనే లేదు. అనేక వ్యవహారపు పనులమీద డాక్టరు జెకిల్ వద్దకు ఇదివరలో గెస్టు వెళ్లియున్నాడు. అతనికి ప్రూల్ బాగా తెలిసినవాడే. డాక్టరు యింట్లో హైడ్ చిరపరిచితుడనే విషయం అతనికి తెలియకపోలేదు. అతను కొన్ని కొన్ని అభిప్రాయములు స్వతంత్రంగా ఊహించి చెప్పగలవాడే. కనుక, అట్టి సందర్భములో, ఆ స్త్రీహూక్కుల విషయమై ఒక అగమ్యగోచరావస్థను కల్పించినటువంటి ఆ ఉత్తరమును అతడు చూడడం మంచిదేకదా? మీదు మిక్కిలి దస్తూరీలను పరీక్షించడంలో గెస్ట్ బాగా ఆరితేరిన ప్రవీణుడు కావడంచేత, అతను యీఉత్తరం పరిశీలించడానికి సహజమైన సరదాతో అంగీకరిస్తాడుగదా? అతడు సలహాలివ్వగలవాడు. ఇటువంటి వింత విపరీతపు వ్యవహార పత్రమును చదివిన తర్వాత అతను ఏదో ఒకమాట రవ్వంత అనక మానడు. ఆమాటలను బట్టి, ఆ వ్యాఖ్యానమునుబట్టి, అట్టర్సన్ ముందు వ్యవహారం తానే ఊహించుకోవచ్చు.

"సర్ డాన్వర్సుగారి విషయంలో చాలా ఘోరం జరిగింది" అన్నాడు అట్టర్సను.

"అవును బాబూ! నిజమే—జనంలో దీని మూలంగా చాలా గగ్గోలు కలిగింది. వాడెవడోగాని వట్టి పిచ్చిమనిషి". అని గెస్ట్ బదులు చెప్పాడు.

అందుమీదట అట్టర్సన్ యిలా అన్నాడు "ఆ విషయములో నీ అభిప్రాయం నాకు కావాలి. అతని స్వదస్తూరీతో వ్రాసిన కాగితమే ఒకటి నావద్దవుంది. ఇదంతా మనలో మనమాట అని గ్రహించు. ఎందుకంటే, దానిని ఏం చెయ్యవలెనో నాకు ఏమీ బోధపడటం లేదు. ఇదంతా ఛండాలపు వ్యవహారంగా వుంది. ఏమైతేనేం ఇదిగో కాగితం—నీముందు పెడ్తున్నాను. హంతకుని స్వదస్తూరీ లేఖ యిది."

గెస్ట్ కళ్ళు పెరిగేంత చేసికొని ఆ కాగితాన్ని సావధానంగా పరిశీలనకు చూస్తున్నాడు. "కాదండీ బాబూ! అతడు పిచ్చివాడు ఏంతమాత్రమూ కాదు. కాని, యీ వ్రాత చాలా విపరీతంగా వుంది" అని గెస్ట్ అన్నాడు.

"ఏవిధంగా చూచినా, చాలా విడ్డూరమైన లేఖకుడే" అని మాట అందుకున్నాడు లాయరు.

సరిగ్గా ఆ సమయంలోనే నవుకరు చీటీ ఒకటి తీసికొని లోపలికి వచ్చాడు.

"అది డాక్టరు జెకిల్ వద్ద నుంచేనా? ఆ దస్తూరీ

అతనిదే అని నా ఊహ. అది ఏమైనా ప్రయివేటు ఉత్తరమా అండి?" అని గెస్ట్ ప్రశ్నించాడు.

"భోజనానికి రమ్మని పంపిన ఆహ్వానం తప్ప మరేమీ కాదు. ఏం? నీవు ఇది చూస్తానంటావా?" అని అట్టర్సన్ అన్నాడు.

"చిత్తం. ఒక్క క్షణం అది యిట్లా యివ్వండి." అని గుమాస్తాయైన గెస్ట్ ఆ రెండు ఉత్తరములను ఒక దాని ప్రక్క నింకొకటి ఉంచి రెండింటిలోని అంశము లనూ చాల నిశితంగా పరీక్షించాడు. రెండు కాగితము లను వాపసు చేస్తూ, "చిత్తం—ఇది చాలా తమాషా దస్తూరీగా ఉంది" అన్నాడు గెస్ట్.

అట్టర్సన్ కొంచెం నిదానించాడు. కాని, ఆ రవ్వంత సేపులో తనలో తాను మథనపడ్డాడు. "రెండింటినీ పోల్చిచూచావెందుకు గెస్ట్!" అని హాఠాత్తుగా అట్టర్సను ప్రశ్నించాడు.

"బాబూ! రెండింటికీ ఒక విచిత్రమైన పోలిక ఉంది. అనేక విధాలుగా రెండూ ఒక్క ఫణితిలో ఉన్నాయి. కాని, అక్షరాల ఏటవాలు పోకడలో మాత్రం తేడా ఉంది" అన్నాడు గెస్ట్.

"బలే చిత్రం!" అన్నాడు అట్టర్సన్.

"మీరు అన్నట్లుగానే అది కొంచెం విచిత్రం గానే ఉంది" అన్నాడు గెస్ట్ మళ్లీ.

"ఈ లేఖ సంగతి పైకి వెల్లడించడం నా కిష్టం లేదు, తెలుసునా?" అని యజమాని అన్నాడు.

"కూడదండీ! నాకు తెలుసు" అని గుమాస్తా ప్రత్యుత్తర మిచ్చాడు.

అట్టర్సను ఆ రాత్రి ఒంటరిగా కూర్చున్న సమయంలో ఆ లేఖను భద్రంగా తన ఇనుపపెట్టెలో పెట్టి తాళంవేశాడు. అది మొదలుగా ఆ కాగితం అందులోనే దాగిఉంది. "ఒక హంతకుని దస్తూరీలో హెన్రీ జెకిల్ దొంగ ఉత్తరం వ్రాయడమా! ఎంతమాట! ఎంతమాట!" అని తల్చుకునేసరికి అట్టర్సన్ ఒంట్లో రక్తం చల్లబడిపోయింది.

## 6. డాక్టరు లాన్యనుగారి విచిత్ర అనుభవ విశేషం

రోజులు గడచిపోతున్నాయి. సర్ డాన్వర్సుగారి చావు కేవలం ఒక ప్రజోపద్రవంగా భావింపబడుటచేత, హంతకుని పట్టుకుంటే వేలకొలది పౌనుల మొత్తం బహుమానంగా యిస్తామని ప్రకటన చేశారు. హైడ్ అనేవాడు యీ జగత్తులో లేనే లేడు అన్నట్లుగా, పోలీసువారి ఆచూకీకి చిక్కకుండా మాయమైనాడు. అతనిని గురించిన వెనుకటి విశేషాలు కొన్ని దర్యాప్తు చేశారుకూడా — కాని, యీ పూర్వ విశేషాలన్నీ చాలా ఘోరంగా ఉన్నాయి. ఆ మనిషినిగురించి తెలిసిన కథలన్నీ అమానుష కిరాత దారుణ ప్రవర్తనలుగా ఉన్నాయి.

హద్దు మేరలేని అతని నడవడికనుగూర్చియు, అతని యొక్క విచిత్ర విపరీత సహచరులను గూర్చియు, అతని జీవితంలో మూర్తీభవించి యున్నటువంటి మద మాత్సర్యములను గూర్చియు, చాలా కథలు తెలియ వచ్చినాయి. కాని అతని ప్రస్తుత కాపురాల గూర్చి ఒక్కముక్కయినా చెప్పినవాళ్లు లేరు. హత్యజరిగిన నాటి తెల్లవారిజామున సోహో చౌకులోని అతని యింటినుంచి నిష్క్రమించినది మొదలు అతడు నామరూపాలు లేకుండా పోయినాడు. అట్టర్సనుకు మొదట్లో కలిగిన కలవరపాటు, కొంత శాంతించి, ఆ ఉధృతం క్రమేణా తగ్గినకొలదీ అతని మనస్సుకూడా కుదటబడింది. సర్ డాన్వర్సు ఖూనీ చేయబడినందుకు ఫలితంగా హైడ్ ఊరు పేరు లేకుండా అంతరించాడు కనుక, ఆ హత్యకు అది తగిన ప్రాయశ్చిత్తమేనని అట్ట ర్సను తన ఊహాధోరణినిబట్టి ఊహించుకొన్నాడు. ఆ దుష్టుని సహవాసదోషం యిప్పుడు లేదు గనుక, డాక్టరు జెకిల్ జీవితం కొత్త అధ్యాయంలోకి మారింది. డాక్టరు జెకిల్ యిప్పుడు తన మారుమూల సౌధంలో కూర్చుండక బయటకువచ్చి తన స్నేహితులతో కలిసి మెలసి తిరుగుతున్నాడు. తన స్నేహితులకు తాను అతిథిగా ఉంటూఉండడం, తన స్నేహితులను విందు భోజనానికి తాను ఆహ్వానించడం సాగించాడు. దాన ధర్మాలుచేయడంలో అతను అదివరకే సుప్రసిద్ధుడు. ఇప్పుడు దానికి తోడుగా మతవిషయ భగవద్గోష్ఠిలో

కూడా ప్రముఖుడైనాడు. ఎప్పుడూ ఏదో వ్యవహార ప్రసక్తితో, పదిమందిలో కలిసి తిరుగుతూ, సత్కార్యాలు చేస్తూఉన్నాడు. ముఖంకూడా వికసించినట్లుగా తేజోవంతంగా ఉంటున్నది—పరోపకార సేవాసక్తితో మనిషి ప్రకాశిస్తున్నట్లుగా ఉన్నాడు. ఇంచుమించు రెండుమాసాలకు మించి డాక్టరు జెకిల్ జీవితం ఆత్మశాంతి పరిశోభితం అయింది.

జనవరి 8 తేదీని డాక్టరు జెకిల్ యింట్లో కొద్దిమందికి విందుజరిగింది. దానికి అట్టర్సను హాజరైనాడు. డాక్టరు లాన్యనుకూడా అక్కడకువచ్చాడు. వీరు ముగ్గురూ ఒకరినివిడిచి ఇంకొకరు ఉండక సన్నిహితస్నేహంతో కలిసిమెలిసి తిరుగుతున్నటువంటి వెనుకటి దినాలలో డాక్టరు జెకిల్ ఏవిధమైన స్నేహభావంతో చూచేవాడో ఆ విధంగానే నేడుకూడా డాక్టరు జెకిల్ ఒక్కొక్కరివంక స్నేహానురాగంతో చూచాడు. కాని, జనవరి 12 తేదిని, 14 తేదీని జెకిల్ యింటికి లాయరు వెళ్లితే లోపలికిపోనుటకు వీలు లేకుండా తలుపు మూసివేయబడింది.

"డాక్టరు బయటకు వెళ్లకుండా యింట్లోనే ఉంటున్నాడు. కాని ఎవ్వరికీ దర్శనం యివ్వడంలేదు" అని బట్లరైన పూల్ అన్నాడు—తిరిగి 15 తేదీని అట్టర్సను వెళ్లాడు—కాని దర్శనం లభించలేదు. గత రెండు మాసాలలో తన మిత్రుణ్ని ప్రతిరోజూ కలిసికొని కాలక్షేపం చేస్తూ ఉండడం అట్టర్సనుకు అలవాటై

పోయింది. అందువల్ల తన మిత్రుడు యీవిధంగా తిరిగి ఏకాంతవాసంసాగించడం ఏమిటో అట్టర్సనుకు అర్థం కాక అది అతని మనస్సును వేధిస్తోంది. నాలుగు పర్యాయములు అతని దర్శనానికి ప్రయత్నించి, ఇక అయిదోరోజు రాత్రి తన గుమస్తాయైన గెస్ట్‌ను తన యింటికి భోజనానికి రమ్మని పిలిచాడు. ఆరో రోజు రాత్రి తానే డాక్టరు లాన్యను యింటికి వెళ్లాడు.

అక్కడమాత్రము అట్టర్సను నిరభ్యంతరంగా లోపలికి వెళ్లాడు. కాని, లోపలికి వెళ్ళినతర్వాత, డాక్టరు లాన్యను ముఖంలో కలిగిన కొత్తమార్పును చూచి అట్టర్సన్ నిర్ఘాంతపోయినాడు.

అతని రోజులు దగ్గరకు వచ్చాయని అతని ముఖంలో స్పష్టంగా కన్పిస్తోంది. అదివరకు పద్మం లాగున ఉండే ముఖం ఇప్పుడు పాలిపోయిఉంది. మని షిలో కండపుష్టి బాగా తగ్గిపోయింది. వెనుకటికంటే చాలాంబట్టతల అయింది. ఎక్కువ ముసలివాడుగా కన్పి స్తున్నాడు. శరీరం యీ విధంగా శుష్కించడం చూచి అట్టర్సను అంతగా నిర్ఘాంతపోలేదు. కాని, ఆయన చూపులోనూ తీరులోనూ వేరుపారిన పెనుభూతంవంటి పెనుభీతి ఒకటి కన్పించడంవల్లనే అట్టర్సన్ అలా నిర్ఘాంతపోయినాడు—డాక్టరు లాన్యనుకు మరణం అంటే భయముండడం అసంభవం. అటువంటిదే ఆయ నలో ప్రవేశించినదని లాయరు అనుమానించాడు.

“అవును. ఆయన డాక్టరు కనుక ఆయన స్థితి ఎట్లా

ఉన్నదో ఆయనకు తెలిసిఉండాలి. తన రోజులు సమీపించాయని గ్రహించి ఉండాలి. ఈ గ్రహింపువల్లనే ఆయన కృశించియుండవచ్చు." అని ఆయన ముఖలక్షణాలగూర్చి అట్టర్సను కొంచెం విమర్శిస్తూ అనుకొన్నాడు. అప్పుడు డాక్టరులాన్యను తనపనిఅంతా అయిపోయిందనిన్నీ, తనకు ఆయువు మూడినదనీన్నీ నీళ్లు నములకుండా నొక్కి వక్కాణించాడు.

"నాకు మనస్సు చెదిరిపోయింది. నే నిక తిరిగి కోలుకోలేను. నా పని ఇక కొద్దివారాలలోనే ఉంది. బ్రతికినంతకాలమూ నా జీవితం హాయిగా గడచిపోయింది. నాకు బ్రతుకుమీద భ్రమ ఎప్పుడూ ఉంది. అవును. నిజంగానే జీవితంఅంటే సదా సరదాపడ్డాను. మనము సమస్తమూ తెలిసినవాళ్లమే అయినట్లైతే, యీ లోకంనుంచి వెళ్ళిపోవడమే ఉత్తమమని నాకు అప్పుడప్పుడు తోస్తూఉంటుంది." అని డాక్టరు లాన్యను అన్నాడు.

"జెకిల్ కూడా జబ్బుగానే ఉన్నాడు. అతనిని యీ మధ్య ఎప్పుడైనా చూచావా?" అన్నాడు అట్టర్సన్.

లాన్యన్ ముఖంలో రంగుమారింది. వణుకుతూ వణుకుతూఉన్న చేతిని పైకి ఎత్తాడు. "డాక్టరు జెకిల్‌ను నేను చూడదలచుకోలేదు. అతనిమాట నేను వినదలచుకోలేదు. అతనితో నా ప్రాణం తల్లడిల్లిపోయింది. గతించిన మనిషిగా నేను భావిస్తున్నటువంటి ఆ వ్యక్తిని

గూర్చి నీవు ప్రస్తావించవద్దని నా మనవి" అని డాక్టరు లాన్యను గొంతుక పెద్దచేసి అన్నాడు.

ఆ మాట విని అట్టర్సను కొంత సేపు ఆగి, "ఛా! ఛా! నీకు నేను ఏమీ సహాయం చెయ్యనే లేనా? లాన్యన్! మనం ముగ్గురం ఎంతో పాత స్నేహితులం. ఇంకా మనం కొత్త స్నేహాలు చెయ్య డానికి ఇంకా బ్రతుకబోయేది లేదు" అన్నాడు అట్టర్సను.

"నీవు నాకు చేయగల్గింది ఏమీ లేదు. అతనినే వెళ్ళి అడుగు" అని లాన్యను బదులు చెప్పాడు.

"అతడు నాకు దర్శనమే యివ్వడం లేదు" అని లాయరుగారు అన్నాడు.

అప్పుడు లాన్యను యిలా జవాబు చెప్పాడు. "అందులో నాకు ఆశ్చర్యమేమీ లేదు. అట్టర్సన్! నేను చచ్చిపోయిన తర్వాత యీ విషయంలో ఉన్న మంచిచెడ్డలు ఒకనాటికి నీకే బహుశః బోధపడ వచ్చు. నే నిప్పుడేమీ చెప్పలేను. బాబూ! వెయ్యి దేవుళ్ళకు దణ్ణంపెడ్తా! ప్రస్తుతం నాతో యితర విషయాలు యేవైనా నీవు మాట్లాడ గల్గితే, ఇక్కడ కూర్చుండి మాట్లాడు. కాని ఆ ప్రస్తావన తప్ప ఇంకో సంగతి నీవు మాట్లాడ లేనంటే, దేవుడా! నేను అది భరించ లేను. నీవు దయచెయ్యి!" అన్నాడు.

అనంతరం అట్టర్సను తనయింటికి వెళ్ళి, వెంటనే ఒక ఉత్తరం జెకిల్‌కు వ్రాశాడు. జెకిల్ యింటికి తాను

వస్తే దర్శనం యివ్వక నిరాకరిస్తున్న విషయమున్నూ, డాక్టరు లాన్యనుతో డాక్టరు జెకిల్ తన స్నేహ సద్భావమును చెడగొట్టుకొనడం శోచనీయమనియున్నూ, అందుకు గల సందర్భ కారణములను తెలియజేయ వలసినదనిన్నీ ఆ ఉత్తరంలో వ్రాశాడు. ఇందుకు జవాబుగా మరునాడొక పెద్దఉత్తరం జెకిల్ వద్దనుంచి వచ్చింది. అందులోని వాక్యాలన్నోరణి అక్కడక్కడ విశేష విషాదభరితంగా ఉంది. కాని, కొన్నిచోట్ల అర్థంకాని సందర్భాలతో ఉంది. డాక్టరు లాన్యనుతో సంభవించిన కయ్యానికి తిరుగు లేదు. డాక్టరు జెకిల్ యిలా వ్రాశాడు—"మన పాతమిత్రుణ్ణి నేనె విషయంలో నిందించను. కాని, తిరిగీ మేమిద్దరం కలిసికొనడం మంచిది కాదని అతడు తన అభిప్రాయం తెలియజేశాడు. నా అభిప్రాయంకూడా అంతే. ఇకముందునుంచి నేను ఏకాంతవాసంచేస్తూ కాలం గడపుటకు నిశ్చయించాను. ఆవిషయమై నీవు ఆశ్చర్యపడవద్దు. నీకుకూడా నేను దర్శనం యివ్వక తలుపు బంధించి కూర్చున్నందువల్ల మన యిద్దరిమధ్య ఉన్న స్నేహాన్ని గూర్చి శంకించవద్దు-నానిగూఢతంత్రపద్ధతిలో నన్ను పోనియ్యి. నాకు నేనే స్వయంకృతాపరాధంవల్ల ఒక ఉపద్రవం తెచ్చిపెట్టుకొని తగిన ప్రాయశ్చిత్తం అనుభవిస్తున్నాను. పాపులలోకెల్ల నేను పాపిష్టి శిఖామణిని అయినట్లయితే, దానివల్ల అధోగతిపాలైనవాళ్లల్లో కూడ నేనే అగ్ర

గణ్యుడను-ఇటువంటి అలవికాని ఘోరావస్థలున్నూ, భయంకరవిపత్తులున్నూ యీ ప్రపంచంలో ఉంటా యని నే నెన్నడూ ఊహించలేదు. నాదుర్గతిని నేను భరించగలిగేటట్లు నీవు నాకు సహాయంచేయ దలంచు కున్నట్లయితే, నా మౌనం విషయంలో నీకు సహనం ఉండాలి."

ఈ ఉత్తరం చదువుకున్న అట్టర్సను ఆశ్చర్య పోయినాడు. హైడ్ యొక్క సాంగత్యదోషం జెకిల్ ను బాధించకుండా తొలగిపోయిందిగదా. డాక్టరు జెకిల్ తిరిగీ వెనుకటి సద్గోష్ఠిలోనూ మంచి సహవాసాల లోనూ తిరుగుతున్నాడు.—అతడు తిరిగీ ఉల్లా సంగా ఈముది వయస్సులో గౌరవమర్యాదలతో కాల క్షేపంచేయగలడనే సూచనలు బాగా కన్పించినవి. కాని, అటువంటి పరిస్థితిలో అతని ఆంతరంగిక మిత్రులతోటి స్నేహసద్భావాలూ, అతని మనశ్శాంతి, అతని జీవితధోరణి, యివన్ని ఒక్కక్షణంలో ధ్వంస మైపోయినాయి. ఇటువంటిమార్పు యింత హఠాత్తుగా అతనిలో రావడంచూస్తే అతనికి మతి చెడిందని తోస్తోంది. కాని, డాక్టరు లాన్యను చెప్పిన మాటలను బట్టియు, ఆమాటల నైఖరినిబట్టియు చూస్తే డాక్టరు జెకిల్ విషయంలో ఇంకా ఏదో అగాధమైన అంత రార్థం ఉండి తీరాలి.

వారంరోజులైన తర్వాత డాక్టరు లాన్యను మంచంపట్టి, పదిహేనురోజులలోపల నే స్వర్గస్థు

పైనాడు. ఆయన అంత్యక్రియలకు అట్టర్సను వెళ్లాడు. ఆనాటిరాత్రి అట్టర్సను తన కచ్చేరీ గదితలుపు తాళం వేసి లోపల కూర్చుండి బిక్కుబిక్కుమంటూ వెలుగుతున్న ఒక కొవ్వొత్తిదీపపు వెలుతురులో సీలువేసిన ఒక కవరు ఉత్తరం తన ముందర ఉంచుకొని పరిశీలించడం ప్రారంభించాడు. స్వర్గస్థుడైన తన మిత్రుని స్వదస్తూరీతో దానిమీద అడ్రసు వ్రాయబడి ఉంది. ఆయనసీలుతోనే దానిమీద సీలు వేయబడి ఉంది. "ఇది అంతరంగికం—జే. జి. అట్టర్సను చేతికే యీ ఉత్తరం యివ్వాలి. నా కంటేముందుగా ఆయనే గతిస్తే దీనినెవ్వరూ చదువకుండా ధ్వంసం చేసివేయాలి" అని ఆ కవరుమీద ఖండితంగా వ్రాయబడి ఉంది. అందువల్ల ఆ కవరులోని అంశములను చదివి చూడడానికి లాయరు భయపడ్డాడు. "ఒక మిత్రుణ్ణి ఈవేళ భూస్థాపితం చేసి వచ్చాను. దీనిమూలంగా మరొకణ్ణి నేను నష్టపడితే మాత్రమేమిటి?" అని అట్టర్సను తనలో తాను అనుకొన్నాడు. తాను ఆ ఉత్తరంలోది చూడడానికి వెనక్కు తీయడం తన మిత్రునకు ద్రోహం చేయడమే అని నిర్ణయించి ఆ సీలును భేదించాడు. ఆ కవరులోపల మరొక కవరుఉంది. దానికికూడా సీలుఉంది. "డాక్టరు హెన్రీ జెకిల్ మరణించేవరకుగాని, అదృశ్యుడయ్యేవరకు గాని దీనిని తెరువకూడదు" అని ఆ కవరుమీద స్పష్టంగా వ్రాసిఉంది. అట్టర్సనుకు ఇదంతా మాయగా ఉంది. అవును. అదృశ్యుడు కావడమే. ఆ పిచ్చి వీలు

నామా కాగితంలో ఆలాగే వ్రాసి వుంది. దానిని చాలారోజుల క్రిందటనే అసలు ఆసామీకి అట్టర్సను వాపసు చేశాడు. హెన్రీ జెకిల్ పేరున్నూ అతని అంతర్థానం అనే మాటయున్నూ తిరిగీ యిక్కడ కన్పిస్తున్నాయి. హైడ్ అనేవాని కుత్సితపు సలహానను సరించి ఆవీలునామాలో ఆమాటలు వ్రాయబడినాయి. చాలా స్పష్టంగా దారుణంగా పైకి కన్పిస్తూఉన్న దురుద్దేశంతో ఆమాటలు వీలునామాలో చేర్చ బడినాయి. కాని, ఆమాటలే తిరిగీ డాక్టరు లాన్యను స్వదస్తూరీలో వ్రాశాడంటే, ఆమాటల అర్థం ఏమిటి? కవరు ఉత్తరమును తెరువరాదనే నిషేధం ఉన్న ప్పటికీ, దానికి తాను ధర్మాధికారిగా ఉన్నప్పటికీ, దానిని తెరచి చూడవలెననే ఆసక్తి అట్టర్సనుకు కలిగింది. ఈ గూఢతంత్ర మర్మవ్యవహారం అంతు కనుక్కోవలెనని బుద్ధి పుట్టింది. కాని, తన లాయరు వృత్తి మర్యాద ప్రకారంగా, తన మిత్రునకు తాను నమ్మకద్రోహం చేయరాదనేభావంతో మిత్రుని కోరికను అట్టర్సను చెల్లింపవలసినవాడయ్యెను. అందు వల్ల అతని ఇనుపపెట్టెలో అంతర్గర్భితంగా ఒకమూల భద్రంగా ఆ కవరు పడిఉంది.

రహస్యమైనదాని ఆచూకీ తెలిసికోవలెననే కుతూహలాన్ని అణచివేయడం ఒకఎత్తు. దానిని పూర్తిగా జయించడం ఇంకొక ఎత్తు. అతనికి ఇక మిగిలినమిత్రుణ్ణి అయినా కలిసికోవలెననేకోరిక అతనికి

అదివరకు ఉన్నంత హెచ్చుగా ఆనాడు మొదలుకొని ఉన్నదని చెప్పడానికి వీలులేదు. తనమిత్రుడైన డాక్టరు జెకిల్ విషయంలో స్నేహానురాగం ఉంది. కాని, ఆయనను స్మరించినప్పుడు మనస్సు కలవరపడి కంపించేది. అతనిని చూడడానికి కూడా వెళ్ళాడు. కాని లోపలికి రానివ్వక పోవడంవల్లనే ఆయన మనస్సుకు హాయిగా ఉన్నట్లుంది. స్వగృహంలోనే కారాగృహంలో ఉన్నట్లుగా బంధించుకొనికూర్చున్న అగమ్యగోచర మానవునితో కలిసి కూర్చుండి సంభాషించడంకంటె, ఆయింటిగుమ్మంవద్దనే కొంచెంసేపు నిల్చుండి విశాలమైన లండను నగరపుగాలి పీల్చుతూ సందడిమధ్య ఆయింటిబట్లరైన పూల్‌తో రవ్వంతసేపు సంభాషించి వెళ్ళిపోవడమే అట్టర్సనుకు మంచి దనిపించింది. పూల్ చెప్పే వార్తలలో కూడా చెవి కింపయినవిషయాలేమీ ఉండడంలేదు. డాక్టరు జెకిల్ ఇదివరకుకంటె యిప్పుడు పరిశోధనామందిరానికి ఆవలఉన్న గదిలోనే సదా ఉంటున్నాడట. తరచు అక్కడే నిద్రపోవడం కూడా జరుగుతోంది. మనిషిలో ఖులాసాలేదు. పూర్తిగా మౌనముద్ర వహించాడు. గ్రంథ కాలక్షేపంకూడా లేదు. ఆయనమనస్సులో ఆయనను ఏదో వేధిస్తూ ఉన్నట్లుగా ఉంది. ఎన్నాళ్లు చూచినా, డాక్టరు జెకిల్‌నుగూర్చి యీవిధమైన వార్తలనే నిరంతరంగా వింటూఉన్న కారణంచేత, డాక్టరు యింటికి తరచుపోవడంకూడా అట్టర్సనుతగ్గించివేశాడు.

# 7. కిటికీవద్ద విశేషం

ఆనాడు ఆదివారం. ఎస్ఫీల్డ్‌తో కలిసి అట్టర్సను మామూలుప్రకారంగా షికారు బయలుదేరాడు. తిరిగీ వారిద్దరూ వెనుకటి సందులోనుంచి నడవడం ప్రారంభించారు. ఆ గుమ్మందగ్గరకు రాగానే అక్కడ ఆగి దానివంక ఎగాదిగచూడడం ప్రారంభించారు.

"సరి. ఆకథ సర్వం సమాప్తం అయినట్లే ఇక. హైడ్ చూపులు యిక మనకు లేవన్నమాటేకదా!" అని ఎస్ఫీల్డ్ అన్నాడు.

"ఇక లేవనేఅనుకుంటాను. నేనొకసారి అతనిని కలిసికొన్నాను. అతన్ని చూస్తే నీకెంత వెగటు పుట్టిందో నాకుకూడా అంత వెగటు పుట్టింది. ఈవిషయం నీకు నేను ఎప్పుడైనా చెప్పానా?" అని అట్టర్సను ప్రశ్నించాడు.

"అతణ్ణి చూడడం అంటూ సంభవిస్తే, వెగటు పుట్టకపోవడం అసంభవం. అది అలా ఉండనియ్యి. ఈ గుమ్మం డాక్టరు జెకిలు మకానుకు కేవలం దొడ్డిగుమ్మం. వెర్రి వెంగళప్పలాగున యీమాత్రం తెలిసికోలేకపోయినాను. నీవు పొరబాటుపడడంవల్ల నే ఆసంగతి నేను గ్రహించడం జరిగింది" అని ఎస్ఫీల్డ్ బదులు చెప్పాడు.

"అయితే, నీవు ఆ విషయం తెలిసికొన్నావన్న మాట. ఆలాగయితే, మనము పెరటిజాగాలోకి వెళ్ళి

కిటికీలవైపు చూచి రావచ్చు. నిజం చెప్తున్నాను నీకు. పాపం! జెకిల్ విషయంలో ఏం చెయ్యాలో నాకేమీ తోచడం లేదు. బయటనే సమీపంగా అతనివద్ద మిత్రు డెవరైనా ఉంటే, అతని మనస్సుకు కొంత హాయి కలుగుతుందని నాకు తోస్తోంది" అన్నాడు అట్టర్సను.

పెరటిజాగాలో ఎక్కువ చల్లగా, కొంచెం తేమగా ఉంది. అస్తమించే సూర్యుని కాంతితో పైన ఆకాశం ప్రకాశిస్తోంది. అయినప్పటికీ, ఆ పెరటి జాగా అంతా, కొంచెం త్వరగా నే సాంధ్యరాగపు నీరెండతో నిండి ఉంది. మూడు కిటికీలలో మధ్య కిటికీకి తలుపులు సగం తెరువబడి ఉన్నాయి. దానికి దగ్గరగా ప్రక్కనే డాక్టరు జెకిల్ కూర్చున్నాడు. విసుగెత్తిన విరక్తుడైన ఖైదీలాగున, అమిత విషాద భారంతో ప్రయాసతో శ్వాస పీలుస్తున్నాడు.

"ఏమోయ్! జెకిల్! జెకిల్! ఇప్పుడు నీకు కొంచెం ఖులాసాగా ఉన్నదనుకుంటా" అని అట్టర్సను కేక వేశాడు.

"నాకేమిటో వంట్లో చాలా క్రుంగిపోయి నట్లుగా ఉంది. అమితంగా క్రుంగినట్లుంది. దేవునిదయ వల్ల యిది ఎక్కువకాలం ఉండదనుకుంటాను" అని డాక్టరు నీరసంగా అన్నాడు.

"నీవు ఇల్లుకదలకుండా బంధించుకొని కూర్చుం డడం ఎక్కువైపోయింది. నేనూ, ఎన్ఫీల్డ్ తిరుగుతున్న మాదిరిగానే నీవుకూడా షికారుగా బయటికి వచ్చి

ఒంట్లో రక్తాన్ని కొంచెం జోరు చెయ్యాలి (ఇదిగో డాక్టరు జెకిల్! ఇతను నా జ్ఞాతి సోదరుడైన ఎన్ఫీల్డ్) రావోయ్! టోపీ తగిలించుకో! మాతో సరదాగా ఒక్కచుట్టు తిరిగి రావచ్చు రా!" అని లాయరు అన్నాడు.

"నీవు చెప్పినదంతా బాగానే ఉంది. అలా చేస్తే బాగానే ఉంటుంది. కాని, వద్దు. వద్దు బాబూ! వద్దు. అదేమీ సాధ్యమయ్యే పని కాదు. నేను సాహసించి రాలేను. అట్టర్సన్! నిన్ను చూస్తే నాకు చాలా సంతోషమౌతుంది. పరమానందం అయింది. నీవూ, ఎన్ఫీల్డ్ ఒకసారి పైకివస్తే బాగుండును. కాని, యీ చోటు ఏమీ బాగాలేదు" అని డాక్టరు జెకిల్ ఒక్క నిట్టూర్పు విడిచాడు.

"అలాగయితే, మేము ఇక్కడనే క్రిందనిల్చొని ఇక్కడనుంచే నీతో మాట్లాడుతూఉండడం ఉత్తమం" అని లాయరు సౌమ్యంగా అన్నాడు.

"ఆమాటే నీతో అనవలెననినా మనస్సులో అనుకుంటున్నాను" అని డాక్టరు చిరునవ్వు నవ్వుతూ తిరిగీ అన్నాడు.

ఆమాటలు అన్నాడో లేదో, అతని ముఖంలో ఆ చిరునవ్వు అంతర్ధానమైపోయి, ఘోరమైనభయమూ, దిగులూ ఆముఖంలో ప్రత్యక్షమైనాయి. అదిచూచి క్రింద నిల్చున్న ఆ యిద్దరు పెద్దమనుష్యులూ ఒంట్లో రక్తం గడ్డకట్టినట్లుగా స్తంభించిపోయినారు. ఆ ముఖ

వైఖరిని ఒక్కక్షణమే చూచారు. ఎందుచేతనంటే, కిటికీ రెక్కలు వెంటనే క్రిందికి దిగిపోయినాయి. కాని, ఆక్షణమాత్రవీక్షణమే చాలు. వారిద్దరూ ఆ పెరటి ఆవరణలోనుంచి, నోటివెంట మళ్ళీ మాట లేకుండా, బయటికి వెళ్ళిపోయినారు. ఆ సందులోనుంచికూడా మౌనంగానే నడిచారు. ప్రక్కనున్న ఒక పెద్ద రహదారీమీదకు వచ్చారు. ఆదివారం అయినప్పటికీ ఆ రహదారీమీద అక్కడక్కడ జనసంచారం ఉంది. అప్పుడు అట్టర్సన్ చిట్టచివరకు ఒక్కసారి తన సహచరునివంక కన్నెత్తి చూచాడు. ఉభయుల ముఖాలూ తెల్లబోయినట్లున్నాయి. వారి కళ్ళల్లోని నిర్ఘాంత భయభ్రాంతి ఏదో బదులు జవాబు చెప్పినట్లుగా ఉంది.

"భగవత్కటాక్షం! భగవత్కటాక్షం!" అన్నాడు అట్టర్సను.

ఎన్ఫీల్డ్ చాలా ఆదుర్దాగా తల పంకించి మరల మౌనముద్రాంకితుడై ముందుకు నడచెను.

## 8. కడపటి రాత్రి

ఒకనాటి సాయంకాలం భోజనానంతరం అట్టర్సన్ తన యింట్లో నెగడు ప్రక్కనే కూర్చున్నాడు. తనకోసం ప్రూల్ తలవని తలంపుగా రావడంచూచి అట్టర్సను ఆశ్చర్యపోయినాడు.

"ఏం ? ప్రూల్ ! యిట్లా వచ్చావ్ ?" అని అట్టర్సన్ ఒక్క కేక వేశాడు. తిరిగి అతనివంక చూచి

"ఏమిటోయ్! అట్లా బేజారై ఉన్నావ్? డాక్టరు వంట్లో ఏమైనా సుస్తీగా ఉందా?" అని ప్రశ్నించాడు

"అట్టర్సన్ గారూ! ఏదో కొంపమునిగిందండీ!" అన్నాడు ఆ మనిషి.

"రా! సావధానంగా కూర్చో—ఒక గ్లాసు ద్రాక్షారసం ఇదిగో—పుచ్చుకో—కొంచం నిదానించి నీకు ఏం కావాలో నాతో చెప్పు" అని లాయరు చెప్పాడు.

అందుకు పూల్ యిలా అన్నాడు. "అయ్యా! డాక్టరుగారి తత్వం మీకు తెలిసే ఉంటుంది. ఆయన ఎట్లా తలుపులు బంధించుకొని కూర్చుంటాడో మీకు తెలిసినదే. సరి—ఆయన యిప్పుడు ఆ విధంగానే తిరిగి గదిలో బంధించుకొని కూర్చున్నాడు. అదేమిటో గాని, అది నేను చూచి సహించలేకుండా ఉన్నాను. నాకు అది సహించడం అంటే ప్రాణం పోతుంది. అయ్యా! అట్టర్సన్ గారూ! నా కేమిటో గాబరాగా ఉంది."

"అప్పునోయ్! పెద్దమనిషీ! స్పష్టంగా చెప్పవోయ్! నీవు గాబరాపడేది దేనికోసం?" అన్నాడు లాయరు.

"వారం రోజులనుంచీ నేను హడలిపోతున్నాను. ఇక నేనిది భరించలేను బాబూ!" అని లాయరు అడిగినది ఆలకించకుండానే పూల్ జవాబు చెప్పాడు.

ఆ మనిషి ఆ మాటలు అంటూవుంటే, అతని ముఖంలోనే అతని భయం గోచరిస్తోంది—అతని కైఖరి అంతా చాలా దారుణంగావుంది. తన కంగారు అంతా వెల్లడించిన మొదటి క్షణంలో తప్ప, తిరిగీ లాయరు ముఖం కన్నెత్తి చూడకుండానే ఫ్రూల్ మాట్లాడుతున్నాడు. ఇప్పుడుకూడా, తన కిచ్చిన ద్రాక్షారసం గ్లాసును చేత్తో పట్టుకొని, మోకాలిమీద పెట్టుకొని, కొంచెమైనా రుచి చూడకుండా, ఆ గదిలో ఒక మూలకు చూపు నిల్పి కూర్చున్నాడు. "ఇక నేను సహించలేను" అని తిరిగీ అన్నాడు.

"సరే. ఇటు చూడు ఫ్రూల్! నువ్వు చెప్పే దానిలో నాకు సబబు కన్పిస్తోంది. ఏదో వ్యవహారం చెడిందని తెలుస్తోంది—అసలు సంగతి ఏమిటో నాకు చెప్పు" అన్నాడు లాయరు.

"ఏదో దుర్మార్గం జరిగిందని నా నమ్మకం." అన్నాడు ఫ్రూల్, బొంగురుపోయిన గొంతుకతో.

"దుర్మార్గమా! ఏమిటా దుర్మార్గం? ఆమనిషి ఊహ ఏమిటి?" అని చాలా భయకంపితుడై అంతు మూలంగా చిరాకుపడుతూ లాయరు అన్నాడు.

"ఏం చెప్పడానికీ నాకు నోరు రావడంలేదు బాబూ! మీరే ఒక్కసారి స్వయంగా చూడడానికి దయచేస్తారా?" అని ఫ్రూల్ జవాబు చెప్పాడు.

అట్టర్సను వెంటనేలేచి తన టోపీ పెట్టుకొనడం, తనకోటు వేసుకోవడం తప్ప మరొకజవాబు

చెప్పలేకపోయినాడు. అంతటితో బట్లరుకు ప్రాణం లేచివచ్చినట్లుగా అతనిముఖంలో కన్పించింది. అది అట్టర్సనుచూచి గ్రహించాడు. బట్లరుకు యివ్వబడిన ద్రాక్షారసం కించిత్తయినా రుచి చూడకుండానే తిరిగి దానిని అక్కడపెట్టి, అట్టర్సనుతో కలిసి వెళ్లుటకు లేచాడు. అదికూడా అట్టర్సను గమనించాడు.

అది మార్చినెల—రాత్రిసమయం-చంద్రుడు పాలిపోయినట్లుగా వెలవెలపోతున్నాడు. గాలికి తూలి వెనుకకు పడిపోయినట్లుగా కన్పిస్తున్నాడు. ఋతుక్రమాన్నిబట్టి వెర్రిచలి వేస్తోంది. గాజుముక్కలు విరజిమ్మినట్లుగా నుంచుకురుస్తోంది. ఆ యీదురుగాలిలో మాట్లాడడంకూడా కష్టంగా ఉంది — ముఖంలోకి రక్తం ఎగజిమ్మినట్లుగా ఉంది. ఆచల్లగాలి మూలంగా వీధులు మనుష్యసంచారం లేకుండా శూన్యంగా ఉన్నాయి. లండనునగరంలోని యీ ప్రాంతం యింత సంచారశూన్యంగా ఎప్పుడూ లేదని అట్టర్సను అనుకొన్నాడు. జనసమ్మర్దంఉంటే బాగుండునని అనుకొన్నాడు. సోదరమానవుడు ఎవడైనా తటస్థపడితే తాకిచూడవలెననేకోరిక ఆయనజన్మలో యిదివరకెప్పుడూ యింతవిపరీతంగా కలుగలేదు. ఏదో మహా విపత్తు సమీపిస్తోంది అన్నట్లుగా ఆయన మనస్సు అవేదనపడ్తోంది. ఎంత తంటాలుపడినా యీఆవేదన పోవడంలేదు. చౌకులోకి ప్రవేశించేసరికి అక్కడంతా యీదురుగాలీ, దుమ్ముదుమారంతప్ప ఏమీ లేదు.

తోటలోని సన్నరకం చెట్లు గాలికి ఊగుతూ చుట్టూ ఆవరణగా ఉన్న ఇనుపఖడ్డీలకు డీకొట్టుకుంటూ ఉన్నాయి. నడచినంతసేపూ అట్టర్సనుకంటే ఫూల్ ఒకటి రెండు అంగలు ముందువేసి నడుస్తూ ఉన్నాడు. రోడ్డు ప్రక్క చప్టామీద సగందూరం వచ్చేసరికి ఫూల్ కొంచెం ఆగి, ఆ యమ చలిగాలిలో కూడా తన తలమీది టోపీ తీసి, ఎర్ర రుమాలుతో ముఖం తుడుచుకున్నాడు. అంతవడిగా నడిచివచ్చినప్పటికీ, అతనికి పట్టిన చెమట మార్గాయాసంవల్ల కలిగినది కాదు. మనస్సులో ఉన్న ఒక ఆవేదనవల్ల కలిగిన చెమట అది. ఎందువల్లనంటే, అతనిముఖం చూస్తే తెల్లబోయినట్లుంది. కంఠస్వరం కూడా బొంగురుపోయినట్లుగా వోణుకుతూ ఉంది.

"బాబూ! మనం వచ్చి చేరుకున్నాం ఇక్కడికి. ఇక దేవునిదయవల్ల అరిష్టం ఏమీ లేకుండాపోవాలి." అన్నాడు ఫూల్.

"ఫూల్! తథాస్తు!" అన్నాడు లాయరు.

అనంతరం, ఫూల్ నెమ్మదిగా జాగ్రత్తగా తలుపు కొట్టినతోడనే, లోపలిగడియ తెరువబడింది. "ఫూల్! నీవేనా?" అని లోపలినుంచి ఒక కేక వినిపించింది.

"అవును. నేనే-తలుపు తెరు" అన్నాడు ఫూల్.

వారిద్దరూ హాలులోకి వెళ్లేసరికి లోపల దీపాలు బాగా వెల్గుతున్నాయి. నవుకర్లందరూ, మొగవాళ్లూ ఆడవాళ్లూ గొర్రెలమందలాగున నెగడువద్ద గుంపుగా

కట్టకట్టుకొని కూర్చున్నారు. అట్టర్సనుగారిని చూడగానే ఇంటికి పనికత్తె పసిబిడ్డ ఏడ్చినట్లుగా ఆవేశం వచ్చినట్లుగా కీచుకీచుమని రోదన ప్రారంభించింది. వంటవాడు “బతికిపోయినాముగా! దేవుడా! అదుగో అట్టర్సనుబాబు!” అని ఒక్క గంతు వేసి ఆయనను తన చేతులలో కౌగలించుకోవాలన్నట్లుగా ముందుకు పరుగెత్తాడు.

“అరే! అరే! మీరంతా యిక్కడే కట్టకట్టుకొని ఉన్నారేమిటి? ఏం బాగా లేదు. ఏమీ తీరుగా లేదు. మీ యజమాని ఇది చూస్తే ఏమీ సహించడు.” అని లాయరు కొంచెం చిరాకుపడ్తూ అన్నాడు.

“పిల్లందరూ గాబరా పడిపోతున్నారండీ” అన్నాడు పూల్.

ఆమాటతో అందరూ నిశ్శబ్దంగా ఉండిపోయినారు. ఎవ్వరూ నోరెత్తలేదు. పనికత్తెమాత్రము నోరుతెరచి బిగ్గరగా ఏడవడం ప్రారంభించింది.

“నోరుముయ్” అని ఆమెవంక పూల్ ఒక్క కేకవేశాడు. అతడే అసలు కంగారుపడిపోతున్నాడనే సంగతి అతని కేకలోనే కన్పిస్తోంది. ఆ పనికత్తె హాఠాత్తుగా ఏడ్వప్రారంభించినప్పుడు, మిగిలిన వాళ్లందరూ గుండెదడతో బిక్కమొగాలతో లోపలితలుపువైపుగా తిరిగి ఏదో ఎదురుచూస్తున్నారు. అప్పుడు బట్లరు పూల్ అక్కడ కూరలుతరిగే కుర్రవాడివంక చూచి “ఒరే అబ్బాయి! ఒక కొవ్వొత్తి దీపం ఇట్లా అంది

య్యరా! చేతినుంచి చేతికి అంచెలుగా దాటించి త్వరగా అందివ్వండి అది" అన్నాడు. అట్టర్సను వైపు చూచి, "నాతో మీరు రండి" అని, పెరటివైపు తోట ప్రదేశంలోనికి దారితీశాడు.

మరల ఫ్రూల్ యిలా అన్నాడు. "అయ్యా! యిప్పుడు మీరెంత మెల్లిగా చప్పుడు కాకుండా రండి. మీ గొంతు వినబడనివ్వకుండా, మీరు మాత్రం ఆలకిస్తూ ఉండండి. ఇటు చూడండి! ఏసందర్భంలోనైనా, ఆయన మిమ్ములను లోపలికి రమ్మంటే వెళ్లకండి."

హఠాత్తుగా, ముందుకు అడుగు వేయకుండా అక్కడ నిలిచిపోవడంతో అట్టర్సనుకు గుండెల్లో రాయి పడినట్లయింది. మనస్సు కూడా తడబడింది. కాని, తిరిగీ వెంటనే ధైర్యం తెచ్చుకొని బట్లరు వెంటబడి రస పరిశోధనా మందిరంగల భవనంలోకి వెళ్లి శస్త్ర మందిరంగుండా నడిచారు. అక్కడ చిందరవందరగా చెత్తగా పడిఉన్న ఖాళీబుడ్లు, ఖాళీపెట్టెలు దాటి, మెట్లవరుసవద్దకు వెళ్లారు. అక్కడనే ఒక ప్రక్కగా నిల్చొండి చెవియొగ్గి వినవలసినదని అట్టర్సనుకు ఫ్రూల్ సైగలు చేశాడు. కొవ్వొత్తిదీపాన్ని అక్కడ పెట్టి, తన మనస్సును కుదటపరచుకొని కచ్చేరీ గదితలుపుకు వ్రేలాడే పిడినిపట్టుకొని కొంచెం తడబడుతున్న చేతితో తలుపుకొట్టాడు.

"అయ్యా! అట్టర్సనుగారు మిమ్ముల‌ను చూడడానికి వచ్చారు" అని పూల్ బిగ్గరగా అన్నాడు. మరొకసారి అదేవిధంగా కేకవేసి, తలుపువద్ద చెవి పెట్టి వినవలసినదని లాయరుకు సైగచేశాడు.

లోపలినుంచి, ఒక కంఠస్వరం సణుగుతూ జవాబు చెప్పింది. "నే నెవ్వరికీ యిప్పుడు దర్శనం ఇవ్వను అని ఆయనతో చెప్పు."

"చిత్తం. అలాగే" అని పూల్ ఏదో ఘన కార్యం సాధించినట్లుగా అన్నాడు. కొవ్వొత్తిదీపం చేత బట్టుకొని, ఆ పెరటి ప్రదేశంగుండా వంటయింటి లోనికి అట్టర్సనుగారిని తన వెంట తీసికొనిపోయినాడు. అక్కడ పొయ్యిలో నిప్పు చల్లారిపోయి ఉంది. పేడ పురుగులు చిమ్మటలు నేలమీద గంతులు వేస్తున్నాయి.

"అయ్యా! ఆ కంఠస్వరం మా యజమానిదే అంటారా?" అని అట్టర్సను కళ్లలోకి తేరిపారజూచి పూల్ ప్రశ్నించాడు.

అతనిచూపులో తన చూపు నిల్పి లాయరు తెల్లబోయిన ముఖంతో యిలా అన్నాడు. "గొంతులో చాలా మార్పు వచ్చినట్లుంది."

"అది మార్పుఅంటారా? అవును. నాకూ అలాగే తోస్తోంది. ఈ యింట్లో నేను ఇరవైఏళ్లుగా ఉండి, ఆయన గొంతుకనే గుర్తు పట్టలేనంటారా? లేదు బాబూ! మా యజమాని హైర్వొలియా అయి

నాడు. ఎనిమిదిదినాల క్రిందట ఒకసారి ఆయన 'అయ్యో! దేవుడా!' అని కేకలు వేసినప్పుడే ఆయన ఏదో అయిపోయినాడు. ఆయన బదులు ఇప్పుడక్కడ ఉన్న దేమిటి? అది అక్కడ ఎందుకుంది? అదేనండీ అట్టర్సనుగారూ! అదే భగవంతునకు తెలియాలి" అని బట్లరు అన్నాడు. అది విని అట్టర్సను తన వేలు నోటితో కొరుకుతూ, "అయితే, పూల్! ఇదేదో విచిత్రంగా ఉంది. నీవు చెప్పేదంతా" చాలా విడ్డూరంగా ఉందోయి అన్నాడు. "నీవు ఊహించినట్లుగానే, జరిగిందనుకో–నీవు అనుకొన్నట్లుగానే డాక్టరు జెకిల్‌ను ఖూనీచేశారనుకో - చేయబడినది హత్య అయినట్లయితే, హంతకుడు ఇక్కడనే ఎందుకు మకాము చేస్తాడు? నీవు చెప్పేది ఏమీ అతకడం లేదు. సహజంగా కన్పించడం లేదు" అన్నాడు లాయరు.

"సరిలెండి—అట్టర్సన్ బాబూ! మీకు నచ్చజెప్పడం చాలా కష్టం. అయినా, మీకు బోధపరుస్తాను." అని పూల్ ప్రారంభించి యిలా అన్నాడు. "గడచిన వారం అంతా ఆ గదిలోఉన్న దది ఏమిటోగాని, ఏదో మందుకోసం రాత్రి పగలూ గోలపెట్టి అరుస్తూఉంది. ఆమందు ఏమిటో నాకు గుర్తురావడం లేదు. మా యజమానికి అప్పుడప్పుడు అలవాటు ఏమిటంటే, తన ఉత్తరువులను ఏవైనా మాకు అందజేయవలెనంటే, తెల్లకాగితాలమీద అవి వ్రాసి,

ఆ కాగితాలను మెట్లమీద పడవేస్తాడు. యీ వారంలో అవితప్ప ఏమీ జరుగలేదు. బంధించిన గదితలుపులూ, కాగితాలూ తప్ప ఏమీ కన్పించవు. ఆయనకోసం తెచ్చి బయటపెట్టిన భోజనం కూడా ఎవ్వరూ చూడనప్పుడు లోపలికి దొంగచాటుగా తీసికోవడం జరుగుతోంది. ప్రతిరోజూ—రోజూ ఏమిటి? రోజుకు రెండుసార్లు మూడుసార్లు కూడా ఉత్తర్వులు జారీ చేయడం, సాధించడం, సణగడం జరుగుతోంది. ఈ నగరంలో ఔషధాలమ్మే టోకు వర్తకులందరి వద్దకు నన్ను వాయువేగ మనోవేగాలతో పరుగెత్తించారు. షాపులోని మందుసరకును నేను ఎప్పుడు తీసికొనివచ్చినప్పటికీ, దానిని వాపసు చేసిరమ్మని నాకు మళ్ళీ ఉత్తర్వు చేస్తుంటారు. ఆసరకు శుద్ధంగా లేదనిన్నీ, మరొక షాపులోనిది తీసికొని రావలసినదనిన్నీ నాకు ఉత్తరువుజారీ చేస్తున్నారు. అది ఎందుకో ఏమిటోగాని, యీ మందు చాలా జరూరుగా ముఖ్యంగా కావాలంటున్నారు బాబూ!" అన్నాడు పూల్.

ఆ ఉత్తరాల కాగితాలు ఏమైనా ఉన్నాయా?" అని అట్టర్సను ప్రశ్నించాడు.

పూల్ తన జేబులో చెయ్యిపెట్టి నలిగిపోయిన కాగితం ఒకటి తీసియిచ్చాడు. కొవ్వొత్తి దీపంవద్ద నిలువబడి, వంగి, దానిని లాయరు శ్రద్ధగా చదివి చూచాడు. ఆ కాగితంలో యిలా వ్రాసివుంది: "మా అండ్ కంపెనీవారికి డాక్టరు జెకిల్ అభివందనములు.

మీరు యింతకు పూర్వం పంపిన నమూనా చాలా కల్తీగావుంది. ప్రస్తుతావసరానికి అది ఏమీ ఉపయోగపడదు. మా అండ్ కంపెనీవారివద్ద 18-సం॥లో కొంచెం భారీ ప్రమాణంగా డాక్టరు జెకిల్ కొంత సరకుకొని ఉన్నాడు. కనుక, అత్యంత శ్రద్ధతో అట్టి సరకుకై వెతుకవలసినదిగా డాక్టరు జెకిల్ కోరుచున్నాడు. అటువంటి ఆ పాతసరకు ఏమైనా మిగిలి ఉంటే వెంటనే పంపగోరుచున్నాడు. ఖరీదు సంగతి యోచించనేవద్దు. ఇది డాక్టరు జెకిల్‌కు ఎంత ముఖ్యావసరమో ఎంత వివరించినా అది అతిశయోక్తి కానేరదు." అంతవరకూ ఆ ఉత్తరము సవ్యంగానే ఉంది. కాని ఇక్కడకు వచ్చేసరికి ఆయన కలం కంపించినదన్నట్లుగా ఆయన ఆతురత ఆయన ఆవేదన హద్దు మీరిపోయింది. "మీకెంతయినా పుణ్యం ఉంటుంది. దేవుడా! ఆ పాతసరకు ఏమైనా ఉందేమో వెతికి చూడండి!" అని ఉంది.

"ఇది చాలా విపరీతమైన ఉత్తరంగా ఉంది. అయితే దీనిని నీవెట్లా తెరచిచూచావు?" అని అట్టర్సను చురుకుగా ప్రశ్నించాడు.

"మా అండ్ కంపెనీవారి షాపులోని మనిషి యిది చూచి, కోపంతో మండిపడి, అదేదో చెత్త కాగితం అన్నట్లుగా నామీద విసరికొట్టాడు" అని పూల్ జవాబు చెప్పాడు.

"ఇది నిస్సందేహంగా డాక్టరు జెకిల్ స్వద

స్తూరీ. ఆమాట తెలుసా?" అని లాయరు తిరిగి ప్రశ్నించాడు.

"అవును అది ఆయనది లాగున నేఉంది." అని బట్లరు జంకుతూ అన్నాడు. కాని, గొంతుక మార్చి, "దస్తూరీ ఎవరిదైతే ఏమండీ? అసలు మనిషినే నేను చూచాను."

"మనిషినే చూచావా? సరి." అని అట్టర్సను మళ్ళీ అన్నాడు.

"అట్లారండి దోవలోకి" అని పూల్ మాట అందుకొని ఆరంభించాడు. "అది ఎల్లా తటస్థపడిందంటే— పెరటితోట ప్రదేశంలోనుంచి పరిశోధనశాల లోకి నేను హఠాత్తుగా వచ్చాను. ఆ మందుకోసమో, మరెందుకోగాని వాడు బయటికి పొరబాటున వచ్చాడు. అతన్నీకచ్చేరీగది తలుపు తెరచిఉంది. గది చివర వాడు ఉన్నాడు. అక్కడ క్రిందపడిఉన్న ఖాళీబంగీపెట్టెలన్నీ సోదా చేస్తున్నాడు. నేను వచ్చేసరికి ఒకవిధమైన వెర్రికేక వేశాడు. వెంటనే తటాలున మెట్లెక్కి తన గదిలోకి వెళ్ళిపోయినాడు. వాడిని నేను చూచింది ఒక్కనిమిషం సేపుమాత్రమే. కాని, నాకు ఒళ్ళంతా గగుర్పొడిచింది. వాడే మా యజమాని అయితే ముఖంమీద ఆ మారువేషం ముసుగు ఎందుకు తగిలించుకుంటాడు చెప్పండి. వాడే మా యజమాని అయితే, ఎలుకలాగున కూతకూసి నన్ను చూచి ఎందుకు పారిపోతాడు? ఆయనదగ్గర నేను ఎంతో

కాలం నవుకరీ చేశాను—అటువంటప్పుడు..." అని ఆబట్లరు కొంచెం ఆగి, చేతితో తన ముఖం అంతా ఒకసారి తుడుచుకొన్నాడు.

ఆ మాటలకు అట్టర్సను యిలా అన్నాడు. "ఇవన్నీ చాలా విపరీత విషయాలుగా ఉన్నాయి. కాని, నాకు కొంచెం జ్ఞానోదయం కలుగుతోంది యీ విషయంలో. పూల్! స్పష్టంగా మీ యజమానికి మనోవికారమూ దేహవికారమూ కలిగించి బాధించెడి వ్యాధి ఏదో పట్టుకొని పీడిస్తోంది. అందువల్లనే అతని కంఠస్వరం ఆలాగున మారిపోయిందని నాకు తోస్తోంది. అందువల్లనే అతడు ముఖమునకు మారు వేషం ముసుగువేసికొని తన స్నేహితులకు కన్పించకుండా ఉంటున్నాడు. అందువల్లనే అత డేదో మందు కోసం తహతహ లాడుతున్నాడు. ఆ మందు మూలంగానైనా తిరిగి కోలుకొనగలనని అతనికొక ఆశ యింకా మిగిలిఉంది పాపం! అతని ఆశలు నిరాశలు కాకుండా దేవుడు రక్షించాలి గదా! ఇదే అసలు మూలకారణంగా నాకు తోస్తోంది. పూల్! ఇదంతా చాలా విచారకరమైన విషయమే. ఆలోచించినకొద్దీ ఆదుర్దా ఎక్కువవుతోంది. కాని, యిదే సరియైన సహజమైన సంగతిగా అన్ని సందర్భాలూ అతికినట్లుగా అర్థమౌతోంది. కాబట్టి మనకు లేనిపోని విపరీతపు కంగారు ఉండవలసిన నిమిత్తం లేదు."

బట్లరు ముఖం ఆ మాటలతో తెల్లబారి, యిలా

అన్నాడు "అయ్యా! అక్కడ తిరుగుతున్న దేమిటో గాని, మా యజమాని మాత్రం కాదు. ఉన్న విషయం అది." బట్లరు నలువైపుల కొంచెం పరికించి చూచి తిరిగి యిలా అన్నాడు. "మా యజమాని నుంచి ఆజాను బాహువు—పసందైన మనిషి—కాని యిప్పుడింట్లో ఉన్నది ఒక పొట్టి మఱుగుజ్జు విగ్రహం." ఆ మాటలకు అట్టర్సను ఏదో ఆక్షేపణ చెప్పబోయి నాడు - కాని పూల్ గొంతు పెద్దదిచేసి, యిలా అన్నాడు. "అయ్యా బాబో! అలాగయితే, ఇరవై ఏళ్ళుగా ఉంటున్న నాకు మా యజమానిసంగతే తెలియదంటారా? ఆ గది గుమ్మందగ్గర నిల్చుంటే ఆయనతల ఎక్కడికి వస్తుందో నాకు గుర్తు లేదంటారా! ప్రతిరోజూ ఉదయం ఆ గుమ్మందగ్గర ఆయనను నేను నాజీవితం అంతా చూస్తూఉన్నవాడినండీ బాబూ! ఇప్పుడక్కడ తిరుగుతున్న ఘటం ముమ్మాటికీ డాక్టరు జెకిల్ కాదు అది ఏమిటోమాత్రము నేను చెప్పలేను. అది డాక్టరు జెకిల్ ఎన్నటికీ కాదు. ఏదో ఖూనీ జరిగిందని నామనస్సు నాకు చెప్తోంది."

"పూల్! నీవు ఆమాట అనేటట్లయితే, దాని నిజం తేల్చవలసిన బాధ్యత నాదే అవుతుంది. మీయజమాని మనస్సును నొప్పించకూడదనే కోరిక నాకు ఎంత ఉన్నప్పటికీ, ఆయన యింకా సజీవుడై ఉన్నాడని ఋజువుచేస్తున్న యీ ఉత్తరము నన్నెంత తిక

మకపెట్టుతున్నప్పటికీ, యీ తలుపుబ్రద్దలుకొట్టి తెర వడం అవశ్యకర్తవ్యమని నాకు తోస్తోంది" అని లాయరు అన్నాడు.

"అట్టర్సనుబాబూ! అదీ! మాటంటే మాట!" అన్నాడు బట్లరు.

"అయితే, ఇక రెండో సమస్య వస్తోంది. ఆపని ఎవరు చేయడం?" అన్నాడు అట్టర్సను.

"ఏం ? మీరూ నేనూ చేద్దాముండీ!" అని వెంటనే బదులు చెప్పాడు.

"నువ్వు చెప్పింది బాగానే ఉంది. కానియ్యి. అందువల్ల ఏ ముప్పొచ్చినా, నీకు ఏ కష్టనష్టమూ రాకుండా చూచేవాణ్ణి నేను"అని లాయరు సమాధాన మిచ్చాడు.

అందుమీదట పూల్ యిలా అన్నాడు. "పరి శోధనశాలలో ఒక గొడ్డలి ఉంది - వంటయింట్లో నిప్పులు త్రోసే పెద్ద ఇనుపఖడ్డీ ఉంది. అది మీరు పుచ్చుకోండి."

లాయరు ఆ బరువైన యినపఖడ్డీని సమ తూకంగా మధ్యలో పట్టుకొని చేతితో ఆడించి చూచుకొని యిలా అన్నాడు. "పూల్ ! నీవూ నేనూ కూడా అపాయకరమైన అఘాయిత్యపు పని చేయ బోతున్నాం తెలుసునా ?"

"అయితేనేం ? అలాగే కానివ్వండి" అన్నాడు బట్లరు.

"అయితే, ఇక మనం ఉన్నదున్నట్లుగా వివరించుకోవాలి-మనమిద్దరం చెప్పగల్గినదానికం టెఊహించుకోగల్గినది ఎక్కువగా ఉంది. మనలో మనం మర్మం విడిచిమాట్లాడుకొందాం - మారు వేషపు ముఖంతోడుగు ధరించిన ఆకారరూపాన్ని నీవు చూచావుగదా. బాగా గుర్తించావా?" అని లాయరు అడిగాడు.

"అవును బాబూ! ఆవ్యక్తి అతిత్వరంగా వెళ్లిపోయింది. పారిపోవడంలో ముందుకు బాగావంగి శరీరం నగానికి మడతపెట్టినట్లుయుంది. అందువల్ల నేను బాగా గుర్తించానని ప్రమాణంచేసి చెప్పలేను" అని, బట్లరు యింకా యిలా అన్నాడు "అతడు హైడ్ అయియుంటాడా అనియేనా మీరడిగేది? ఎందుకు ఇంకా అనుమానం? వాశేనండి. వీడూ అదే మెత్తు ఉంటాడు. అదేమాదిరిగా చకచకా నడుస్తాడు. అది అట్లా ఉండగా యీ శోధనశాలగుమ్మంగుండా లోపలికి ప్రవేశించే వాళ్లింకెవరున్నారు? గడచిన ఖూనీజరిగినప్పటినుంచీ తాళంచెవి యింకా అతనివద్దనే ఉంది. ఆ సంగతి మీకు జ్ఞాపకముందా? అంతేకాదు. ఈహైడ్ అనే అతనిని మీరెప్పుడైనా కలిసికొన్నారేమో నాకు తెలియదండీ అట్టర్సన్‌గారూ!" అని బట్లరు ముగించాడు.

"అవునోయ్. అతనితో కలిసికొని నే నొకసారి మాట్లాడి ఉన్నాను కూడా" అని లాయరు అన్నాడు.

"అయితే, ఆ మనిషిలో చాలా వికృతాకారం ఉన్నదనే సంగతి మాతోబాటు మీరుకూడా గమనించి ఉంటారు. మనిషికొక వింత తత్వం ఏర్పడినట్లుగా ఉంటుంది. అదేమిటోగాని ఇంతకంటె ఎక్కువ వివరంగా ఎట్లా చెప్పవలెనో నాకు తెలియదు. అతణ్ని చూస్తే ఒంట్లో నరాలన్నీ కంపించిపోతాయి. శల్యాలు కదలి నట్లుగా ఒళ్లు జలదరిస్తుంది. అవునా కాదా?" అన్నాడు బట్లర్.

"నీవు వర్ణించిన విధంగానే నాకూ అనుభవం అయింది" అన్నాడు అట్టర్సను

"అవును బాబూ! ఆ మాయమనుసుగు దేహధారి కోతిలాగున ఒక్కసారిగా అక్కడి ఔషధ ద్రవ్యాల మధ్యనుంచి దుముకుతూ గదిలోకి ఉడాయించే సరికి నా వెన్నుపాము అంతా జలజలమంది అంటే నమ్మండి. అబ్బో! ఇదంతా నా సాక్ష్యంగా జమకట్టకండి మరి! నేనుకూడా గ్రంధాలూ పాయింట్లూ తెలిసినవాడినేనండోయ్! మనిషిఅయినవాడికి ఊహలనేవి కొన్ని ఉంటాయి. కనుక, ఆ విగ్రహం హైడ్ అనేమాట వేదవాక్యంగా మీకు మనవిచేస్తున్నాను" అన్నాడు పూల్.

"సరి-సరి-నా అనుమానాలుకూడా అటువైపుకే మొగ్గుతున్నాయి. ఏదో పాపం పండింది. దుర్మార్గం ఫలితమే దురాగతం—ఆ లంకెమూలంగానే వచ్చింది ఇదంతా—అవునోయ్! నిజంగానే. నీమాటలలో నాకు

నమ్మకం కుదిరింది. పాపం! హెన్రీ ఖూనీ అయినాడు. ఆ మాటలో నాకు నమ్మకమే. ఖూనీ చేసినవాడు తాను ఏగదిలో హత్య చేశాడో ఆగదిలోనే ఇంకా మసలుతూ ఉన్నాడు. (ఇంకా అక్కడే ఎందుకున్నాడో దేవునికే తెలియాలి) సరే—కానియ్యి—కసి తీర్చుకోవడానికే మనం పుట్టినామనుకో. పిలు! బ్రాడ్లాను పిలు!" అన్నాడు లాయరు.

పిలువగానే వెలవెలబోతున్న ముఖంతో నలుగురూ నౌకరు నడుగెత్తుకొని వచ్చాడు.

"బ్రాడ్లా! హుషారుగా ఉండాలి నీవు! ఇంతవరకూ ఉన్న ఆందోళన మాకందరికీ పెద్ద వేదనగా ఉంటోంది. నాకు తెలుసు. కాని, యిక దీనిఅంతు కనుక్కోవాలని నిశ్చయించాం—ఇదుగో ఫ్రూల్—అతనూ నేనూ ఆ కచ్చేరీగదిలోకి ఛేదించుకొని పోదలచియున్నాము. పనిఅంతా నిర్విఘ్నంగా నెరవేరితే, ఎన్నినిందలైనా నా బుజాలమీద నేను భరిస్తాను. ఈలోపుగా ఏవిధమైన పొరబాటూ జరుగకుండుటకున్నూ, ఏ దురాత్మగుడూ దొంగత్రోవలగుండా తప్పించుకొని పోకుండుటకున్నూ నీవూ, ఆ కుర్రవాడూ, రెండు దుడ్డుకర్రలను చేతబట్టి అటు వంపుతిరిగి వెళ్ళి శోధనశాల గుమ్మంలో నిలబడండి. మీరు అక్కడికి చేరడానికి పదినిమిషాలు టైము యిస్తున్నాం" అని లాయరు అన్నాడు.

బ్రిడ్జి అక్కడినుంచి కదలి వెళ్ళగానే లాయరు తన గడియారం చూస్తూ నిలబడ్డాడు. ఫూల్ వైపు తిరిగి, "ఫూల్! ఇక మనపని మనం చూసుకుందాం" అన్నాడు లాయరు. ఇనుపకోల తన చంకలో పెట్టి పెరటి ఆవరణలోకి ఆయన త్రోవతీశాడు. కరుగెత్తుతున్న మేఘాలు చంద్రుణ్ని కప్పివేశాయి. అంతా చీకటిగా వుంది. బయటి యీదురుగాలి ఆ మహాభవనాంతర భాగంలోనికి వుండివుండి విసురుతోంది. కొవ్వొత్తి దీపకళికలు అటు యిటు ఉయ్యాల లూగుతున్నాయి. యీలోగా ఆ పెద్దశాలలోకి వారు వచ్చి చేరుకున్నారు. సమయానికి వేచినట్లుగా అక్కడ నిశ్శబ్దంగా రవ్వంత సేపు కూర్చున్నారు. లండను నగరధ్వని ఆ రాత్రివేళ ఝుంకారనాదం లాగున వినిపిస్తోంది. కాని యింకా వారి సమీపంలో ఉన్న గదిలో నేలమీద మధ్యమధ్య కాలిచప్పుడు అవుతున్నట్లు వినిపిస్తూనే ఉంది.

"ఇదేవిధంగా రోజంతా అది గదిలో సంచరిస్తూనే ఉంటుందండీ! రాత్రి బాగా ప్రొద్దుపోయిన తర్వాతకూడా నండీ! మందుల షాపులనుంచి ఏదైనా క్రొత్త నమోనా సరకు వచ్చినప్పుడు మాత్రం కొంచెం విరామం ఉంటుంది. మనస్సుకు విశ్రాంతి అంటూనే గిట్టనటువంటి ఘటం అది ఎటువంటిదోగాని, చాలా పాపిష్టి ఘటం అయి ఉండాలి. వేసేడ్ప్రతి అడుగుకూ, పచ్చిరక్తం త్రాగిన పాతకానికై చిందులు త్రొక్కు-

తోంది ఆ పాపిష్టి ఘటం అనుకోండి. ఇదిగో యిట్లా దగ్గరగావచ్చి కాస్త వినండి. గుండెల్లో చెవులు పెట్టుకొని వినండి బాబూ! అవి డాక్టరు గారి అడుగులనే అంటారా? చెప్పండి"అని ఫూల్ గుసగుసలాడుతూ చెప్పాడు. అడుగులు విశృంఖలంగా బహు తేలికగా పడుతున్నాయి. ఆ నడకలో కొంత ఊగిసలాటకూడా ఉంది. అడుగులు నెమ్మదిగా పడుతున్నాయి హెన్రీజెకిల్ నడుస్తూ ఉంటే ఇట్లా ఉండేదికాదు. అడుగులు ధాటీగా వేసి, కిర్రుమంటూ నడచేవాడు." అట్టర్సను ఒక్కనిట్టూర్పు విడిచాడు. "ఆక్కడ ఇంతకు తప్పితే మరేగీ ఎప్పుడూ గోచరించలేదా?" అని ప్రశ్నించాడు.

ఫూల్ తలఊపి "ఒకపర్యాయము ఆ గదిలో అది ఏడుస్తూ ఉంటే విన్నాను" అన్నాడు.

"ఏడవడమా? ఎట్లాగయ్యా అది?" అని లాయరుకు హఠాత్తుగా ఒళ్లు జల్లుమని అన్నాడు.

"ఆడదానిలాగున, గుండెపగిలిన మనిషిలాగున ఏడవడం సాగించింది. అది వింటే గుండె గభీలుమన్నది. నాకుకూడా ఏడ్పువచ్చింది." అని బట్లరు అన్నాడు.

ఇంతలో పదినిమిషములగడువు పూర్తిఅయింది. బంగీలలో కుక్కేటటువంటి చెత్త గడ్డి కుప్పలోనుంచి గొడ్డలిని ఫూల్ పైకి తీశాడు. వారిద్దరూ ఇక దండయాత్ర సాగించడానికి వీలుగా కొవ్వొత్తి దీపమును

సమీపంలో ఉన్న బల్లమీద ఉంచారు. ఆ గదిలో ఆ ప్రశాంతనిశీథసమయమున అటూఇటూ ఆమనిషి ఇంకా చరలాడుతూనే ఉన్నాడు. ఈ అడుగులు పడు తున్నచోటికి వారిద్దరూ ఊపిరి బిగబట్టుకొని మెల్లిగా సమీపించారు.

అప్పుడు అట్టర్సన్ కొంచెం బిగ్గరగా, "జెకిల్! నేను నిన్ను చూడాలని వచ్చాను" అన్నాడు. కొంచెం సేపు ఆగి చూశాడు. కాని జవాబు ఏమీ రాలేదు. అప్పుడు తిరిగి ఇలా అన్నాడు. "మాకు అనుమానాలు అంతకంతకు నిన్నుగూర్చి ఎక్కువవు తున్నాయి - నిన్ను ముందుగానే హెచ్చరించి నీకు తెలియచేస్తూఉన్నాను. నేను నిన్ను చూడక తప్పదు. చూచితీరుతాను. సవ్యంగా నీవు చూడనివ్వకపోతే, దౌర్జన్యంగా చూస్తాను. నీ సమ్మతితో సందర్శనం లభించకపోతే, జబర్దస్తీగా సందర్శిస్తాం."

"అట్టర్సన్! భగవంతునిసాక్షిగా వేడుకుంటు న్నాను. నామీద కరుణించు" అని ఒక కంఠస్వరం లోపలినుంచి పలికింది.

"ఆ! అది జెకిల్ గొంతుక కాదు. అది హైడ్ కంఠస్వరం! చూస్తావేం! పూల్! కొట్టు! పగుల గొట్టు ఆతలుపు!" అని అరిచాడు అట్టర్సన్.

పూల్ బుజంమీద ఉన్న గొడ్డలిని ఒక్క విసురు విసిరాడు. ఆదెబ్బకు భవనంఅంతా దద్దరిల్లిపోయింది. ఎర్రని పిడిగల్గిన ఆ తలుపుకు ఒక్క దెబ్బతో

తాళం పగిలి బందులుకదలి అది వెనుకకు ఒరిగింది. కొన్ని జంతువులు గీపెట్టినట్లుగా భయంకరమైన కీచు కూతలతో ఆగదిఅంతా మారుమ్రోగింది. మరొక్క సారి గొడ్డలి పైకి లేచి ఇంకో దెబ్బ పడింది. ఈసారి తలుపుయొక్క మడత రెక్కల బల్లలు తునకలై పోయి నాయి. ద్వారబంధంచట్టం కదలిపోయింది. గొడ్డలితో నాలుగుసార్లు నాలుగు దెబ్బలు పడ్డాయి. ఆ ద్వార బంధం తలుపులు దిట్టమైన గట్టికర్రతో చేయబడినవై, దానిబిగింపులూ బందులూ చాలా బందోబస్తుగా ఉండడంచేత అయిదోసారి గొడ్డలిదెబ్బ తగిలిన తర్వాతనే ఆ తలుపుల లోపలి తాళం బద్దలై, విరిగిన తలుపు ముక్కలన్నీ లోపలి గదిలోని తివాసీమీదనే విరుచుకొని పడ్డాయి.

ఆ రాత్రివేళ అంత నిశ్శబ్దంగా ఉండే సమయంలో, యీగదిని ముట్టడించినవాళ్ళు తాము చేసిన హంగామాకు తామే కంగారైనారు. కొంచెం వెనుకకు తగ్గి లోపలికి తొంగిచూచారు. నిశ్చలంగా వెలుగుతున్న లాంతరు వెల్తురులో వారి కళ్ళముందు ఆకచ్చేరీ గది శాంతంగా కన్పించింది. చక్కని నెగడులో నిప్పులు ప్రజ్వలిస్తున్నాయి. వేడినీళ్ళ గిన్నె కళకళ మంటూ రాగం తీస్తోంది. మేజా బల్లలోని ఒకటి రెండు సొరుగులు పైకి లాగి తెరువబడిఉన్నాయి. కచ్చేరీబల్లమీద కాగితాలు తీర్చిదిద్దినట్లుగా ఉన్నాయి. నెగడు ప్రక్కను బల్లమీద తేనీరు త్రాగు

టకు కావలసినవన్నీ అమర్చబడిఉన్నాయి. అంత ప్రశాంత నిశాంత మింకొకటి లేదనిపిస్తుంది. ఆగదిలోని పింగాణీకల్వములనిండా ఔ ష ధ ద్ర వ్య ము లు ఉన్నాయి. అంతకు తప్పితే, లండను నగరంలో ఇటువంటి గది సర్వసాధారణమైనదనియే చెప్పవచ్చును.

ఆగది నట్టనడుమ విపరీతంగా మెలికలు తిరిగి చేతులూ కాళ్లూ ఇంకా కొట్టుకుంటూఉన్నటువంటి మనిషి పడియున్నాడు. మునివ్రేళ్ల మీాద నడుస్తూ మెల్లిగా వారిద్దరూ ఆ వ్యక్తిని సమీపించారు. ఎడ్వర్డు హైడ్ ముఖమే అదియని స్పష్టంగా గుర్తించారు. డక్టరు జెకిల్ గారికి సరిపోయే పెద్దసైజు దుస్తులలో ఉన్నాడు. అది అంతా సైజుకి మించిన చాలా పెద్దసైజు డ్రెస్సు. ఇంకా ప్రాణమున్నట్లుగా నే ముఖంలోని నరాల కదలిక కన్పిస్తోంది. కాని, అదివరకే ప్రాణం ఉత్క్రమణం అయింది. పగులగొట్టిన చిన్నమందుబుడ్డి అతని చేతిలో ఉంది. కొన్ని గింజలయొక్క పచ్చివాసన ఆ గదిలో గుబాళిస్తోంది. పీటినిబట్టి, అక్కడ పడియున్న దేహం ఆత్మహత్య చేసికొన్నవాని దేహమే అని అట్టర్సను గ్రహించాడు.

"రక్షించడానికిగాని, శిక్షించడానికిగాని, అంతా మించిపోయినతర్వాత మనము వేంచేశాము—హైడ్ అతనిలోకానికి అతను వెళ్ళిపోయినాడు. ఇక, మీా యజమాని దేహం ఎక్కడయున్నదో చూడవలసిఉంది" అని అట్టర్సను ధాటీగా మాట్లాడుతూ అన్నాడు.

ఆభవనంలో అత్యధికభాగమును పరిశోధనశాల ఆక్రమించింది. క్రింది అంతస్తును అంతా ఇంచు మించుగా యీశాల ఆక్రమిస్తోంది. దీనికి వెల్తురు పైనుంచిన్నీ కచ్చేరీగదినుంచిన్నీ వస్తుంది. యీభవనానికి ఒకకొన యీవత్తూ ఇదే - ఇది ప్రత్యేకంగా ఒక అంతస్తుగా ఉంటుంది ఈ పరిశోధనశాల నుంచి బయటనున్న సందుకు ప్రత్యేకంగా త్రోవ ఉంది. కాని కచ్చేరీగదినుంచి మరొక మెట్ల వరుస త్రోవకూడా యీ పరిశోధనశాలలోకి ఉంది. ఆ భవనంలో ఇవిగాక కొన్ని చీకటి గదులున్నూ, విశాలమైన నేల మాళిగయున్నూ ఉన్నాయి. వీని నన్నిటినీ వారిద్దరూ పూర్తిగా పరిశీలించారు. ఒక్కొక్క గదిని లోపలికి తొంగిచూస్తేచాలు, సోదా చేసినట్లే- ఎందు వల్లనంటే, ఆ చిన్నగదులన్నీ ఖాళీగానే ఉన్నాయి. వాటి తలుపులుకూడా యీమధ్యకాలంలో ఎప్పుడూ ఎవ్వరూ తెరచి యుండలేదు. నేలగదిలో ఏవేవో చిల్లర సామానులన్నీ పడిఉన్నాయి.

డాక్టరు జెకిల్‌కు యీ భవనమును అమ్మినటువంటిపూర్వపు శస్త్రవైద్యుని కాలంనుంచీ ఆ నేలగదిలో పడియుంటున్న సామానులే చాలా ఉన్నాయి అక్కడ- తలుపు తెరచి చూచారుగాని, ఆ గదిని సోదా చూడడంవల్ల ఏమీ ప్రయోజనం లేదని సూచించి నట్లుగా ఆ తలుపు గుమ్మం మీదనుంచి ఒక పెద్ద దట్టమైన సాలిగూడు చదరబకటి తలుపు తెరువ

గానే దభీలుమని క్రింద పడింది. ఇంకెక్కడ చూచినా, డాక్టరు హెన్రీ జెకిల్ సజీవుడుగాగాని నిర్జీవుడుగాగాని యున్నట్లు వారికి ఆచూకీ చిక్కలేదు.

ఆ భవనం మధ్యనున్న నడవలో చప్టామీది చలువరాళ్ళమీద పూల్ ఒక్క తన్నుతన్ని ఆ శబ్దాన్ని తానే ఆలకిస్తూ, "ఆయన యిక్కడ పాతి పెట్టబడి ఉంటాడు" అన్నాడు.

"లేదా, ఆయన పారిపోయి ఉండవచ్చు" అని అట్టర్సను అన్నాడు. ప్రక్కసందులోని గుమ్మమును తనిఖీ చేయడం ప్రారంభించాడు. అది తాళం వేయ బడి ఉంది. అక్కడే క్రింది చప్టారాళ్ళమీద త్రుప్పు పట్టిన తాళంచెవి పడిఉంది.

"ఇది వాడుకలో ఉన్న తాళంచెవిలాగున లేదు" అని లాయరు అన్నాడు.

"వాడడం ఏమిటి? మీకు కన్పించడం లేదా అండీ? అది విరిగిఉంది. ఎవడో మనిషి దానిని త్రొక్కి విరుగగొట్టినట్లుంది" అన్నాడు పూల్.

"అవునోయ్! విరిగినముక్కలు కూడా త్రుప్పు పట్టిఉన్నాయి" అన్నాడు అట్టర్సన్. వాళ్ళిద్దరూ ఒకరి ముఖం యింకొకరు బెదరిబెదరి చూచుకొన్నారు. "ఇదంతా ఏమిటో నాకు అంతుచిక్కడం లేదు పూల్! తిరిగి కచ్చేరీగదిలోకి పోదాంపద" అన్నాడు లాయరు.

వారిద్దరూ మెట్లు మెల్లిగా ఎక్కి, అక్కడ పడి యున్న శవాన్ని మధ్యమధ్య గాబరాపడి చూస్తూ, కచ్చేరీ గదిలోని సామానులను శ్రద్ధగా తనిఖీ చేయడం సాగించారు. ఒక బల్లమీద, రసాయనద్రవ్య ఔషధములున్నాయి. గాజు పళ్ళెములలో తెల్లని తుషారం కన్పించింది. ఏదో ఔషధ పరిశోధన చేయాలనుకొని యీ దురదృష్టశాలి ఆ పరిశోధన చేయలేక విరమించి నట్లుగా కన్పించింది.

"ఆయనకు యీ ఔషధమునే ఎప్పుడూ నేను తెచ్చిపెడ్తూ ఉండేవాణ్ని" అన్నాడు పూల్. అతను మాట్లాడుతూఉంటే, వేడినీళ్ళ గిన్నెలో నీళ్లు కళపెళ నుంటూ కాగుతున్నాయి.

వారిప్పుడు నెగడువద్దకు వచ్చారు. అక్కడ పడకకుర్చీ ఒకటి వేయబడిఉంది. కుర్చీలో కూర్చున్న వానికి అందు బాటుగా తేసీరు వగైరా బల్ల మీద అమర్చబడి ఉన్నాయి. కప్పులో చక్కెరతో సహా సిద్ధంగా ఉన్నాయి. పుస్తకాల అరమీద చాలా గ్రంథాలున్నాయి. తేనీటిబల్ల ప్రక్కనే ఒక గ్రంథం తెరువబడిఉంది. అది ఒక భక్తిరస గ్రంథము. ఆగ్రంథం అంటే జెకిల్‌కు చాలా ప్రీతి. ఆ పుస్తకము మొడల తనకున్న గౌరవతాత్పర్యములను అనేక పర్యాయములు జెకిల్ వెల్లడిస్తూ వచ్చాడు. ఆగ్రంథంలో అక్కడక్కడ అనేక అంశములకు తన దస్తూరీలోనే అర్థవివరణములను కొన్ని వ్రాసికొన్నాడు.

ఈ అర్థవివరణములన్నీ కేవలం భగవద్దూషణలతో నిండి ఉన్నాయి.

వారిద్దరూ సోదా చేస్తూ నిలువుటద్దంవద్దకు వచ్చారు. ఆ యమఅద్దం చూస్తే వారికే భయం వేసింది. అద్దం కొంచెం ఏటవాలుగా త్రిప్పబడి యుండుటవల్ల, ఇంటి పైకప్పుమీద గులాబీ కాంతి యున్నా, నున్నని పింగాణి కల్యములపై ప్రతిబింబిస్తున్న నెగడుమంటల జహూశతప్రతిబింబములున్నా, భయకంపితములై తెల్లబారిన వారిద్దరి ముఖములున్నా ఆ నిలువుటద్దములో కన్పించాయి

"ఈ నిలువుటద్దం అనేక విపరీత రూపములను దర్శించిందండీ!" అని పూల్ గుసగుసగా అన్నాడు.

లాయరుకూడా గుసగుసలాడుతూనే యిలా బదులు చెప్పాడు. "ఈ అద్దంకంటె విపరీతవస్తువు ఇంకొకటి ఉండబోదు" అన్నాడు. "అయితే దీనితో జెకిల్ కు పనేముంది?" అన్నాడు. "జెకిల్" అనే పేరు ఉచ్చరించగానే, మనిషికి నోరు తడబడినట్లయింది. వెంటనే తనకు తానే దబాయించుకొని, "దీనితో జెకిల్ కు ఏమిటి పని?" అన్నాడు.

"అల్లా అడగండి!" అన్నాడు పూల్.

అటుపిమ్మట వారు కచ్చేరి మేజాబల్ల వైపు తిరిగి చూచారు. ఆ బల్లమీద చాలా కాగితాలు చక్కగా సర్దబడిఉన్నాయి. వాని అన్నింటిలోనూ ఒక పెద్దకవరు పైకి బాగా కన్పిస్తోంది. డాక్టరు జెకిల్ గారి స్వదస్తూరీ

తో అట్టర్సను పేరు దానిమీద వ్రాయబడి ఉంది. ఆ కవరుమీది సీలును లాయరు ఊడగొట్టి కవరును తెరచి చూచేసరికి, దానిలోనుంచి మరికొన్ని కవర్లు క్రింద పడ్డాయి. మొదటిది ఒక వీలునామా—ఆరు మాసాల క్రిందట లాయరు వాపసు చేసియుండిన వీలు నామాలోని వ్రిపరీపు పరతులధోరణిలోనే ఈవీలు నామాకూడా వ్రాయబడి ఉంది. వీలునామా వ్రాసిన ఆసామీ మరణించినపక్షములో అమలు జరుగవల సిన కోరికలను ఆకాగితము తెలియజేస్తోంది. వీలు నామా వ్రాసిన ఆసామీ అంతర్ధానమైన సందర్భ ములో ఆయన ఆస్తిని దఖలు పరచుటకుగాను వ్రాయబడిన దానపత్రముగా అది ఉద్దేశింపబడింది. కాని, యీకొత్త వీలునామాలో "ఎడ్వర్డు హైడ్" అనే పేరుకు బదులుగా "గేబ్రియల్ జాన్ అట్టర్సన్" అనే పేరు ఉంది. అదిచూచి అట్టర్సను అనిర్వచనీయాశ్చ ర్యభరితుడైనాడు. అట్టర్సను ఒకసారి ఫ్రూల్ వంక తిరిగిచూచాడు. తిరిగీ ఆకాగితాలవంక చూచాడు. చివరి కొక్కసారి క్రింది తివాసీమీద పడియున్న ఆదుష్టునివంక చూచాడు.

"నాకు ఏమిటో అయోమయంగా ఉంది. వీని వశంలోనే యిన్నినాళ్లనుంచి ఈ వీలునామా ఉంది. వీడికి నేనంటే అభిమానం కలుగడానికి అవకాశమే లేదు. తనస్థానే యింకొకడు ఈఆస్తికి కర్తగా వస్తాడంటే మండిపడే మనిషి - అటువంటి సందర్భాలలో వీడు

యీ వీలునామాను నాశనం చేయనే లేదు" అన్నాడు అట్టర్సను.

అటుపిమ్మట తర్వాతి కాగితం లాయరు తీసికొన్నాడు. దానిమీద తేదీ ఉంది. డాక్టరు జెకిల్ స్వదస్తూరిలో వ్రాసిన చిన్న ఉత్తరం అది. ఆ కాగితం చూచి అట్టర్సను ఒక్క కేక వేశాడు. "ఇదిగో నోయ్ ఫూల్! ఆయన యీరోజున ఇక్కడే సజీవంగా ఉన్నాడు. ఇంతలోనే, యీ రవ్వంత వ్యవధిలోనే, ఆయనను (డాక్టరు జెకిల్‌ను) తుదముట్టించడానికి వీలు లేదు. ఆయన యింకా సజీవుడై ఉండాలి—ఎక్కడికో పారిపోయిఉంటాడు. అయితే, ఎందుకు పారిపోయిఉంటాడు? ఎట్లా పారిపోయినాడు? అట్టి సందర్భంలో యిది ఆత్మహత్య అని మనము నిర్ధారణ చేయగలమా? ఆ! మనం జాగ్రత్తగా ఉండాలి. మీ యజమాని ఇంకా ఏదో దారుణమైన ప్రమాదం పాలయ్యేటట్లు చేయడానికి మనం కారణం కావచ్చు" అని అట్టర్సను బిగ్గరగా అన్నాడు.

"అది మీరు చదువరేమండీ!" అని పూల్ ప్రశ్నించాడు.

లాయరు యిలా అన్నాడు "ఎందుకంటే, నాకు కంగారుగా ఉంది. దేవుడే కటాక్షించాలి!" అనంతరం లాయరు ఆ కాగితాన్ని తన కంటికెదురుగా పెట్టుకొని యిలా చదివాడు:—

"నా ప్రేమపాత్రుడవైన అట్టర్సన్! ఈ కాగితం

నీ చేతిలో పడినప్పుడు నేను అంతర్ధానమైనట్లే - ఏపరి స్థితిలో అది జరుగునో నేనూహించి చెప్పలేను. కాని నాకు అంత్యదశ తప్పదనిన్నీ, త్వరలోనే రాగల దనిన్నీ, నా సహజాంతశ్శక్తి ఏదో నాకు సూచిస్తోంది. అనిర్వచనీయమైన నా ప్రస్తుత పరిస్థితికూడా అదే ప్రకారం సూచిస్తోంది. కనుక ఏడు న్నరం అయితే, నకు వ్రాసి నీకరంచేస్తానని డాక్టరు లాన్యను నాకు హామ్మీక చేసి మండలించినాడో, ఆ ఉత్తరాన్ని నీవు త్వరగా వెళ్ళి చదువుకో - ఆవిషయంలో యింకా ఏమైనా ఎక్కువ వివరాలు నీవు తెలుసుకోవలెనంటే, తన స్వయంకృతాపరాధం నివేదిస్తూ నీవు చదువుకో వలెనని కోరుతూ, నీకొక కాగితం వ్రాశాడు

నిఅయోగ్య అభాగ్యమిత్రుడు "హెన్రీ జెకిల్"

"ఇంకా మూడోకవరు కూడా ఉందీ?" అని అట్టర్సను ప్రశ్నించాడు.

"ఇదిగో బాబూ!" అని పూల్ ఒక పెద్దకవరు కట్టను లాయరుచేతి కందిచ్చాడు. ఆ కట్టమీద చాలా చోట్ల సీల్లు ఉన్నాయి.

దాన్ని లాయరు తన జేబులో పెట్టుకున్నాడు. "మీయజమాని పరారైనా, పరలోకగతుడైనా ఆయన పరపతి చెడకుండా కాపాడడానికైనా వీలుండ గలదుగనుక, యీ కాగితం పేరు నేను ఎత్తను. ఇప్పుడు పదిగంటలైంది. నేను యింటికి వెళ్ళి యీ కాగితాలను ప్రశాంతంగా చదువుకోవాలి. కాని, నడిరాత్రి కాక

పూర్వమే నేను తిరిగీ వస్తాను. అప్పుడు మనము పోలీసులకు కబురుచేద్దాం” అన్నాడు అట్టర్సను.

ఆ శోధన శాల తలుపుకు తాళం వేసి వారిరువురూ వెళ్ళిపోయినారు. ఇంటి నవుకర్లందరూ హాలులో నెగడువద్ద గుమికూడి యథాప్రకారంగా కూర్చున్నారు. ఈ మాయవ్యవహార గూఢమర్మం అంతా వివరించెడి రెండు కాగితాలలోని నిజకథాని వేదికలను చదువుటకై అట్టర్సను తిరిగీ తన ఆఫీసుకు నడక సాగించాడు.

## 9. డాక్టరు లాన్యను వివరించిన కథ

జనవరి తొమ్మిదవ తేదీని, అనగా నేటికి నాలుగు రోజుల క్రిందట, సాయంకాలపు తపాలా బట్వాడాలో నాకొక రిజిస్టర్డు కవరు వచ్చింది. దానిమీాది చిరునామా నా చిరకాలసహాధ్యాయియు సహచరుడునైన హెన్రీ జెకిల్ దస్తూరీలో ఉంది. అది చూడగానే నాకు చాలా ఆశ్చర్యమైంది. ఎందువల్లనంటే మా ఉభయులకూ ఉత్తర ప్రత్యుత్తరాల అలవాటు ఎన్నడూ లేదు. అంతకు క్రిందటిరాత్రియే నేను అతనిని చూచాను. అతనితో కలిసి భోజనం చేశానుకూడా—కనుక రిజిస్టర్డుపోస్టుద్వారా నా వ్యవహారరీత్యా నాకు యిప్పుడు ఏవిషయమై యీకవరు ఉత్తరం వచ్చియున్నదో నిన్నటి మా సమావేశసంభాషణలను బట్టి ఊహించలేకపోయిన్నాను. ఆ ఉత్తరంలోని విష

యములు మరింత వింతగా ఉన్నాయి నాకు—.
ఆ ఉత్తరం యీ క్రిందివిధంగా ఉంది—

10 డిసెంబరు 18... ప్రియమిత్రుడవైన లాన్యన్!
నాకత్యంత చిరమిత్రులైనవారిలో జేరినవాడవు నీవు—.
శాస్త్ర చర్చలలో మనకు అప్పుడప్పుడు
భేదాభిప్రాయాలు వచ్చియుండినప్పటికీ, మన ఇద్దరి
మధ్యనున్న అనురాగాభిమానముమాత్రము చెడినదని
ఊహించుటకుతగిన సందర్భము ఏదిన్నీ నామట్టుకునాకు
కన్పించడం లేదు. నీవు ఎన్నడైనా నాతో మాట్లా
డుతూ, "జెకిల్! నా ప్రాణం, నా మానం,
నావివేకం యివన్నీ నీమీదనే ఆధారపడి
ఉన్నాయి" అని నీవు అన్నట్లయితే, నా అయిశ్వర్యం
అంతా నేను నీకోసం త్యాగం చేయజాలనటువంటి
రోజుగాని, నీకు సాయం చేయడానికి నా ఎడమచేతిని
అర్పించడానికి సిద్ధం కానటువంటి దినంగాని, ఎప్పుడూ
లేదు. లాన్యన్! నా ప్రాణం, నా మానం, నా
వివేకం యివన్నీ యిప్పుడు నీదయకు పాల్పడి
ఉన్నాయి. ఈరాత్రి నీవు నాఆశ నిరాశచేస్తే నేను
అంతరించిపోయినట్లే అవుతుంది. ఇంత ఉపోద్ఘాతం
నేను వ్రాయడం చూచి, ఏదో అమర్యాదకరమైన
కోరికను విన్నవించుకొనబోతున్నానని నీవుఊహిస్తావు.
కాని, ఇదంతా పూర్తిగా చదివి బాగా యోచించు.

ఈరాత్రికి నీకుగల యితరవ్యవహారములనన్నిం
టినీ నిలిపి వాయిదా వేసియుంచవలెనని కోరుచున్నాను.

మంచంపట్టిన ఒక మహారాజు వద్దకు రావలసినదిగా నీకు పిలుపు వచ్చినప్పటికీ, ఆపనికూడా వాయిదా వేయవలెను. నీకు సొంత బండీ, హాజరుగా గుమ్మంవద్ద ఉంటేతప్ప, ఒక కిరాయిబండీని మాట్లాడుకో. మన ఉభయుల సత్ప్రతిష్ఠల నిమిత్తమై యీ కవరు ఉత్తరాన్ని నీ జేబులో పెట్టుకొని సరాసరి నా యింటికి రావలెను. నా బట్లరైన పూల్‌కు యివ్వవలసిన ఉత్తర్వులన్నీ అతనికి జారీచేశాను. నీ రాక కొరకై ఎదురుచూస్తూ, తాళాలు బాగుచేసే ఒక పనివానితోసహా అతడక్కడ వేచిఉంటాడు. అప్పుడు నా కచ్చేరిగది తలుపు తాళం మీగా బలాత్కారంగా తెరచుకొని లోపలికి రావాలి. నువ్వు ఒక్కడవు మాత్రమే లోపలికి రావాలి. ఎడమచేతివైపున పింగాణీ పూతపూయబడిన "ఇ" అనే అక్షరం గల బీరువాను తెరువవలెను. అది మూయబడిఉన్నట్లయితే, తాళం కూడా పగులగొట్టాలి. నాలుగోసొరుగును దానిలో ఉన్న యావత్తు సరకుతోసహా బయటికి లాగవలెను. పైనుంచి లెక్కిస్తే అది నాలుగోసొరుగు. క్రిందనుంచి లెక్కిస్తే అదే మూడోసొరుగు—. నాకు యిప్పుడు ఉన్నటువంటి ఆవేదనలో, మతిస్థిమితము లేక, నీకు వ్రాయవలసిన వివరములను సరిగ్గా నేను వ్రాయడం లేదేమో అనే దిగులు నన్ను బాధిస్తోంది. నేను పొరబాటుగా వ్రాసినప్పటికీ, ఆ డ్రాయరుసొరుగు ఏదో దానిలోని సరకునుబట్టి నీవు గుర్తించవచ్చు.

దానిలో కొన్ని చూర్ణాలు, మందుసీసా, కాగితాల పుస్తకం కన్పిస్తాయి. ఈ డ్రాయరుసొరుగును ఉన్నది ఉన్నట్లుగా కావెండిష్ చౌకునకు నీ వెంట నీవు తీసి కొనిపోవాలి.

ఇది నీవు నాకు చేయవలసిన మొదటి సహాయం. ఇక రెండో సహాయం ఏమిటో మనవి చేస్తా-ఈ ఉత్తరం నీకు చేరిన వెంటనే యింటివద్దనుంచి నీవు బయలు దేరినపక్షములో, అర్ధరాత్రి కాకపూర్వమే, అంతకంటె చాలా ముందుగానే, నీవు నీ స్వగృహానికి చేరుకోవాలి. నీకు ఆమాత్రపు వ్యవధిని కొసరుగా యివ్వడానికి కారణమేమంటే, దురూహ్యమైన అనివార్యమైన ఆటంకాలు ఏవైనా రావచ్చు—అంతే కాదు. తర్వాత జరుగవలసిన కార్యక్రమమునకం తటికీ, నీ యింటినవుకర్లు నిద్రపోతూఉండే వేళ చాలా ఉత్తమమైనది. కనుక, నీవు రోగులను చూచేటటు వంటి గదిలో సరిగ్గా అర్ధరాత్రి సమయానికి హాజరుగా ఉండాలి. నాపేరుతో నీవద్దకు వచ్చేడి మనిషినొకనిని నీ చేతితో నీవే స్వయంగా ఆహ్వానించి లోపలికి తీసికొనిపోవాలి—. నా కచ్చేరీ గది నుంచి నీవు తెచ్చిన సొరుగును అతని చేతికి యివ్వాలి. అలా చేసినట్లయితే, నీపని నీవు ముగించినవాడవై నాకు నీవు పరిపూర్ణ కృతజ్ఞతా పాత్రుడవవుతావు. అటుపైన అయిదు నిమిషాలు గడచినపిమ్మట, ఈ ఏర్పాటులన్నీ ఎంత ప్రాణావసరమైనవో నీకే బోధ

పడగలవు. ఇదంతా నీకొక వెర్రివ్యవహారంగా కన్పించి నప్పటికీ, పైన చెప్పిన పనులలో ఏదైనా ఒక్కటి నిర్లక్ష్యం చేస్తే, నా బాధకు నీవు కారణభూతుడ వవుతావు — లేదా, నా వివేక విధ్వంస కారణుడ వవుతావు:

నా మనవిని నీవు తృణీకరించవనే నమ్మకం నాకు ఉంది—కాని, అటువంటిది జరుగునేమో అనే భావం కలుగుతున్నంతమాత్రంచేతనే నా గుండె బేజారై, నా చేయి గజగజలాడుతోంది — ఊహాకం దని ఒకానొక అధోగతిఅవస్థలో ఒక విపరీతప్రదే శంలో యీ సమయంమందు నేను ఉన్నానని గ్రహించు. ఈ నాదుస్థితిని ఎంతగా పెంచి ఊహించినా అది అతి శయోక్తి కానేరదు. వేళ తప్పకుండా సకాలంలో నీవు నాకు తోడ్పడినట్లయితే, కథ కంచికి వెళ్లిన దన్నట్లుగా, నా కష్టాలన్ని మాయమైపోతాయి. ప్రియ తముడవైన లాన్యన్! నాకీ సహాయం చేసిపెట్టు—. రక్షించు

నీమిత్రుణ్ణి
హెచ్. జే—.

తాజాకలం:—ఈ ఉత్తరం వ్రాసి నేను దీన్ని సీలు చేసినతర్వాత మరొక కొత్త అనుమానభీతి నాకు కలిగింది—ఒకవేళ తపాలా ఆఫీసు వాళ్లే నాకు విఘ్నం కలుగ జేయవచ్చు! రేపు ఉదయంవరకూ యీ ఉత్తరం నీ చేతికి అందకపోవచ్చు. అట్టిసందర్భములో, పగలు

నీకెప్పుడు వీలవుతుందో అప్పుడే నే కోరినపని నాకు చేసిపెట్టు. అర్ధరాత్రివేళ నామనిషికోసం ఎదురు చూడాలి—. అప్పటికే చాలా కాలాతీతంకావచ్చు—. ఆరాత్రి నేను చెప్పినప్రకారంగా ఎవరూ నీవద్దకు రానియెడల, హెన్రీ జెకిల్ చూపు ఏక లేదని గ్రహించు"

ఈ ఉత్తరం చదివినపిమ్మట నా సహచరునకు పిచ్చి ఎత్తినదని నేను నిశ్చయించుకున్నాను. ఆవిషయం నిస్సంశయంగా నిర్ధారణ అయ్యేవరకు అతడు కోరిన పని నెరవేర్చడం తప్పదనుకున్నాను. ఈ అడివిగోడవ ఉత్తరం నాకు బోధపడడం ఎంత దుర్ఘటమో, ఆ ఉత్తరప్రాధాన్యమును గ్రహించడం కూడా అంత దుర్ఘటంగానే ఉంది—. అదిన్నిగాక, ఆవిధమైన వాక్యధోరణిలో నాకు మొఱపెట్టుకుంటూ అతడు ఉత్తరం వ్రాసికొన్నప్పుడు, దానిని నిరాకరించి త్రోసి వేయడం చాలా జవాబుదారీతో కూడిన పని అందు వల్ల నేను వెంటనే నామేజాబల్లవద్దనుంచి లేచి, బండీ ఎక్కి సరాసరిగా జెకిల్ యింటికి వెళ్లాను. నాకోసం బట్లరు ఎదురు చూస్తున్నాడు. నాకు చేరినట్లుగానే అదేపోస్టులో బట్లరుకుకూడా ఒక రిజిస్టర్డు కవరు ఉత్తరం చేరింది—. అతడు చేయవలసిన పనులు ఆ ఉత్తరంలో వ్రాసి ఉన్నాయి. తాళములు బాగుచేసే వానికోసం, వడ్రంగికోసం వెంటనే కబురు చేశాడు. మేమిద్దరమూ మాట్లాడుకుంటూ ఉండే సమయంలోనే

ఆపనివాళ్లిద్దరూ హాజరైనారు. మేమందరమూ కలిసి ఆ భవనపు పూర్వ ఖామందైన డాక్టరు డెన్మాన్ తాలూకు శస్త్రచికిత్సశాలలోకి వెళ్లాము. ఆ శాలలో నుంచి (నీకు బాగా తెలిసే ఉంటుంది) జెకిల్ యొక్క సొంతకచ్చేరీగదిలోకి సులభంగా పోవచ్చు —. తలుపు చాలా గట్టిది. దాని తాళంకూడా దిట్టంగా ఉంది—. తాళాన్ని బలవంతంగా తెరచేప్రయత్నములో అది కొంతవరకు చెడిపోగలదనిన్నీ, తనకు అందులో చాలాశ్రమ ఉన్నదనిన్నీ ముందుగానే ఖండితంగా వడ్రంగి చెప్పాడు. తాళాలపనివాడు చాలా తంటాలు పడీ విసుగెత్తి ఉన్నాడు. కాని, యీ తాళాలపనివాడే చేతిలో మంచి పనితనంకలవాడు. రెండుగంటలసేపు అవస్థపడ్డాడు. ఎట్లాగైతేనేం ? చిట్టచివరకు తలుపు తెరచుకుంది. "ఇ" గుర్తుగల బీరువా తాళంవేసి లేదు. అందులోనుంచి కావలసిన సొరుగును బయటకులాగి, దానిని చెత్తగడ్డితో నింపి, ఒక కాగితం దానికి చుట్టి, దానిని నా వెంటతీసికొని కావెండిష్ చౌకునకు తిరిగివచ్చాను.

ఇక్కడకు చేరినతర్వాత, దానిలోఉన్న వస్తు సామగ్రిని పరిశీలించడం ప్రారంభించాను. దానిలో ఉన్న చూర్ణములు చాలా శుభ్రంగానే తయారై యున్నాయి. కాని, మందులషాపులో తయారు చేసినంత నాజూకుగా లేవు. కాబట్టి ఆ చూర్ణములను జెకిల్ స్వయంగా తయారుచేశాడని అర్థమవుతోంది.

అందులో ఒక చూర్ణపుపొట్లము తొలూకు పైకాగితం తీసి చూశాను. అది తెల్లని స్ఫటికపు ముక్కల వంటి క్షారం—. అనంతరం ఆ సొరుగులో ఉన్న సీసాను తనిఖీ చేశాను. ఎర్రని రక్తవర్ణ ద్రావకం ఒకటి ఆసీసాలో సగానికి ఉంది. వాసన చాలా ఘాటుగా ముక్కు మంటపెట్టేటట్లుగా ఉంది. బహుశః దానిలో భాస్వరమున్నూ సారాయున్నూ కలిసిఉంటాయి—. ఇంకా అందులో కలిసిన యితరదినుసులు ఏమిటో నేను ఊహించలేకపోయినాను. సొరుగులో ఉన్న పుస్తకం నోటుబుక్కువంటిది. దానిలో వరుసగా కొన్ని తేదీల సంఖ్యలు నమోదు చేయబడి ఉన్నాయి. అంతకుతప్ప అందులో ఏమీ వ్రాసిలేదు. ఈ తేదీలనుచూస్తే, చాలాసంవత్సరాల కాలపరిమితికి విస్తరించిన తేదీలుగా ఉన్నాయి. కాని, యీ తేదీల నమోదులు సుమారు ఒక సంవత్సరంనుంచీ పుస్తకంలో వ్రాయబడలేదు— కొన్నివందల నమోదులు పరిశీలించిచూస్తే, బహుశః ఒక్క అరడజనుసార్లు "డబిల్" (రెండింతలు) అనే మాట కన్పిస్తుంది. ఇటువంటి ముక్తసరిమాట తప్ప ఆ తేదీల ప్రక్కను వ్రాయబడిన విషయమేమీ లేదు. ఆ తేదీల నమోదుల ప్రారంభ భాగంలో ఒకచోట "పూర్తిగా భగ్నమైంది!" అనేమాట ఆశ్చర్య సూచక గుర్తులతో వ్రాయబడి ఉంది. ఇదంతా పరిశీలించి, చూచిన నాకు దాని అర్థం ఏమిటో తెలిసికోవాలనే

కుతూహలం చాలా కలిగింది. కాని, దానిభావమేమిటో నాకు అంతు చిక్కలేదు. ఈ సొరుగులో ఉన్న వేమిటంటే, ఒక అరఖూ, కాగితంలో కట్టిన క్షారామూ, ఏవో కొన్ని పరిశోధనా ఫలిత సారాంశములుని వేదిక-ఈ పరిశోధనలవల్ల ప్రత్యక్ష ప్రయోజనం ఏమీ ఉన్నట్లుగా లేదు. జెకిల్ చేసిన శాస్త్రపరిశోధనా ప్రయోగాలు అనేకం అటువంటివే. ఈ వస్తుసాముగ్రులు నాయింట్లోకి వచ్చిఉండడంవల్ల గుండె చెదరియున్న నామిత్రుని మానం, ప్రాణం, జ్ఞానం ఏవిధంగా రక్షింపబడిన వచ్చునాయి? అతని నవుకరును ఒక తావుకు తన పనిమీద పంపించుటకు వీలుఉన్నప్పుడు, ఇంకొక తావుకుమాత్రం ఎందుచేత పంపించుటకు సాధ్యంకాదు? అందుకు ఏవో కొన్ని అభ్యంతరాలు ఉంటే ఉండుగాక! ఈ పెద్దమనిషి ఎవ్వరికంట బడకుండ నాయింటికి రావలసిన అగత్యమేమిటి? ఈవిషయాలన్ని నేను ఆలోచించిన కొలదీ, మతిచెడిన వ్యాధిగ్రస్తుని లక్షణాలే యివి అని నాకు బాగా బోధపడింది. నా నవుకర్లను "వెళ్ళి పడుకోండి" అని పంపించివేశాను. కాని, ఆత్మరక్షణకు నేను సిద్ధపడవలసినపరిస్థితి తటస్థించునేమో అనే భయంతో, ఎందుకైనా మంచిదని, పాత రివాల్వరును ఒకటి తీసి దానిలో తోటా ఎక్కించాను.

లండను నగరంలో రాత్రి పన్నెండుగంటలు కొట్టెనో లేదో, నా వాకిలి తలుపును మెల్లిగా కొట్టి

నట్లు శబ్దమైంది—. నేనే స్వయంగా తలుపువద్దకు వెళ్లాను. పొట్టిమనిషి ఒకడు వాకిట్లో ముఖమంటపంలో స్తంభంవద్ద నక్కియున్నాడు.

"మీరు డాక్టరు జెకిల్ వద్దనుంచి వచ్చినారా?" అని నేను ప్రశ్నించాను.

"అవును" అని అతడు మాట బిగబట్టుకొనినట్లుగా సైగ చేశాడు. లోపలికి రమ్మని నేను పిలిచినప్పుడు, బయట చీకటిలో ఆచోటు, నైపుకొకసారి వెనక్కి తిరిగి ఓరచూపులతో చూచి అటుపిమ్మట లోపలికి వచ్చాడు. సమీపంలోనే పోస్టుమీద పోలీసువాడొకడున్నాడు. దీపం చేతబట్టుకొని గస్తీ తిరుగుతున్నాడు. నాయింటికి వచ్చినమనిషి వానిని చూచి, తత్తరపాటుతో, మరింత తొందరగా లోపలికివచ్చాడు.

ఈ సందర్భములన్నీ నాకు చాలా అసహ్యాకరంగా కన్పించాయి. రోగులు వైద్యసలహాలకై నాతో సంప్రతించే గదిలో వెల్తురు బాగా ఉంది. నా ఆయుధం నా చేతిలో గట్టిగా పట్టుకొని అతనిని నా వైద్యసంప్రతింపుల గదిలోకి తీసికొని వెళ్లాను. ఇక్కడ అతనిరూపం స్పష్టంగా చూడగల అవకాశం నాకు కల్గింది. అతనినిఅంతకుముందు నేనెప్పుడూ చూడలేదనే మాట నిశ్చయం—. నేనింతకుపూర్వం చెప్పినట్లు అతడు చాలా పొట్టిగా ఉన్నాడు. అది యట్లుండగా అతనిముఖం చాలా ఘోరంగా ఉంది. కండల కదలికనుబట్టి అతనిలో చాలా చాకచక్యం కనిపిస్తోంది.

కాని అతని శరీరతత్వాన్ని తారుమారుచేసే రుగ్మత వదో ప్రవేశించినవానివలె ఉన్నాడు. ఇరుగు పొరుగు పరిస్థితులవల్ల మనిషి మతిచెడి గతిచెడిన వానివలె ఉన్నాడు. కఠిన నియమనిగ్రహముల ఫలిత ప్రారంభదశలక్షణంగా ఉంది. నాడికూడా నీరసించినట్లుంది. ఆ మనిషికి రోత పుట్టించిన వేవో కొన్ని సందర్భకారణాలవల్ల తల తిక్కతత్వం ఒకటి అతనిలో విక్రృతంగా ఏర్పడిందని అప్పటికప్పుడు నేను మనిషిని చూడగానే ఊహించాను—కాని, యీ విక్రృత లక్షణాలు యింతతీవ్రంగా ఉండడం నాకు వింతగా కన్పించింది. ఈ వైకల్యం అతనిలో వస్తుతః ఉన్నదేమో అని నాకు అనుమానంగానే ఉంది. అప్పటినుంచీ—కేవలం రోతవల్లగాని, విద్వేషంవల్లగాని యింత మార్పుకలుగజాలదనియు, అంతకంటె అతి గూఢమైన గాఢమైన మరికొన్ని హేతువులు ఉండ గలవనియు భావించాను.

ఇంట్లోకి ప్రవేశించినదాదిగా అమిత అసహ్యకరమైన వింతశాల్తీగా కన్పించినటువంటి ఆమనిషియొక్క దుస్తులు ఇంకోమనిషి తొడుక్కున్నట్లయితే, ఎంతో నవ్వులాటలుగా ఉండేది. అతడు తొడుక్కున్న దుస్తులు చాలా ఖరీదుగలవి. గుడ్డ దర్జాగా ఉంది. కాని, ఆ దుస్తులు అతని కొలతలకు మితిమీరి ఉన్నాయి. లాగూ పాదాలుదాటి చాలా పొడుగుగా జీరాడుతూ ఉంది. వ్రేలాడుతున్న లాగూ

కొనలు పైకి మడతపెట్టబడినవై నేలమీద యీడ్చుకొనిపోకుండా ఉన్నాయి. ఇక కోటుయొక్క మధ్యభాగం అతని పిరుదులనుదాటి యింకా క్రిందుగా ఉంది. మెడపట్టీ అతని బుజాల క్రిందకుకూడా వచ్చింది. అన్నింటికంటే విచిత్రం ఏమిటంటే, యిటువంటి అకటావికటవేషం చూచినప్పుడు, నాకు నవ్వు అనేది ఎంతమాత్రమూ రాలేదు. నాయెదుటనిల్చున్న వ్యక్తియొక్క ప్రకృతిలోనే ఒకవిధమైన అసాధారణ వికృతత్వం జన్మతః ఏర్పడినట్లుంది. ఆ వికృతత్వం మనస్సును కలవరపెట్టి, రోతపుట్టించే విచిత్ర విపరీత వికృతత్వం—అందువల్ల యీ దుస్తుల అవకతవకలక్షణంకూడా ఆ వికృతత్వంలో చేరిన భాగంగానే కన్పించింది. నేను అతనిప్రకృతి ప్రవృత్తివిషయమై యోచించడమేగాక, అతని పుట్టుపూర్వోత్తరములు, అతని జీవితకథావిశేషములు, అతనిస్థితి, అతని ఆస్తిపసతులు తెలిసికోవలెననే యోచనకూడా నాకు కలిగింది.

ఇవన్నీ నేనింత దీర్ఘంగా వ్రాసినప్పటికీ, కొలదిక్షణములలోనే నామనస్సుకు తట్టిన ఊహాలివి. నాయింటికివచ్చిన ఆమనిషి తత్తరపాటుతో తహతహలాడి ఉడికిపోతున్నాడు.

"అది మీరు తెచ్చారా? అది మీవద్దఉన్నదా?" అని అతడు అరిచాడు. ఆ తొందరతో అతడు అతి

చలాకీగా ఉన్నాను. నా చెయ్యి పట్టుకొని ఒక ఊపు ఊపుటకు ప్రయత్నించాను.

కాని, అతను నా చెయ్యి పట్టుకొనగానే నా రక్తం అంతా మంచుగడ్డ తాకినట్లుగా జిల్లుమనడం చేత అతనిని నేను వెనుకకు త్రోసి ఉంచాను. "అయ్యా! మీరెవ్వరో తెలిసికొని సంతోషించే అవకాశము కూడా నాకింకా కలుగలేదు. దయచేసి అట్లా కూర్చోండి సారూ" అన్నాను. అందుకై అతనికి దారి చూపినట్లుగా నేనుకూడా నా మామూలు కుర్చీలో కూర్చున్నాను. రోగి ప్రక్కను నేను కూర్చుండే మామూలైన వైఖరిని, యీసమయంలో కూడా, నా మనస్సు కలవరపాటునుబట్టియు, నాయింటికివచ్చిన మనిషి నాకు కల్గించిన భీతినిబట్టియు, యీ అర్ధరాత్రి వేళ ఎంతవరకుసాధ్యమో అంతవరకు అనుసరించాను.

"డాక్టరు లాన్యన్! క్షమించాలి. మీరుచెప్పేది చాలా మంచి సంప్రదాయంగానే ఉంది. కాని, నాకిప్పుడున్న తొందరమూలంగా మర్యాదలాంఛనాలన్నీ హరించిపోయినాయి. మీ సహచరులైన డాక్టరు హెన్రి జెకిల్‌గారు పంపించినందున నేను చాలా ముఖ్యమైన ఒకపనిమీద యిక్కడికి వచ్చాను. నాకు ఆయన తెలియ జెప్పిన దేమిటంటే..." ఆమాటలతో కొంచెం ఆగి తనగొంతుకను చేతితో పట్టుకున్నాడు. ఏదో అపస్మారపుతెర వస్తూఉన్నట్లుగానూ, దానిని రానీయకుండా అవస్థపడుతున్నట్లుగానూ కన్పించాడు.

"నాకు తెలియజెప్పిన దేమిటంటే, ఒక సొరుగు......" అని ముగించాడు.

అతని ఆదుర్దా చూస్తే నాకు జాలి కలిగింది. ఇకముందు జరుగబోయేదిఏమిటో చూడవలెననే కుతూహలంకూడా నేను పట్టలేకపోయినాను.

నా మేజాబల్ల వెనుకవైపుగా నేలమీద కాగితంతో చుట్టబడియున్న సొరుగును అతనికి చూపించి "అదుగోనయ్యా! అక్కడ" అన్నాను.

అతడు ఒక్క గంతువేసి దానివద్దకు వెళ్లాడు. కొంచెం ఆగి తన గుండెకాయమీద చేయి వేసికొన్నాడు. అతని పండ్లు పటపట కొరకడం నాకు వినిపించింది. అతని దవడలు కంపించినట్లుగా ఆడినవి. అతనిముఖం పరమభీకరంగా ఉంది. అదిచూస్తే అతని ప్రాణం, అతని వివేకం ఏమైపోగలవో అని నాకే భయం పుట్టింది.

"నిదానించు. సంబాళించుకో" అన్నాను నేను.

అతడు నావంకజూచి చాలా భీకరమైన మందహాసం చేశాడు. అన్నింటికీ తెగించిన మనో నిశ్చయంతో, ఆ సొరుగుపైన చుట్టిన కాగితాన్ని పట్టుకొని లాగివేశాడు. అందులో ఉన్న వస్తువులను చూచి, తల్లడిల్లిన ప్రాణం తెప్పరిల్లినదన్నట్లుగా, వెక్కి వెక్కి ఏడ్చాడు. ఇదంతాచూస్తూ నేను స్తంభించిపోయినాను. మరుక్షణంలోనే, అతని కంఠస్వరం స్వాధీనంలోకి

వచ్చింది. "మీావద్ద నీళ్లుకొలిచే ఔన్సుగ్లాసుఉన్నదా?" అన్నాడు.

నేను కూర్చున్నతావునుండి కొంచెం ప్రయాసతో లేచి అతడు అడిగిన దేదో యిచ్చాను.

చిరునవ్వునవ్వుతూ తల పంకించి తన కృతజ్ఞతను నాకు తెలియజేసి, ఎర్రని అరఖులోనుంచి కొన్ని చుక్కలను ఆ గ్లాసులో వేశాడు. చూర్ణపు పొట్లములలోని ఒక పొట్లమునుతీసి దానిలోని మందును ఆగ్లాసులో వేశాడు. ఈ మిశ్రమము మొదట ఎర్రగా ఉంది. క్షారంలోని స్ఫటికపు ముక్కలు అందులో కరగినకొలదీ ద్రావకపు రంగు అంతకంతకు తేజోవంతంగా ఉంది. బుసబుసమని పొంగి నీటి నురుగు తుప్పర్లు ఆవిరివలె పైకి వచ్చాయి. బుసబుసమనేడి పొంగు హఠాత్తుగా ఆగిపోయింది. ఆమిశ్రద్రవము ముదురుఊదారంగులోకి మారింది. ఈ రంగుకూడా క్రమేణ విరిగిపోయి, లేత ఆకుపచ్చరంగులోకి మారింది. నాయింటికివచ్చిన ఆ మనిషి ఈ మార్పులన్నీ చాలా శ్రద్ధగా పరిశీలిస్తూ చిరునవ్వు నవ్వి గ్లాసును మేజాబల్లమీాదపెట్టి నావంకకు తిరిగి నన్ను తనిఖీ చూచినట్లుగా చూచాడు.

అప్పుడతడిలా అన్నాడు. "ఇక ముందుపని ముగించుకోవాలి. మీారు వివేకంతో యోచిస్తారా? సబబైనపద్ధతి అనుసరిస్తారా? ఇక మిగతామాట లేపీ లేకుండా యీాగ్లాసును నావెంటతీసికొని నన్ను

ళ్ళిపోనిస్తారా లేదా, ఇదంతా ఏమిటో తెలిసికో
లెననే కుతూహలం మిమ్ములను వదలిపెట్టకుండా
న్నదా ? మీరు ఎట్లా నిర్ణయిస్తే అలా జరుగ
లగు. కనుక, బాగా ఆలోచించి జవాబు చెప్పండి—
ాగ కర్తవ్యం ఏమని నిర్ణయించినప్పటికీ, మీకు
లిగేమార్గ్య ఏమీ ఉండదు. కాకపోతే, ప్రాణాంతక
ష్టదశలో ఉన్న మీ మిత్రునకు మీరు ఉపకారం
ేయగల్గితిరనెడి ఆనందమే మీరు మూటగట్టుకొనెడి
ుణ్య సంపద. అంతకుతప్ప మీకు ఏవిధమైన
ాగ్యా కలుగదు. అలా కాక, మీరు మరోవిధముగా
ోరినట్లయితే, గొప్ప పేరుప్రసిద్ధిని గడించుటకూ శక్తి
ంపదను గడించుటకూ తగిన నూతన విజ్ఞాన విశేష
ులు ఇప్పుడు యీ గదిలో యీ క్షణమందే మీకు
పత్యక్ష నిదర్శనములు కాగలవు. ఎటువంటి నాస్తిక
ిశాచమునైనా, హడలిపోయేటట్లుగా చేయగల ఒక
ుసాధారణ ప్రజ్ఞాశాలిమూలంగా మీకీ దిగ్భ్రమ
లుగగలదు."

నాకు నిజంగా మనస్సులోలేని నిబ్బరం నేను
తెచ్చిపెట్టుకొని, "అయ్యా! మీరు చెప్పేది అంతా
అర్థంకాని యక్షప్రశ్నలు లాగున్నది. మీరు చెప్పేది
అంతా నిజమనినమ్మి నేను మీమాటలు ఆలకిస్తున్నానని
మీరు భ్రమించవద్దు. ఈమాట నేను పల్కినందుకు
మీరు విస్మయపడవద్దు—నాకు బోధపడని పరోపకార
సేవ నేను మీకు యిక్కడికే చాలాచేశాను. కనుక,

దీని పర్యవసానం అంతా ఏమిటో ఆశ్వాసాంతం చూడకుండా ఆగజాలను."

అందుకు అతడు యిలా బదులు చెప్పాడు. "సరే మంచిది. లాన్యన్! నీవు యిదివరలో కొన్ని శపథాలు చేశావు. ఇకముందు జరుగబోయేది అంతా మన వైద్యవృత్తిలో ఉండవలసిన అంతరంగిక రహస్య తంత్రంవంటిది. ఇంతవరకూ నీకు చాలా సంకుచితమైన భౌతిక విషయపరిజ్ఞానమే ఉంటూ ఉన్నది. అటువంటి భావములకే నీవు కట్టుబడి ఉన్నావు. ఆత్మోద్ధారకౌషధ మహిమా ప్రభావాన్ని నీవు మిథ్యయని ధిక్కరించినావు. ఘనులైన పెద్దలను నిక్కరించినట్టి నీవు చూడు యిప్పుడు!"

మందు పోసిన గ్లాసును తన నోటివద్ద పెట్టుకొని ఒక్కగుక్కలో ఆమందుఅంతా త్రాగివేశాడు. ఒక్క పెద్దకేక వేశాడు. అతడు తలతిరిగి తూలి వాలిపోయి నాడు. మేజాబల్లను గట్టిగా పట్టుకొన్నాడు. నోటితో ఒగర్చుచున్నాడు. లోపలికి యీడ్చుకొనిపోయిన కళ్ళతో నిక్కి చూస్తున్నాడు. నేను చూస్తూ చూస్తూ ఉండగానే ఒకమార్పు అతనిలో వచ్చినట్లుగా కన్పించింది. మనిషి పెరిగి పెరిగి విస్తరించినట్లుగా కన్పించాడు. అతని ముఖం అకస్మాత్తుగా నల్లబడింది. అతని ముఖలక్షణాలుఅన్నీ కరగి విరిగి తారుమారైపోతున్నాయి. మరుక్షణం నేను ఒక్కగంతువేసి గోడవైపుకు జేరగిలబడి నిల్చున్నాను. నా మనస్సు అంతా అమితంగా

బీభత్సమై పోయింది. నా కంటిఎదుట నున్న ఈ అసాధారణ ప్రజ్ఞానిధి సన్నిధినుండి తప్పించుకొనుటకై ఆత్మ రక్షణకై నా చెయ్యి పైకెత్తాను.

"అయ్యో! దేవుడా! అయ్యో! దేవుడా!" అని అరిచాను. మరల మరల అరిచాను. నా కళ్ళఎదుట పాలిపోయి వణికిపోతూ, సగం స్పృహతప్పినవాడై, తన చేతులతో తడివి చూచుకుంటూ, మరణించిన మనిషి మరల సజీవుడైనట్లుగా లేచి నిల్చున్నాడు, హెన్రీ జెకిల్!

మరునటి గంటసేపులో అతడు నాకు వివరించి చెప్పినదంతా యీ కాగితంమీద వ్రాయడానికి నాకు అది స్ఫురణకు రావడంలేదు నాకళ్లారా చూచిందేదో చూచాను. నా చెవులార విన్నదేదో విన్నాను. దానితో నా మనస్సుకు వెర్రెత్తినట్లయింది. అప్పుడు నేను కళ్లార చూచినదంతా నా స్మృతిపథంనుంచి మాయమైనప్పటికీ, అదంతా యథార్థమని నేను నమ్ముచున్నానాఅని నన్ను నేనే ప్రశ్నించుకొంటున్నాను. కాని ఆ ప్రశ్నకు నేనే జవాబు చెప్పలేను. నా ప్రాణం తల్లడిల్లి సమూలం తలక్రిందులైంది. నాకు నిద్రఅనేది లేకుండా అంతర్ధానమైంది. రాత్రీ పగలూ సదా సర్వకాల సర్వావస్థలయందూ అతిఘోరమైన భీతి ఒకటి నన్ను వెంటాడుతూ ఉంది. నారోజులు సమీపించిన వనిన్నీ నేనిక మరణించక తప్పదనిన్నీ, ఇదంతా నమ్మలేనిస్థితిలోనే నేను మరణించక తప్పదనిన్నీ నాకు

గట్టిగా తోస్తోంది. ఆమనిషి తాను చేసిన కొన్ని నీతి మాలిన దుష్కార్యములగూర్చి నాతో చెప్పి వెల్లడించి నప్పుడు, అతడు పశ్చాత్తాపంతో కంటతడిపెట్టి నప్పటికీ, ఆ విషయములను నేను తిరిగీ జ్ఞప్తికి తెచ్చు కొంటే నా గుండె చెదరిపోతుంది. కాని, అట్టర్సన్! నీకొక్క విషయం మనవిచేస్తాను. నామాటను నీవు త్రోసివేయకుండా గౌరవిస్తే అంతే చాలు. నాముందు జెకిల్ స్వయంగా ఒప్పుకొని చెప్పినదానినిబట్టి, ఆ రాత్రి నాయింటికివచ్చిన ఆవ్యక్తి 'హైడ్' అనే పేరుగలవాడు. క్యారూను హత్యచేసి, దేశమంతటా దశదిశల వేటాడు చున్నప్పటికీ, కన్పించని వ్యక్తి అతడు—

హాస్టీ లాన్యన్.

# 10. హెన్రీజెకిల్ వివరించిన సర్వసమగ్ర కథ

18...సం॥లో నేను భాగ్యవంతుల బిడ్డనై జన్మించాను. అంతేగాక, నాకు సహజసిద్ధమైన తెలివి తేటలు బాగా ఉండేవి. పాటుపడి కృషిచేసే స్వభావం నాది. పండితుల గౌరవాదరణ పొందవలెనన్న ఆసక్తి ఉండేది. 'అటువంటి పరిస్థితిలో కీర్తిగౌరవములతో పేరు ప్రసిద్ధిలోనికి రాగల అవకాశము నాకు నిశ్చయంగా ఉండెనని పై సందర్భములనుబట్టి ఊహించుకో వచ్చును. నాలో ఉన్న లోపములలోకెల్లా నికృష్ట మైన లోపము ఏమిటంటే, వెనుక ముందు యోచించని ఖులాసా దిలాసాతత్వం - అటువంటి స్వభావ

లక్షణంమూలంగా చాలామందికి జీవితం సంతోషంగా గడిచింది. కాని, పదిమందిముందర కొంచెం అసాధారణమైన గాంభీర్యంతో తల ఎత్తుకొని తిరుగవలెననే తీవి నాలో ఉండుటవల్ల ఈ రాజసలక్షణానికిన్నీ నాలో ఉన్న ఖులాసాదిలాసాతత్వానికిన్నీ పొత్తు కలియలేదు. ఆ కారణమువల్ల నాలో ఉన్న సరదాలను పైకి కన్పించనీయకుండా నేను కప్పిపుచ్చి ప్రవర్తించాను. నేను పెరిగి పెద్దవాడనై ఆత్మ పరిశీలన చేసికోగల వయస్సునకు వచ్చినపిమ్మట, ప్రపంచంలో నాస్థితిని, నాఅభ్యుదయాభివృద్ధిని, విమర్శించి చూచుకోగల వయస్సుకు నేను వచ్చినపిమ్మట, నా జీవితములో ఒకవిధమైన ద్వంద్వ స్వభావప్రవృత్తి బాగా వేరుపారియున్నదని గ్రహించాను. ఏ అవలక్షణములను నాలోని దోషములుగా నేను పరిగణించానో, అట్టి వానినే తదితరులు బాహాటంగా బడాయిగా వెల్లడించుకోగలరు. కాని, నేను కొన్ని ఉత్తమ ఉన్నత జీవితలక్ష్యములను దృష్టియందుంచుకొన్నవాడ నగుట చేత, నాలోని అవలక్షణములను చూచి నేనే సిగ్గుపడి, వాటిని కప్పిపుచ్చి ప్రవర్తించాను. నాలో ఉన్న మంచీ చెడ్డా రెండు భిన్నతత్వాలుగా విభక్తమై పొత్తు కలియక విడిపోయినాయి. ప్రతిమానవునియందూ ద్వంద్వ స్వభావము చాలా సమ్మిళితంగా ఉంటుంది. ఈ ద్వంద్వస్వభావము చాలామందిలో విడివడియుండుట కలదు. కాని, అట్టి వారందరిలోకంటే

నాలో యీ సుగుణదుర్గుణములు వ్యత్యస్తములై ఆవలి యొడ్డు యీవలి యొడ్డు అన్నట్లుగా విడివడియున్నవి. నాయందున్న అవలక్షణములు అతి నీచములైనవగుట వల్ల యీ తీవ్ర విభజన నాలో ఏర్పడలేదు. నాలో సహజ సిద్ధంగా ఉన్నటువంటి కొన్ని ఉన్నతాశయముల మూలంగానే, యీ సుగుణదుర్గుణములకు పొత్తు కలియక తీవ్ర విభజన ఏర్పడుట సంభవించింది. మానవ జీవితములోని దుఃఖమున కంతటికీ మూలకందమైన ఈ అభేద్యజీవితప్రవృత్తి ధర్మమును గూర్చి మన నంచేస్తూ దీర్ఘాలోచనలో పడ్డాను. మతోపదేశముల కన్నింటికీ యిదే ప్రాతిపదిక. నేను రెండు భిన్న ప్రకృతులతో వ్యవహరించువాడనైనప్పటికీ, నాలో కపటంగాని మాయపటాటోపంగాని లేదు. నాలో ఉన్న రెండు భిన్నతత్వములున్నూ దేనికది త్రికరణ శుద్ధిగానే వ్యక్తమౌతూ ఉండేది. పగటిపూట అంతా నేను శాస్త్రవిజ్ఞానాభివృద్ధికి కృషి చేసినప్పుడుగాని, సోదరమానవుల దీన దుర్భరావస్థల దొలగించుటకై సేవ చేసినప్పుడుగాని, నేనెంత సహజంగా ప్రవర్తిస్తానో, నా మనోనిగ్రహమును విడనాడి హేయమైన చర్యలకు పాల్పడినప్పుడుకూడా నేనంత సహజంగానే ప్రవర్తిస్తాను. నా దేహేంద్రియములయందు నిరంతర సంఘర్షణ మొకటి సద్వృత్తికీ, అసద్వృత్తికీ జరుగుచున్నదనెడి ఇంగితజ్ఞానము నాకు కలిగింది. మానవుని అంతరింద్రియశక్తులను గూర్చియు, ఆత్మజ్జీవన

వికాసమును గూర్చియు నేను విశేషశాస్త్రజిజ్ఞాస చేసిన కారణంచేత, పై జెప్పిన నిరంతరసంఘర్షణవల్ల నా ఇంగిత జ్ఞానమున కొక అధిక వికాసం కలిగింది. నా తెలివితేటలనూ, నాకుగల నైతికదృష్టినీ కేంద్రీకరించి యోచించుటవల్ల ఒక నిత్యసత్యమును నేను గ్రహింపగల్గితిని. ఏ మానవుడైనా నిజంగా ఏకైకవ్యక్తి కాడనియు, రెండు వ్యక్తుల సంపుటియనియు, గ్రహింపగల్గితిని. ఈ సత్య స్వరూపమును కొంతవరకే నేను గ్రహించినవాడ నగుటచేత, నా జీవితము బుగ్గిలో పోసిన పన్నీరైనది. ప్రతి మానవుడూ రెండు వ్యక్తుల సంపుటియని నేను వాదిస్తాను. నాకు లభించిన తత్త్వజ్ఞానము అంతకుమించి పైకి పోవుట లేదు. నా అనంతరము ఇతరులు కొందరుద్భవించి, నే ననుసరించిన పరిశోధనమార్గములనే అనుసరించి, నాకంటె ఎక్కువైన విషయాలను వారు కనుగొనవచ్చును. అప్పుడు, మానవుడనే వానిలో అసంబద్ధములైన వేర్వేరు భిన్న స్వతంత్ర ప్రకృతులు స్థిరావాసము గల భూతములవలె ఉండుననియు, మానవుశంటే యిట్టి బహు భిన్నప్రకృతులకూటమనియు, ఉత్తరోత్తర నాయనంతర శాస్త్రవేత్తలు కన్గొని నిరూపించగలరని నే నూహించి సాహసించి చెప్పగలను. నామట్టుకు నేను, నా జీవిత ప్రవృత్తినిబట్టి, ఒకవిధమైన తత్త్వ విమర్శ చేసి, అందులో నిర్దుష్టంగా సత్యనిరూపణ చేశాను. నేను చేసిన సత్యనిరూపణ ఒకవిధమైన

తత్త్వవిమర్శకుమాత్రమే సంబంధించియున్నది. ఆతత్త్వ
విమర్శ నైతికవిచక్షణతో కూడినదై యున్నది. నా
సొంతవిషయంలోనే నేనిది పూర్తిగా గ్రహించాను.
మానవునియందు అనాదిసిద్ధమైన సంపూర్ణమైన
ద్వంద్వప్రకృతి సంఘటిత యొకటి యున్నదని గ్రహిం
చాను. నాయందు రెండు భిన్నప్రకృతులు వేర్వే
రుగా ఉండడంవల్లనే ఆ రెండింటికీ పరస్పరసంఘర్షణ
అనేది నా అంతరాత్మయందు ఏర్పడుతోంది. ఆ రెండు
భిన్నప్రకృతులూ కలిసి నేనే అని వాదించినప్పటికీ,
నేను ఒక్కొక్క ప్రకృతియందు స్వతంత్రవ్యక్తిత్వంతో
ఉంటున్నానని అంగీకరించాలి. ఈ రెండు ప్రకృ
తులనూ వేర్వేరు చేయుట సాధ్యం కావచ్చునని
ఆశిస్తూ, అటువంటిది సాధ్యమని నా శాస్త్ర పరిశోధ
నలు నాకు దారిచూపించుటకుపూర్వమే, ఆవిషయమై
గొంతెమ్మ కోరికలు కోరుతూ ఉన్నాను. ఆవిషయమై
నేను ఉల్లాసంగా ఊహాగానం చేస్తున్నాను. ఈ రెండు
భిన్నప్రకృతులనూ, వేర్వేరు శాల్తీలుగా విడదీసి,
రెండు భిన్నమూర్తులుగా మూర్తీభవింపజేసినట్లయితే,
జీవితంలో మానసిక దుర్భరదురవస్థ లనేవి పూర్తిగా
తొలగిపోగలవు. ఉన్నత ఉదారాశయ ప్రకృతితో
పొత్తు లేకుండా, నీచనికృష్ట ప్రకృతి అనేది దానిత్రో
వను అది పడిపడిపోయేటట్లు చేయవచ్చును. ఆవిధంగా
విశ్లేషించి పృథక్కరించినయెడల, మానవుడు ధర్మ
చింతసంకలితుడై, నిర్భయముగా, భ్రమ ప్రమాద రహి

ముక్తై, తనకు మానసానందకరములైన సత్కార్యములను జేయుచు, దుశ్చింతా ప్రేరిత దుష్కార్యములు జేయక, పరాభవ పశ్చాత్తాపములకు పాల్పడక, తన ఉత్తమ ఉత్తరగతి నెరింగి పురోగమించగలడు.

ఇటువంటి రెండు విరుద్ధ ప్రకృతులు, రెండు కట్టెలను కలిపి కట్టినవిధంగా, ఒక్క మానవునిలో ఉండడంవల్లనే మానవుడు శాపగ్రస్తుడైనట్లుగా ఉన్నాడు. ఒకే సూదంటురాయియొక్క ఉత్తరధృవ దక్షిణధృవ ఆకర్షణశక్తులు నిత్యము ప్రతిఘటించుచున్నవిధంగా, మానవుని అంతరంగమునందు సుశీల దుశ్శీల ప్రకృతులు సదా కలహించుచుండుట మానవజాతి కొక శాపమువలె ఉంది. అయితే, యీ రెండు ప్రకృతులను పృథక్కరించడం ఎట్లా సాధ్యమైంది?

ఈవిధంగా నేను మననం చేయుచున్న కాలముందు, నా శాస్త్ర పరిశోధనామందిరంలో సంభవించిన ఒక విశేషంవల్ల, కొత్తఊహలు నామనస్సుకు తట్టినవి. మనము ఏ దేహంతో యీ ప్రపంచంలో నిండు ముస్తాబుతో సంచరిస్తున్నామో, అట్టి యీ దేహము స్థూల స్థిరాకారంగలదిగా పైకి కన్పించినప్పటికీ, అది రూపు మారిపోగల అస్థిర అభౌతిక సూక్ష్మతత్వముకలదై, పొగమంచువలె విడిపోయి ఆత్మపరివర్తనం పొందగల్గినదని, నేను గ్రహించాను. అదివరకు సిద్ధాంతీకరింపబడినదానికంటె మరింత శుద్ధంగా యీవిషయం నేను గ్రహించాను.

ఒక సభామంటపమునకు చుట్టునున్న తెరలను ప్రచండ మైన గాలివచ్చి అటు యిటు ఎగురగొట్టిన విధంగానే, యీ శరీరమునెడి ముసుగును చెదరగొట్టివేయ గల కొన్ని ఔషధ ద్రవ్యముల ప్రభావమును నేను కనుగొన్నాను. ఈ విషయమును నేను ఏవిధముగా కనుగొంటినో, ఆ శాస్త్రపరిశోధనా విధాన వివరములను నేను సవిస్తరముగా యిచట ప్రస్తావింపదలంచుకోలేదు. అందుకు రెండు ముఖ్యకారణము లున్నవి. ఒకటి ఏదనగా. మన జీవితభవిష్యత్తుకు మనమే బాధ్యులము. ఆ బాధ్యత మన నెత్తిమీదనే ఉంది. అట్టి బాధ్యతను తొలగించుటకు ప్రయత్నము చేసినట్లయితే, అట్టి బాధ్యత మరింత అసాధారణ, అతి భీకరధాటితో మన నెత్తిమీద పడుతుంది. ఇక రెండో కారణం ఏమిటంటే, నే నిప్పుడు వివరించెడి నా జీవిత కథాకలాపమువల్ల మీకు విదితమయ్యెడి సారాంశమునుబట్టి నాయొక్క శాస్త్ర పరిశోధనలు దురదృష్టవశాత్తు అసంపూర్ణములైనవని తెలియగలదు. నా అంతరాత్మలో చేరియున్న కొన్ని శక్తుల ప్రతిభావికాసం అంతరాత్మను ఆవరించియున్న ఒక తేజస్సువంటిదని నేను గ్రహించాను. అంతేకాదు. ఈ శక్తులు నా అంతరాత్మయందు ప్రబలమై ప్రాధాన్యం వహించకుండా, వాటి ప్రకోపములను తొలగించుటకు వీలైన ఒక ఔషధ ద్రవ్యమును తయారుచేయగలిగినాను. ఆ మందువల్ల,

మరొక ఆకారం ముఖవికారం నాకు ఏర్పడగలదు. నా అంతరాత్మలో ఉన్నటువంటి నికృష్టతత్వలక్షణములు యీ ఆకారంలో మూర్తీభవించి ఉంటాయి. అయి నప్పటికీ అదికూడా నా సహజవ్యక్తిత్వ మూర్తియే.

ఈసిద్ధాంతముయొక్క పరిశోధనప్రయోగమును ఉపక్రమించుటకు పూర్వము నేను చాలా సంకో చించాను. ఇటువంటి పరీక్షలవల్ల నాకు ప్రాణంపోయే ప్రమాదావకాశం ఉంది. ఎందుచేతనంటే, నేను కనిపెట్టిన ఔషధద్రవ్యం దేహముయొక్క ఆకార స్వరూపాన్ని గుర్తుపట్టుటకు వీలులేకుండా సమూలంగా సమగ్రంగా పెకలించి కదలించి తారుమారు చేస్తుంది. అటువంటి సందర్భంలో యీ ఔషధమును రవ్వంత హెచ్చు మోతాదులో పుచ్చుకొనినట్లయితే, తరుణము కనిపెట్టి దానిని సేవించనట్లయితే, ఏక్రొత్త ఆకారములోనికి నా శరీరము మారిపోవలెనని నిరీ క్షిస్తున్నానో, అట్టి సూక్ష్మతత్వపరికల్పిత నూతన మూర్తి నాకుఏర్పడకుండా, అసలు దేహం పటాపంచలు కావచ్చును కాని, ఇంతటి అపరూప అమోఘ అద్భుత ఔషధ ప్రభావమును పరీక్షించి చూడవలెనను ఆశ నాకు అమితమైనందున, ప్రమాదభయమునుకూడా నేను లెక్క చేయలేదు. కావలసిన ఔషధ ద్రావక మును చాలాకాలంక్రిందటనే నేను తయారుచేసినాను. నేను చేసిన పరిశోధనలనుబట్టి అందులో ఒక క్షారము కట్టకడపటి దినుసుగా చేరవలసి యుండెను. ఔషధ

ద్రవ్యముల తోను వ్యాపారం చేసెడి ఒక వ్యాపారస్థునివద్ద ఆ ఔషధమును భారీ మొత్తముగా ఒక్క-సారిగా నేను కొని ఉంచుకొన్నాను. ఒక దౌర్భాగ్య రాత్రి సమయమందు, ఆ రస ద్రవ్యములను నేను మిశ్రమం చేశాను. అవి అన్నీ గ్లాసులోటాలో కాగి ఆవిరి పైకి వస్తూఉంటే శ్రద్ధగా కనిపెట్టి చూచాను. ఆ గ్లాసులోని పొంగు అంతా చల్లారిన తర్వాత ధైర్యంతో ఆనందంగా అమాంతం త్రాగివేశాను.

బ్రహ్మాండమైన నొప్పులు ప్రారంభమైనాయి. ఎముకలు చితుకకొట్టినట్లయింది. విపరీతమైన పైత్య వికారం ప్రారంభమైంది. ప్రసవకాలమందుగాని, మరణకాలమందుగాని ఉండే ఆవేదనకంటె అత్యధికమైన మనోవేదన మొదలు పెట్టింది. ఈ బాధలన్నీ క్రమేణ తగ్గినవి. విపరీతమైన జబ్బుపడి లేచినవానివలె నాకు తిరిగి స్థిమితం ఏర్పడింది. నా ఇంద్రియ పరిజ్ఞానం ఒకవింత వైఖరిలో ఉంది. నాకు కలిగిన క్రొత్త స్పృహ వినూత్నమై పవిత్రమై అనిర్వచనీయంగా ఉంది. ఇదంతా నాకు క్రొత్త అవతారంగా ఉండటంవల్ల, యీ నూతన ఇంద్రియానుభవమంతా మధురంగా ఉంది. సమ్మోదానికి వీలులేనంత మధురంగా ఉంది. నాకేదో నూత్న యౌవనం వచ్చినట్లుంది. శరీరం లఘువుగా చలాకీగా ఉంది. శరీరంలో బలే ఖులాసాగా ఉంది. నా అంతరంగంలో ఒక విధమైన తలపొగరు నిర్లక్ష్యం అతిశయించి ఉంది.

ఇంద్రియ భోగవాంఛలన్నీ తలకెక్కి, నా ఊహా ప్రపంచంలో అవి మేఘాలవలె పరుగెత్తుతున్నాయి. లోకంలో మొగమోటములూ, బాధ్యతలూ, లేకుండా ప్రవర్తించే విశృంఖలధోరణి ఏర్పడింది. కాని, అది విశుద్ధమైన ఆత్మ స్వాతంత్ర్యము మాత్రము కాదు. ఈ నూతన రూపాంతరము నాకు కలిగిన తోడనే, నాలో దుస్స్వభావము పూర్తిగా ఉన్నదని గ్రహించాను. దశాధికంగా దుష్టుడనైనాను. నాలో అదివరకు ఉన్న దుస్స్వభావానికి బానిసనై పోయినాను. ఈ భావం ఆక్షణంలో నాలోక దిలాసా పుట్టించి, సారాయిమత్తువలె కైపెక్కించింది. నా చేతులను ముందుకు బాగా చాచి చూసుకున్నాను. తాజా శరీరం, తాజా అవయవములు సంప్రాప్తించి నందువల్ల, ఒకవిధమైన సరదా నాలో ఉద్భవించింది. ఈ రూపాంతర పరివర్తన మూలంగా నా ఆకారంపొట్టి తగ్గి నేను చాలా పొట్టివాడనై పోయినని నాకు హఠాత్తుగా స్ఫురించింది.

ఆనాటికి, నాగదిలో నిలువుటద్దం లేదు. ఈ ఉత్తరం నేను వ్రాయుచున్ననాటికి నాగదిలో నా ప్రక్కనున్న నిలువుటద్దము, కొలది దినముల తర్వాత, నా రూపాంతర పరివర్తనములను నేను చూచుకొనుచుండుటకై తెప్పించబడినట్టిది. రాత్రి చాలా ప్రొద్దు గడచింది. వేకువజాము సమీపించే సమయామైంది. సూర్యోదయం కాబోయే ఘడియలు సమీపిస్తు

న్నాయి. నాయింట్లో ఉండే నవ్వుకళ్ళు మంచి గాఢ నిద్రలో నిమగ్నులై యున్నారు. నాకడక గదివరకూ నా యీ కొత్తఅవతారంలో నడచిపోన్నటకు విజయోత్సాహంతో సాహసించాను. పెరటిజాగాను దాటి వెళ్లాను. పైన ఆకాశంలో ఉన్న నక్షత్రరాసులున్నీ నన్ను చాలా లోకువగా క్రిందుగా చూచాయి. అప్రమత్తతో అతి జాగరూకతతో మిణుకుమిణుకు మనేడి ఆతార కాగణము ఇదివర కెన్నడూ చూచి ఎరుంగని క్రొత్త దేహధారిని నేనని నాలో నేను ఉప్పొంగిపోయినాను. నాయింటికి నేనే పరాయివాడనై వసారాలలో రహస్యంగా తిరిగాను. నాగదిలోకి ప్రప్రథమంగా యీ క్రొత్తరూపంలో ప్రవేశించి, ఎడ్వర్డు హైడ్ రూపం నాకు అబ్బినదని తొట్టతొలిగా చూచుకొన్నాను.

ఇక నేను తత్వసిద్ధాంతభాగం కొంత వివరించవలసి యున్నది. నాకు స్థిరనిర్ణయంగా తెలిసిన విషయములు కావివి.—కాని, ఏ అంశములు బహుశః స్థిరసత్యములై యుండవచ్చునని నేను ఊహించుచున్నానో, అట్టివానినే యిప్పుడిక్కడ వివరించుచున్నాను. నాలో ఉన్నటువంటి దుస్స్వభావమునే యిప్పుడు ప్రబలంచేసి ప్రత్యేకరూపంలో మూర్తీభవింపజేశాను. నాలో ఉన్నటువంటి సత్స్వభావమునకు నాలో ఉపాధిగాని స్థావరంగాని లేకుండా తొలగించాను. నాలోఉన్న సత్స్వభావంకంటె యీ

దుస్స్వభావం తక్కువ పటిమ, తక్కువ పెంపు గలదై యున్నది. నాజీవితం విశేషంగా పదింట తొమ్మిది పాళ్లు నిరంతరసాధకం, సత్ప్రవర్తన, మనోనిగ్రహంతో కూడినదై యుండెను. అటువంటి జీవితంలో నా దుస్స్వభావం అనేది చాలా తక్కువ సాధకం, తక్కువ ఆచరణానుష్ఠానం కలదై యుండుటవల్లనూ ఎక్కువ నిరసస్థితిలో నుండుటవల్లనూ, ఎడ్వర్డుహైడ్ రూపంలో అది మూర్తిభవించేసరికి, ఎడ్వర్డు హైడ్ యొక్క విగ్రహం చిన్నదై, లఘువై, హెన్రీ జెకిల్ కంటె ఎడ్వర్డుహైడ్ చిన్న వయస్కుడుగా తయారైనాడు. హెన్రీ జెకిల్ ముఖారవిందంలో సత్స్వభావం ప్రకాశిస్తూఉన్నవిధంగానే, దుస్స్వభావం అనేది రెండో మూర్తి ముఖంమీద లిఖింపబడినట్లుగా అక్షరాలా కన్పిస్తూ ఉండేది. దుస్స్వభావం అనేది ప్రాణాంతకమైనది. అటువంటి దుస్స్వభావం యీ హైడ్ ఆకృతిని వికృతంచేసి, కృంగి కృశించేటట్లు చేసింది. అటువంటి ఆకారమూర్తిని నిలువుటద్దములో నేను చూచుకొన్నప్పుడు, నాకు రోత ఏమీ కలుగలేదు. ఆ మూర్తికి స్వాగతమిచ్చేడి హర్షం నాలో కలిగింది. ఈ మూర్తి కూడా నాదే. అదికూడా నా సహజప్రకృతియే. అది కూడా నా మానవత్వమే. అసంపూర్ణ విభిన్న ద్వంద్వప్రకృతి నాలో యింతవరకూ ఉండి, అది నా ముఖంలో కన్పిస్తూ ఉండేది. ఈ ముఖవైఖరియే నాకు చిరపరిచితమై, ఈ ముఖమునుబట్టియే నన్ను నేను

గుర్తించుకుంటూ వచ్చాను. అటువంటి విభిన్న ప్రకృతిని ప్రతిబింబించెడి ముఖవిలాసంకంటె, యీ క్రొత్త అవతారములో నా అంతరంగం ఎక్కువ జీవకళతో ఉండె. ఏదో ఒక్క ప్రకృతియే విస్పష్టంగా ముఖములో తాండవిస్తోంది. ఇంతమేరకు నేను చేసిన తత్వవిచారణ సవ్యంగానే ఉంది. నేను ఎడ్వర్డు హైడ్ రూపంలో ఉన్నప్పుడు నా అవయవ నిర్మాణం చూచినవారు తొలుత నన్ను గూర్చి అనుమానించక మానరు. నా బుద్ధికి తోచినంతవరకూ, అందుకు గల కారణ మేమిటంటే, మనకు యీ లోకంలో తటస్థపడే మనుష్యులందరూ సత్స్వభావం దుస్స్వభావం రెండూ సమ్మిళితమైన ప్రకృతికలవారే. కాని, మానవకోటి అంతటిలోనూ ఎడ్వర్డు హైడ్ అనేవాడొక్కడు మాత్రమే కల్తీలేని దుస్స్వభావం కలవాడు.

సింహద్వారంవద్ద నేనొకక్షణం నిలుచబడ్డాను. అసలు అంత్యసారాంశమును త్వరగా రెండవసారి శోధన నేనింకా చేయవలసియే యున్నది. నా నిజ స్వరూపమును నేను తిరిగీ పొందుటకు వీలులేకుండా పోగొట్టుకున్నానా? నాది ఇకముందు కాజాలనట్టి యీ యింటిలోనుంచి నేను పారిపోవలసినదేనా? తొందర తొందరగా నా కచ్చేరీ గదిలోనికి వెళ్ళి, ఆమందుచే మరొక మోతాదు తయారుచేసి గిన్నెడు మందును తిరిగి త్రాగివేశాను. తిరిగి నాకు రూపాంతర పరివర్తనా వేదన ప్రారంభమైంది. తిరిగీ హెన్రీ జెకిల్

ముఖంతో, ఆకారంతో, విగ్రహంతో, స్వభావ లక్షణములతో నేను యథాస్థితికి వచ్చాను.

ఆరాత్రి నాస్థితి ఎట్లా ఉంటుందంటే నేను వేసే నుందడుగులో, నా సోపానపటంలో, అటు నిచ్చెన యిటు పాము అన్నట్లుంది. నేనుయీ నూతన పరిశోధనలను ఎక్కువ ఉదారాశయములతో సాగించి యుండినట్లయితే, పుణ్యచింతతో పరోపకార చింతతో నే నీపరిశోధనలకు సాహసించి యుండినట్లయితే; కథంతా మరొకవిధంగా జరిగేది. ఇటు వంటి రూపాంతర జననమరణ వేదనమూలంగా చిట్టచివరకు నేనొక పిశాచముగా పరిణమించుటకు బదులు దేవతా రూపంతో పర్యవసానం పొందియుండెడి వాడను. నేను కనిపెట్టిన ఔషధమునకు విచక్షణాశక్తిలేదు. దానిలో దేవత్వముగాని, రాక్షసత్వముగాని ప్రత్యేకంగా ఏమీ లేదు. మన అంతరంగంలోని నైజ ప్రకృతిని ఆవరించి యున్న యీ బొందెను భేదించే గుణంమాత్రం దానికి ఉంది. మన అంతరంగంలో ఏ ప్రకృతి బంధితమై ఉంటే, ఆ ప్రకృతికి స్వేచ్ఛా విహారావకాశమును ఆ మందు కల్పిస్తుంది. నేను ఆ మందును పుచ్చుకొన్న ముహూర్తంలో నాయందు గల సత్స్వభావం మందగతిలో నిద్రపోతూ ఉంది. నాలోఉండిన దుస్స్వభావం ఆ ఘడియలో బాగా చురుకుగా ప్రకోపించి, నాపరిశోధనాఫలితముల ప్రభావం చూడవలెననే ఆశతో ప్రజ్వలించి ఉంది. అందువల్ల ఆసమయంలో

నాలోనుంచి ఆవిర్భవించినమూర్తి ఎడ్వర్డ్ హైడ్ - నాకిప్పుడు రెండుమూర్తులూ, రెండు తత్వాలూ ఉన్నప్పటికీ, అందులో ఒకటి పూర్తిగా దుస్స్వభావ పూరితం అయిఉన్నది. రెండవమూర్తి అసలు హెన్రీ జెకిల్ యొక్క మూర్తియై యున్నది. ఈ రెండవమూర్తి ఒక అసంబద్ధమైన మిశ్రమస్వభావప్రకృతి - దానిని సంస్కరించవలెనని చాలా అవస్థపడి చివరకు నిరాశ జెంది ఆపని విరమించాను. అందువల్ల నాకిప్పి, నా ఉద్యమం అంతా, అధోగతికే దారిచూపింది.

ఆ దినాలలోకూడా, విద్యాభ్యాసంగమూ, చదువూ అంటే నాకు తలనొప్పిగా అయిష్టంగానే ఉంటూ ఉండేది ఈ గ్రంథపఠన విముఖత్వమును నేను జయించలేదు. తరచు విలాసంగా కాలం గడపుటకే ఉత్సాహపడుతూ ఉండేవాడిని. నామనస్సు కోరెడి సరదాలన్నీ పరువు మర్యాద శూన్యమైనవి. నేను పదిమందిలో చాలా గౌరవింపబడుతూ, పేరు ప్రసిద్ధిపొందినవాడ నగుటచేతనూ, వయస్సులో పెరిగి పెద్దవాడ నగుచుండుట చేతనూ, నాప్రవర్తనలోని అంతర్గత బహిర్గత స్వభావములకుగల విరుద్ధలక్షణం నానాటికి మరింత అయోగ్యమై అసహ్యమై పోతోంది. ఈ దుష్టప్రకృతి ప్రభావమును రుచిచూడవలెననే ఉల్లాసాతోనే, నేనీ క్రొత్త ఔషధ ప్రభావమును శక్తిని పరిశోధించిచూచాను. అందువల్ల నేను ఆదుస్స్వభావానికి బానిసనైపోయినాను. పేరు ప్రఖ్యాతి పొందిన ప్రొఫె

నరుని యొక్క అవతారమూర్తిని విసర్జించి, ఎడ్వర్డు హైడ్ యొక్క ఆకారమూర్తిని ఒక పెద్ద బురఖావలె తగిలించుకొని విహరించేనిమిత్తమై, ఒక గిన్నెడు మందు త్రాగితే చాలు. ఈ పరిణామ విచిత్రం చూచి నాలో నేనే నవ్వుకొన్నాను. అప్పట్లో నాకిది నవ్వులాటపనిగా ఉండేది. ఈ కామరూప కలాపమునకు కావలసిన ఏర్పాట్లన్నియు అత్యంతశ్రద్ధతో చేశాను. సోహో చౌకులో ఏయింటివద్దకు పోలీసువారు హైడ్ కొరకై వెతకుచూ వచ్చియుండిరో, ఆయింటిని నేను కొని, దానికి కావలసిన మేజాసామగ్రులనన్నింటిని అమర్చినాను. ఎప్పుడూ మూగనోము పట్టినట్లుగా మౌనంగా ఉండి, ఏ పాడుపనికైనా సంకోచించనటువంటి ఒక మనిషిని ఆయింటికి కావలాదారుగా ఏర్పాటు చేశాను. ఇక నా రెండోవైపు ఇంటిలో, నాయింటి నవుకర్లందరికీ ముందుగానే హెచ్చరిక చేశాను. నేను నామకరణం చేసినటువంటి హైడ్ అనేవాడు ఆచౌకులో నాయింటియందు స్వేచ్ఛగా విహరించుటకు ఏవిధమైన అభ్యంతరములను కల్పించకూడదని నా నవుకర్లకు తెలియజేశాను. ఏమైనా అఘాయిత్యాలూ, అవాంతరాలూ అజ్ఞానంచేత కలుగునేమో అనే భయంచేత, నన్ను నేనే యీ రెండో ఆకారంలో నలుగురికీ చిరపరిచితుణ్ణిగా చేసికొన్నాను. అటుపిమ్మట, నీవు ఆక్షేపించినట్టి వీలునామాను తయారుచేశాను. ఎందుచేతనంటే, డాక్టర్ జెకిల్ ఆకారంలో ఉన్నటువంటి నాకు

ఏమైనా ముప్పు తటస్థించినట్లయితే, ఏవిధమైన సొత్తు నష్టమూ లేకుండా ఎడ్వర్డ్ హైడ్ పేరుతో నా ఆస్తికి నేను కర్తను కానవచ్చు. ఈవిధంగా సర్వతోముఖమైన బందోబస్తులు చేసికొని, నాకు ఉన్నటువంటి గౌరవ హోదాం, ప్రయోజన లాభంకూడా పొందగలిగినాను.

ఇంతకాలంనుంచీ ఎవరైనా పెద్ద మనుష్యులు పెద్ద నేరాలను జరిపించవలెనంటే, కొందరు అఘాయిత్యాలను సాహసులను ఆ పనికి నియమించి జరిపిస్తూ వచ్చారు. తాము మాత్రము ఏవిధమైన అపఖ్యాతి లేకుండా దాగిఉండేవారు. కాని, సొంత సరదాకోసం అటువంటి ఘోర నేరములను స్వయంగా చేసినవాణ్ణి తొట్టతొలిగా నేనే.

లోకదృష్టిలో చాలా సదయహృదయుడనని పించుకొని గొప్ప గౌరవంతో బ్రతుకుచున్న నేను, ఒక్క క్షణంలో, బడిపిల్లవాడు తన పుస్తకాలు గిస్తకాలు అవతల పారవేసి, ఆటల్లోకి దిగినట్లుగా, స్వైరవిహారప్రవృత్తిలోకి దిగగల్గినవాడిని మొట్టమొదట నేనే. నాకై నేను కల్పించుకున్న ఆకారమూర్తి అభేద్యమైనదగుటవల్ల నా భద్రతకేమీ లోటులేదు. నాకొక శరీరం అనే ఉపాధి లేనేలేదనుకోండి. అప్పుడు కథంతా ఎట్లా ఉంటుందో యోచించండి. ఒక్కసారి నా పరిశోధనాగారంలోనికి నన్ను వెళ్ళనిస్తే ఒకటి రెండు క్షణాలు నాకు వ్యవధియిస్తే, అక్కడ సదా సిద్ధంగా ఉండే మందు మోతాదును తాగనిస్తే,

ఎడ్వర్డ్ హైడ్ అనేవాడు ఏవిధమైన దుర్మార్గములను చేసియుండినప్పటికీ, హుష్! మహాకాళీ అన్నట్లుగా ఎడ్వర్డ్ హైడ్ అనేవాడు అంతర్ధానమైపోతాడు అతపడ్డానే నవ్వంగా స్వగృహంలో తన పఠనమందిరంలో దీపపువత్తిని చక్కజేస్తూ, లోకుల అనుమానాలనుమాంచి తనలో తాను నవ్వుకుంటూ, హెన్రీ జెకిల్ ప్రత్యక్షమవుతాడు.

నా మారురూపంలో నేను సరదా పడిన వినోదకృత్యములన్నియు, యింతకుపూర్వము సూచించినట్లుగా, కేవలం అప్రతిష్ఠపనులు—అంతకంటె పరుషంగా నేను వాటిని నిర్వచించలేను. కాని, ఎడ్వర్డ్ హైడ్ ద్వారా యీ పనులు జరగడం సంభవించేసరికి, అవి కేవలము రాక్షసకృత్యములైనాయి. ఈ సాహసకార్యములను నేను నిర్వర్తించి తిరిగి వచ్చిన తర్వాత, యీ మారురూపంలో నేను చేసిన ఘాతుకములకు నేనే ఆశ్చర్యపడ్డాను. నా అంతరాత్మలో నుంచి నేను ఆవిర్భవింపజేసినటువంటి యీ పరిచిత వ్యక్తిని అతని యిష్టానుసారం యథేచ్ఛగా విహరించి వ్యవహరించుటకు విడిచి పెట్టాను. ఈ వ్యక్తి ఉద్భవించడమే దుష్టుడై పరమ పాషండుడై ఉద్భవించాడు. అతడు చేసే ప్రతిపని, అతని మనస్సులోని ప్రతి ఊహ స్వలాభానికి స్వప్రయోజనానికి మాత్రమే సంబంధించినదై ఉంటుంది. మరొకరిని ఎటువంటి క్రూరహింసలకైనా పాల్పడజేసి అడవిమృగంలాగున

ఆనందిస్తాడు. దయారసంలేని మొండిరాతిగుండె— ఎడ్వర్డు హైడ్ చేసే దురాగతములను తలపోసి, హెన్రీ జెకిల్ నిర్ఘాంతపోయేవాడు. కాని, యీ దుర్మార్గము లన్నియూ సాధారణ న్యాయచట్టములకు అతీతమైన పనులు. అందువల్ల అవి నా అంతరాత్మను అంతగా బాధించేవి కావు. అటువంటి దుష్కార్యములను చేసిన నేరస్థుడు హైడ్. ఆ నేరములకు హైడ్ మాత్రమే బాధ్యుడు. కాని జెకిల్ ఏమంత తీసిపోయినవాడు కాడు. జెకిల్ మరల సద్గుణమూర్తిగా తన ఉపాధి లోకి తాను వచ్చాడు. తాను హైడ్ గా ఉండి చేసిన దుర్మార్గములకు కించిత్తయినా పరితపించని అంతరాత్మతో జెకిల్ తిరిగి యథాపూర్వస్థితిలో సిద్ధమైనాడు. హైడ్ చేసిన దుర్మార్గములకు, సాధ్యమైన సందర్భములలో, తగిన పరిహారం సమర్పించి బాధితుల కష్టనష్టములను తొలగించుటకై జెకిల్ సత్వరంగా పూనుకొంటూ ఉండేవాడు. ఈవిధముగా జెకిల్ యొక్క అంతరాత్మ మత్తుమందు జల్లినట్టుగా, మన్ను తిన్న పామువలె, నిద్రాణంగా ఉంది. ఏవో అప్రతిష్ఠ పనులు జరుగుతూ ఉంటే నేను చూస్తూ ఊరుకున్నానో వానినన్నింటినీ ఇక్కడ పూసగుచ్చినట్లుగా వివరింప దలంచుకోలేదు. ఆ దుర్మార్గములను చేసినది నేనే అని యిప్పుడుకూడా అంగీకరింపజాలను. కాని ఏవిధమైన ఘట్టపరంపరలతో, ఏవిధమైన భావి సూచక హెచ్చరికలతో, నా స్వయంకృతాపరాధ

శిక్షను నేను అనుభవించవలసివచ్చెనో వివరింపదలంచు
కున్నాను. ఒకసారి ప్రమాదకర సంఘటన సంభవిం
చింది. దానివల్ల కలిగిన దారుణ ఫలిత పర్యవసానం
ఏమీ లేదు కనుక దానిని నామమాత్రంగా ఉదాహ
రించి వదిలివేస్తాను. ఒక బిడ్డ విషయములో చాలా
క్రూరంగా ప్రవర్తించియుండుటవల్ల దారిమార్గంగా
పోతూఉన్న ఒక బాటసారికి నాపైన ఆగ్రహం కలి
గింది. ఆ పెద్దమనిషి నీకు జ్ఞాతియును బంధువనియు
ఇటీవల నాకు తెలిసింది. ఆ బిడ్డ కుటుంబస్థులును, ఒక
డాక్టరున్నూ, ఆ మార్గస్థునితో ఏకమైనారు. నా ప్రాణం
మీదకు ఏమైనా వస్తుందని నేను భయపడిన సంద
ర్భములుకూడా ఉన్నాయి. వారి ఆగ్రహావేశమును
శాంతింపజేయుటకుగాను, ఎడ్వర్డ్ హైడ్ తన యింటి
గుమ్మంవద్దకు వారిని తీసికొనివచ్చి హెన్రీ జెకిల్ సంత
కంతో ఒక చెక్కును (బ్యాంకుహుండీని) వ్రాసియిచ్చి
వారికి పైకం చెల్లించవలసివచ్చినది. కాని, యీవిధంగా
మారుపేరుతో చెక్కులను ఇవ్వటయనేది ప్రమాదం
అటువిమ్మట తిరిగి సంభవించకుండుటకై ఎడ్వర్డ్ హైడ్
పేరుతోనే మరొక బ్యాంకులో ఖాతా ఏర్పాటు చేశాను.
నా దస్తూరీ అక్షరములనే వెనుకవైపుకు ఏటవాలుగా
వంచి వ్రాయుటమూలంగా, నా రెండో అవతారానికి
కావలసిన వేరొక దస్తూరిలో నేను సంతకమును చేయ
గల్గితిని. ఈవిధంగా నాదస్తూరీని మార్చడం మూలంగా

బ్రహ్మ రుద్రాదులకు కూడా నేను పట్టుపడకుండా తప్పించుకోగలనని నిశ్చయించాను.

సర్ డన్వర్సు గారి హత్య జరుగుటకు రెండు మాసాలు ముందుగా, ఒకనాడు, నా సాహస విహారాలకై నేను బయటకు వెళ్లియుంటిని. రాత్రి చాలా ప్రొద్దుపోయిన తర్వాత యింటికి వచ్చాను. మరునాడు నేను పడకనుంచి లేచేసరికి నా కొక వింత స్ఫూర్తి, వింత స్పృహ కలిగింది. నా చుట్టుప్రక్కల పరికించి చూచాను. కాని, ప్రయోజనం లేకపోయింది చౌకు వద్ద గదియొక్క భారీసైజు కొల్లలను అందలి మేజా సామానులను పరికించి చూచాను. కాని, ప్రయోజనం లేకపోయింది. అక్కడ ఉండే మంచం తెరలను, చంద్రడపు చెక్క చట్రమును చూచి గుర్తుపట్టినాను. నేను ఉండవలసిన ప్రదేశములో నేను లేను అని నాకేదో గుద్ది చెప్పినట్లయింది. ఎడ్వర్డు హైడ్ రూపంలో ఉండేటప్పుడు నేను ఏగదిలో నిద్రించుటకు అలవాటు పడినానో ఆ గదిలో నే— సోహో చౌకులోని ఆ గదిలో నే— నేను ఉన్నాననిన్నీ, నేను అనుకొన్న గదిలో నేను నిద్ర మేలుకోలేదనిన్నీ గ్రహించాను. నాలో నేనే ఆత్మవిమర్శతో అంతర్గతంగా నవ్వుకొన్నాను. ఈ భ్రాంతికిగల సందర్భ కారణములను విమర్శించుకొంటూ మైకంగా కూర్చున్నాను. అటువంటి జిజ్ఞాసావస్థలో సాధారణంగా తెల్లవారిన తర్వాత నిద్ర మత్తుతో కునికిపాట్లు పడుతూ ఉండడం నాకు పరిపాటి.

నాకు బాగా మెలకువవచ్చి జాగ్రదవస్థలోకి వచ్చినప్పుడు నా చేయి నేను పరిశీలనగా చూడడం తటస్థించింది. (మీరిదివరలో తరచు వర్ణిస్తూ ఉండినవిధంగా నే) హెన్రీ జెకిల్ యొక్క హస్తము అతని వ్యక్తికి తగిన తీరుగా భారీగా ఉంటుంది. అది కండపుష్టి కలది. పెద్దది. తెల్లని తెలుపురంగు కలది. పసందైన చేయి అది. కాని నా కంటికి యిప్పుడు కన్పించిన యీ చేతిని, లండను నగర మధ్యభాగంలోని ఆ ఉదయం పూట, బంగారు నీరెండ కాంతిలో, సగం కప్పబడియున్న నా పడక గుడ్డల మధ్యనుంచి స్పష్టంగా చూచాను. ఆ చేయి చాలా సన్నంగా ఉంది. నరాలు పైకి ఉబ్బి ఉన్నాయి ముడ్లు పడినట్లున్నాయి పొగమారిన రంగుగా ఉంది. చేతి నిండా వెండ్రుకలు గుబురుగా మొలచి ఉన్నాయి. అది స్పష్టంగా ఎడ్వర్డ్ హైడ్ చెయ్యి నేను విస్మయాశ్చర్యములతో అదేపనిగా నిదానంగా ఒక అర నిమిషం సేపు దానితీరు చూస్తుండేవాడినే. కాని, ఒక భయం నాగుండెలో తాళాలు మ్రోగినట్లుగా మ్రోగి, నన్ను హెచ్చరించింది. వెంటనే నా పడకమీదనుంచి లేచి నిలువుటద్దంవద్దకు వెళ్లాను. ఈ అద్దంలో నాకండ్లకు కట్టినట్లుగా కన్పించినదంతా నేను చూచుకొనేసరికి, నేను నిలువున నీరై పోయినాను. అవును. నేను రాత్రి పరున్నప్పుడు హెన్రీ జెకిల్ అవతారంలోనే నిద్రపోయినాను. కాని, నిద్ర లేచేసరికి ఎడ్వర్డ్ హైడ్ అవతారంలో నిద్ర లేచాను. ఇది ఎట్లా సంభవించింది?

అప్పటికే బాగా తెల్లవారిపోయింది. ఇంట్లో నవుకర్లు అందరూ లేచి తిరుగుతున్నారు. నా మందులన్నీ నా కచ్చేరీగదిలో ఉన్నాయి. అక్కడికి నేను పోవాలంటే, రెండు మెట్లవరుసలు దాటి, వెనుకవైపు త్రోవ గుండా, పెరటి ఖాళీ జాగా గుండా, శరీరశాస్త్ర పరిశోధనశాలగుండా పోవాలి. అక్కడినుంచి నేను చాలా నివ్వెరగపడి చూస్తూ నిలబడి పోయినాను. నా ముఖమును నేను కప్పుకొని పోవచ్చు. నిజమే. కాని, నా ఆకారంలో కలిగిన యీ మార్పును నేను రహస్యంగా కప్పిపుచ్చుటకు వీలు లేనప్పుడు ముఖాన్ని కప్పుకొన్నందువల్ల ప్రయోజనమేమిటి? అయితే, నా రెండో అవతారమూర్తి వస్తూ పోతూ ఉండడం నా నవుకర్లకు యిదివరకే చిరపరిచితమై యున్నది. ఈ సమయం నా మనస్సుకు స్ఫురించేసరికి నా మనస్సు కొంచెం తెప్పరిల్లింది. నా సైజుకు సరిపడే దుస్తులతోనే నేను వీలైనంత వేగంగా ముస్తాబు చేసికొన్నాను — నేను ఆ ఇంటిలో నడచిపోతూఉంటే, నా నవుకరు బ్రాడ్షా నన్ను అక్కడ చూచాడు. ఇటువంటి వింతదుస్తులతో, ఇట్టి వేళయందు యింటిలోకి హైడ్ రావడం చూచి, బ్రాడ్షా నావంక తేరి పారజూచి కొంచెం వెనుకడుగు వేశాడు. అటుపిమ్మట పది నిముషములైనపిమ్మట డక్టరు జెకిల్ తన స్వస్వరూపాన్ని తాను పొంది, తన నొసలు చిట్లిస్తూ,

ప్రాతఃకాల భోజనం చేస్తున్న వైఖరిలో నటిస్తూ నేను కూర్చున్నాను.

నాకు ఆకలిమాత్రం బహు కొద్దిగా ఉంది. ఆనాడు నాకు కలిగిన అనుభవం అనగా, నా పరివర్తన సూత్రం తల్లక్రిందులై పోవడం అర్థంకాని అక్షరగోడవగా ఉంది. నాకు మనుష్య యమదండన, గోడమీద లిఖించి చూపినట్లుగా, యీ అనుభవంవల్ల భయంకరంగా నాకు గోచరించింది. నా ఉపాధిద్వయమునుగూర్చియు, దాని సాధక బాధకములనుగూర్చియు, పూర్వంకంటె యిప్పుడెక్కువ తీవ్రంగా నేను పర్యాలోచించుటకు ప్రారంభించాను నాలో అంతర్గతమైన ఏ దుస్స్వభావమును నేను ప్రత్యేక రూపంలో పరిస్ఫుటం చేయగల్గుతున్నానో, ఆ దుస్స్వభావం యిటీవల ఎక్కువ తరచుగా మూర్తీభవించి ఎక్కువ సాధకంలో ఉండుటవల్లను, అది ఎక్కువ ప్రోత్సహింపబడి పోషింపబడిన దగుటవల్లను, ఇటీవల ఎడ్వర్డు హైడ్ యొక్క మూర్తి పెరిగి పెంపొందినట్లుగా (ఆ మూర్తిని నేను తాల్చినప్పుడు) నాకు కన్పించింది. నా రక్తంలోనే ఒక ఉద్ధృతం విస్తృతం కలిగినట్లుగా నేను గ్రహించాను. ఈవిధమైన అవతార పరివర్తనమును ఇంకా మరి కొంత దీర్ఘకాలం నేను సాధకం చేసినట్లయితే, నాలో ఉన్న రెండుప్రకృతులయొక్క హెచ్చు తగ్గుల తక్కెడ తల్లక్రిందులై ఆ తారుమారే స్థిరస్థాయిగా ఉండగల

దనెడి ప్రమాదం నేను పసిగట్టితిని. అట్టి స్థితిలో యథేష్టంగా స్వసంకల్పానుసారంగా నా మూర్తిని నేను మార్చుకో గల శక్తి నాకు లేకుండ పోతుంది ఎడ్వర్డు హైడ్ యొక్క ప్రకృతిస్వభావమే శాశ్వతంగా నాకు స్థిరపడి పోగలదు. నా ఔషధప్రభావం ఏకరీతిగా పనిచేయడం లేదు ఆరంభదశలో ఒకసారి, ఆ ముందు నాకు పనిచేయనేలేదు. అందువల్ల అది మొదలుగా నా ఔషధపుమోతాదును నేను రెండింతలు చేసి వాడవలసి వచ్చింది. ఒకపర్యాయము, నా ప్రాణంమీదకు ఉపద్రవం తెచ్చిపెట్టుకొనుటకైనా సిద్ధపడి, యీ ఔషధపు మోతాదును మూడురెట్లుగా హెచ్చించి సేవించవలసి వచ్చింది నా ఆకారపు పరివర్తనమును ఎవ్వరూ గుర్తు పట్టలేరనే నమ్మికవల్ల, కొంత ఆత్మధైర్యం నాకు లీలగా యింతవరకూ ఉంటూవుండె. ఇప్పుడీమందు మోతాదుయొక్క ప్రభావం అనిశ్చయం అయిపోతూవుండడంవల్ల, నాకు లీలగా ఉంటున్న ఆత్మధైర్యంకూడ తొలగిపోయింది. ఆనాడు నాకు కలిగిన యీ ఆకస్మికానుభవ విశేషమూలంగా నేనొక విషయం గమనించవలసి వచ్చింది. డాక్టరు జెకిల్ యొక్క మూర్తిని మరొక మూర్తిలోనికి మార్పు చేసి అవస్థాభేదం పొందడం ఎట్లనేదిమాత్రమే యింతవరకూ నా మనస్సును బాధించిన సమస్య. కాని, యిప్పుడ సమస్య తలక్రిందులై యిటునుంచి అటు తిరిగింది. నా ప్రస్తుత పరిస్థితులన్నియు యీ క్రింది

పర్యవసానంలోకి వచ్చాయి. నాలో ఉన్న సాత్త్వ భావంమీద నాకు పట్టు తప్పిపోతోంది. నాలో ఉన్న రెండవప్రకృతి యగు దాస్యభావంతో నేను క్రమ క్రమంగా లీనమైపోతున్నాను.

ఈ రెండు భిన్నప్రకృతులలో ఏదో ఒకదానిని నేనిప్పు డభిమానించి వరించవలసివచ్చింది. నా యొక్క రెండు ప్రకృతులకున్నూ సమానంగా వర్తించుచున్న అనుబంధ సూత్రం ఏదంటే, నాకు గల జ్ఞాపకశక్తి-నా పూర్వస్మృతి - జెకిల్ తత్వం అనేది రెండు ప్రకృతులూ కలిసిన ద్వంద్వప్రకృతి. ఈ జెకిల్‌కు మధ్యమధ్య చాలా సున్నితమైన ధర్మమీమాంసలూ భయసందేహాలు కలుగుతూ ఉంటాయి. అప్పు డప్పుడు విరహతాపం పుట్టినట్లుగా హైడ్ రూపం ధరించి అట్టి అవతారంలో అనేకములైన అద్భుత కార్యాలూ, అతి సాహసకార్యాలూ చేయాలనే దిలాసా కల్గుతూ ఉంటుంది. జెకిల్ గతి ఏమైతే నాకేమి అనే నిర్లక్ష్యభావం హైడ్‌కు ఉంది. కాని, బందిపోటు దొంగవాడు ఎవరికీ పట్టుపడకుండా ఏ కొండగుహాలో తలదాచుకుంటాడో, ఆ కొండ గుహను మాత్రము సదా స్మరించుకుంటూ ఉంటాడు. అదేవిధంగా తనకు జెకిల్ శరణ్యమని మాత్రము హైడ్ స్మరిస్తాడు. జెకిల్‌కు హైడ్ విషయములో పితృవాత్సల్యానికంటె ఎక్కువైన వాత్సల్యం ఉంది. పుత్రునకు తండ్రియెడల ఉండే నిర్లక్ష్యంకంటె

ధైర్యాన్ని నిర్లక్ష్యం జెకిల్ మొహంలో ఉంది. జెకిల్ అవతారంలోనే స్థిరంగా ఉండిపోదామా అనుకుంటే, ఇంతకాలంనుంచి నేను రహస్యంగా తీర్చుకొన్న నా సరదాలను అన్నింటినీ చంపుకోవడం అవుతుంది. ఈ సరదాలను ఇటీవల నేను పాలుపోసి పెంచినట్లుగా ముద్దుపడి పెంపుచేసుకొన్నాను. స్థిరంగా హైడ్ అవతారంలోనే ఉండిపోదామా అంటే, అనేక స్వప్రయోజనలాభములను ఉన్నతాశయములను చంపుకొని, ఒక్క దెబ్బలో సదా శాశ్వతంగా లోకకంటకుణ్ణై, మిత్రుడనేవాడు లేకుండా బ్రతుకవలసివస్తుంది. ఈవిధంగా ఉభయపక్షములలో ఏదో ఒకటి నిర్ణయించుకొని బేరం ఫయిసలు చేసికోవలెనంటే ఈ ఉభయపక్షాలూ సముజ్జీలుగా లేవని కన్పిస్తూ ఉంది. ఈ బేరసార్లలో మరొక విషయం గమనించవలసి యున్నది. జెకిల్‌కు అనేక మనోనిగ్రహాలు ఉండటం చేత, ఈ మనోనిగ్రహము లనెడి పంచాగ్నుల మధ్య మనోవేదనపడుతూ ఉంటాడు. కాని, హైడ్‌కు ఏది ఎట్లా పోయినా ఎంతపోయినా దాని స్మరణకూడా ఉండదు. నా ప్రస్తుత విపరీతావస్థలో యిప్పుడు ఏర్పడిన యీ ఆత్మవితర్కము మానవుడు పుట్టినప్పటినుంచీ ఉన్నటువంటి అనాది సిద్ధమైన ఆత్మవిచారణయే. పాపకార్యధోరణిలో పడ్డ, మధ్యమధ్య భయంతో వణుకుతూ ఉండేటటువంటి వ్యసన

పీడితుడైన పాపిని, వ్యసనవ్యామోహం ఆత్మభయం అనేవి అటూయిటూ లాగుతూ ఆఖరుకు ఒకవైపుకు యీడ్చుకొని పోతాయి. నావంటి సోదరమానవు లందరి విషయంలో సంభవించు విధంగానే నా విషయంలోకూడా జరిగింది. నాలో ఉన్న మంచి ప్రకృతిగుణ నాకు శ్రేయస్కరమని నేను గ్రహించి స్వీకరించాను. కాని, ఆ సత్స్వభావ ప్రకృతిని సదృఢంగా స్థిరంగా నిలువబెట్టుకొనలేక పోయినాను. అందుకొరకై కావలసిన సంకల్ప బలము నాయందు లోపించినది.

అప్పను. వయోవృద్ధుడైన డాక్టరు జెకిల్ అవతారంలోనే స్థిరంగా ఉండటం మంచిదని మనస్సులో కోరుకొన్నాను. ఈ డాక్టరు తన జీవితంలో అసంతృప్తుడు. కాని, మనసార మంచిమంచి కోరికలు పెట్టుకొని నిర్మలభకుడై, మిత్రబృందపరివేష్టితుడై, కాలక్షేపం చేయడం ఉత్తమం. కనుక హైడ్ అవతారం దాల్చి నేను అతి రహస్యంగా అనుభవించిన సరదాలకూ, అభినవ యౌవనోజ్వలశక్తికీ, నడక చలాకీకి, నిలుకడలేని నాడీవేగానికీ, స్వైరవిహారానికీ ఒక నమస్కారం అని స్థిరంగా నిశ్చయం చేసికొని స్వస్తిచెప్పాను. ఈనిర్ణయం చేసికొన్నప్పటికీ, అంతరాత్మలో ఆశపదో పూర్వజన్మ వాసనలాగున యింకా నాలో మిగిలియున్నది. ఎందుచేతనంటే, సోహోచౌకులో నేను ప్రత్యేకించియుంచిన యింటిని యింకా విడిచిపెట్ట

లేదు. ఎడ్వర్డు హైడ్ అవతారంలో చరించుటకై ఉద్దేశింపబడిన దుస్తులు యింకా నాగదిలోనే సదా సిద్ధంగా ఉన్నాయి. రెండుమాసాలవరకూ, నా సంకల్పమును నేను కొనసాగించాను. ఇదివరకెన్నడూ నా జన్మలో నేను అటువంటి మనోనిగ్రహం సాధకం చేయలేదు. అంతటి మహత్తర సాధకం చేశాను. అందుకు నేను పొందిన ఆత్మానందమే నా నిగ్రహానికి బహుమానం. హైడ్ అవతారధారణ విషయమై నేను పొందిన ఆత్మభయ వేదన మొట్టమొదట్లో తీవ్రంగా ఉండిగాని ఆ భయము యొక్క ఉధృతం క్రమేణా నాలో క్షీణించింది నా ప్రవర్తనను నా అంతరాత్మ హర్షించడంఅనేది పరిపాటి యగుటవల్ల దానిమీద గురికూడా పోయింది. హైడ్ అనేవాడు నాలోనే ఉండి, తన్ను విచ్చలవిడిగా విడిచి పెట్టవలెనని నన్ను పీడించుచున్న విధంగా, నాలోని కోరికలు తీగెలుసాగి ఆతీగెలు నన్నుబంధించి బాధిస్తున్నట్లుంది చిట్టచివరకు, నా నీతికీ నాకట్టుబాటుకూ నేనే నిలువబడలేకపోయినట్టి ఒక ఏమరుపాటు సమయంలో, తిరిగీ మరొకసారి నా కామరూపౌషధమును నేను తయారుచేసి త్రాగివేశాను.

త్రాగుబోతు అయినవాడు తన దుర్వ్యసన లక్షణమును గూర్చి తనలో తాను పలుమార్లు వితర్కించుకొనును. కాని తనకు ఒళ్లుతెలియని మృగప్రాయస్థితిలో తాను ఎటువంటి ప్రమాదావస్థల పాలు

కాగలిగాను ఆ విషయమై తలపోయడం, మనస్సులో బాధపడటం, అరుదుగా సంభవిస్తుంది. అనేకవందల పర్యాయములు ఆత్మవిచారణ చేస్తే అందులో ఏ ఒక్క పర్యాయమో అసలు మనస్సు ఆ రీతిగా బాధపడవచ్చు, నా పరిస్థితుల్ని గూర్చి తలపోసినప్పుడు నేను కూడా అదేవిధంగా వ్యవహరించాను ఎడ్వర్డ్ హైడ్ యొక్క ముఖ్య లక్షణము నిర్దాక్షిణ్య దుర్మార్గత్వమునిన్ని, ధర్మాపేక్షణా శూన్యత్వమునిన్ని నేను ఎరిగి యున్నప్పటికి, అందుకు తగిన బందోబస్తు నేనేమీ చేయలేదు. ఆ దుష్ప్రకృతి లక్షణాల మూలంగానే చిట్టచివరకు నా దండన నేను అనుభవించాను. నాలో ఉన్న దయ్యాన్ని నేను దీర్ఘకాలంగా బంధించి ఉంచాను అందువల్ల ఇక అది ఉండబట్టలేక గర్జన చేస్తూ కల్లు తెంపుకున్నది ఈ మందును యీసారి త్రాగినప్పుడే నేను అనుకొన్నాను. ఈసారి పట్టపగ్గం లేని అతిభీకరతరమైన దుర్మార్గత్వం నాలో విజృంభిస్తుందని అనుకొన్నాను. ఈ కారణం వల్లనే అనుకొంటాను ఆపుకోలేని అతి తొందర నాలో ఏర్పడింది. నాలోని నిపీడిత అభాగ్య ప్రకృతియొక్క కూత వినవచ్చినప్పుడు నేను ఆపుకోలేని అతి తొందర నాలో ఏర్పడింది. జాలిపుట్టించేటటువంటి అట్టి కారణ ప్రేరణం లో లో పల కల్గినప్పుడు, నియమస్పృహా భంగ దోషము ఎటువంటి మతిమంతునకైనా కలుగుతుంది—ఆదోషమునకు ఆ వ్యక్తి

బాధ్యుడు కాజాలడని భగవంతునియెదుట ప్రమాణం చేసి చెప్పగలను—ఆరోగ్యం సరిగ్గా లేక చికాకు పడుతున్న చేతిబిడ్డ తన చేతిలోని ఆటవస్తువును ఆగ్రహంతో పగులగొట్టుతుంది. నేనుకూడా అంతకంటె ఎక్కువ ఆవేశంతో ప్రవర్తించలేను. మనలో అధమస్థులైన వాళ్ళయందుకూడా కొందరు, ఎటువంటి వ్యామోహ విభ్రాంతులు కలిగినప్పటికీ, కొంతవరకు మనస్సును చిక్కబట్టి తొణకకుండ తిరుగుతారు. అటువంటి స్థిమితస్వధోరణినికూడా నేను బుద్ధిపూర్వకంగా విడనాడుకొన్నాను—ఇక నేను నా వ్యసన వ్యామోహంలో పడడం అంటే అధోగతిలో పడిపోవడమే.

త క్ష ణ మే నా లో రా క్ష సా వే శం ప్రజ్వలించి తాండవమాడినట్లయింది. నా కళ్ళకు కైపెక్కినట్లయింది. నన్ను ఎదిరించలేకుండా పడియున్న మనిషిని దెబ్బమీద దెబ్బకొట్టాను. అతనిని కొట్టిన ప్రతిదెబ్బకూ నేను చంకలు కొట్టుకున్నాను. కొంతసేపటికి నాకే ఆయాసంవచ్చింది. నా వెర్రి కైపు మిన్నుముట్టిన సమయంలో నాకు గుండెల్లో రాయి పడ్డట్టు ఝల్లుమన్నది. దానితో నాకొక మంచుతెర విడిపోయినట్లయింది. నా ప్రాణం ఇక నాకు దక్కదనిపించింది. ఆ ఘోర కిరాతకృత్య రంగంనుంచి పారిపోయినాను. నా ఘనకార్యానికి నాలో నేను గర్విస్తూ, వణికిపోతూ, నా ప్రాణంమీది తీపి అన్నింటికంటే ఎక్కువ ముఖ్యంగా చూచుకొని, పరుగెత్తాను. సోహో చౌకు

లోని నా యింటికి పరుగెత్తాను. (ప్రమాద భయం అనేది లేకుండా మరింత కట్టుదిట్టం చెయ్యాలం కోసం) నా తాలూకు కాగితాలు అన్నింటిని నేను ఆహుతి చేశాను. అప్పుడు నా మనస్సు రెండు విధము లైన ఉద్రేకాతిశయములతో ఉంది. ఆ ఉద్రేకావేశా లతోనే, నేను చేసిన ఘోరనేరానికి చంకలు కొట్టు కుంటూ, మరికొన్ని అఘాయిత్యాలు మున్ముందు చేయడానికి దిలాసాగా వ్యూహాలు ఊహిస్తూ, నన్ను పట్టి పగతీర్చుకోవాలని వెంటాడుతూ వచ్చే వాళ్ల అడుగుల చప్పుళ్ళకై చెవియొగ్గి ఆలకిస్తూ, పరు గెత్తుకొని వెళ్లాను. సరాసరిగా వచ్చి మందు తయారు చేసికొన్నాడు హైడ్ — ఆ మందు త్రాగేటప్పుడు హైడ్ తనకు తానే స్వస్తి పాడుకొన్నాడు. హతుడైనవానికి తోడిదిగో ఆహుతి అన్నట్లుగా ఆ మందును త్రాగివేశాడు. రూపాంతర పరివర్తన వేదనలు ప్రారంభమైనాయి ఈ పరివర్తనా వేదనలతో హైడ్ రూపం విచ్ఛిత్తి అయిపోయిందో లేదో, హెన్రి జెకిల్ పరితాపక్లిష్టతాభావ పరిపూరిత బాష్పలోచనుడై వినమ్రుడై మోకరించి చేతులెత్తి ఆ పరాత్పరునకు నమస్కరించాడు. దుర్వ్యసన వ్యామోహ సంభరిత స్వరూపము ఆపాదమస్తకము విచ్ఛిత్తయినది. నన్ను ఆవరించినమాయ తొలగ పోయినది—నా జీవితపటం అంతా నా కళ్ళముందర కట్టినట్లుగా కన్పించింది. నా బాల్యంలో నేను నా తండ్రితో చెట్టబట్టి షికారు

వెళ్ళినది మొదలుకొని, నేను డక్టరు వృత్తిలో స్వార్థ రహితంగా నిర్వర్తించిన కార్యభారములు సహా స్మరించాను. అవన్నీ స్వప్నలీలలుగా నాకు కన్పించాయి. ఆనాటి సాయంకాలసమయ ఘోర భీకర వాసనలు కూడా ఆ క్షణంలో నాకు మిధ్యాలీలలుగానే కనిపించాయి. నేను నిగ్గరగా ఏడ్చే వాడినే. నాకు అనేక భూయానకదృశ్యాలూ, ధ్వనులూ జ్ఞప్తికివచ్చాయి. నా మానస్సుకు అప్పుడు స్ఫురించిన వాని నన్నంటినీ, స్ఫురించ కూడా అణగద్రొక్క వేయుటకై బాహ్యధారల్లోనో, భగవత్ప్రార్థనల్లో చాలా ప్రయత్నించాను. ఆ సమయంలో నేను చేసి కొన్న మానసప్రబోధములమధ్య, నేను చేసిన మహా పాతక పెనుభూత వికారరూపము నా అంతరాత్మలో తొంగి తొంగి సాక్షాత్కరిస్తోంది. నాకు కలిగిన యీ ఆత్మపరితాపము యొక్క తీవ్రత క్రమేణ తగ్గిపోయినపిమ్మట, ఒకవిధమైన సంతోషం నన్ను ఆవేశించింది. నా ప్రవర్తనవల్ల ఏర్పడిన చిక్కు యిప్పుడు తొలగిపోయింది. ఇక హైడ్ అనే వాడు సాధ్యము కాడు. నాకు యిష్టమున్నా లేకపోయినా నా సత్ప్రవృత్తికి నేను కట్టుపడియున్నాను. ఆ మాట తలుచుకుంటే నాకెంతో ఆనందమైంది. నేను హైడ్ రూపంలో ఏ రహస్యద్వారంగుండా వెళ్లుతూ వస్తూ ఉండేవాడనో, ఆ ద్వారమునకు విశుద్ధ విరక్తితో

తాళం వేసి, తాళము చెవిని నా బూటు కాలి క్రింద వేసి త్రొక్కి విరుగగొట్టి వేశాను.

మరునాడు హత్యను గూర్చిన వార్తలు వచ్చాయి. ఈ హత్య జరుగుతూ ఉండగా పై నుంచి చూచిన వాళ్లు ఉన్నారనిన్నీ, హైడ్ అనేవాడే హంతకుడనిన్నీ లోకానికి విదితమైంది. చంపబడిన మనిషి ప్రజా గౌరవాన్ని గల ఘరానా మనిషి అని వెల్లడి అయింది. అది పెద్ద నేరం మాత్రమే కాదు. చాలా విషాదకరమైన బుద్ధిజాడ్యము—ఇదంతా యిప్పుడు నాకు తెలిసి వచ్చినందుకు నాలో నేను సంతోషించాను. నన్ను ఉరితీస్తారేమో అనే భయంతో నా సద్గుణ ప్రవృత్తిని నాలో నుంచి పారిపోకుండా కాపాడుకుంటున్నాను ఈ మృత్యు భీతిని దాని కెదురుగా బెదురుగా పోటీ పెట్టగలిగినందుకు నాలో నేనే సంతోషించాను. జెకిల్ అనే మూర్తి నాకిప్పుడు దుర్గమశరణ్యాం అయింది. హైడ్ అనే స్వరూపం బయటికి తొంగిచూచిందంటే చాలు. వానిని పట్టుకొని చంపి వేయడానికి ఎంతమంది చేతులో పైకి లేస్తాయి.

ఇకముందు నా ప్రవర్తన అంతా మార్చి వేసికొని, నా అపరాధములకు నేను ప్రాయశ్చిత్తం చేసికో దలంచినాను. ఈ రీతిగా నేను చేసికొన్న దృఢనిశ్చయం కొంతవరకు ఫలించిందని చెప్పగలను. గతసంవత్సరాంత్య మాసములందు కష్టజీవుల బాధలను తొలగించుటకై నేనెంతగా కృషి చేశానో మీకే తెలుసును.

నేను లోకహితార్థంగా చాలా పని చేశాను. ఆ దినములన్నియు ప్రశాంతంగా గడచిపోయినాయి. నా మనస్సుకు కూడా అప్పుడు హాయిగా ఉంది. ఈ విధమైన నిష్కపట, పరోపకార జీవితమును కొన్నాళ్లు గడపగా నాకు ఇట్టి జీవిత ధోరణిమీద విసుగుపుట్టిందని నేను చెప్పలేను. ఎందుచేతనంటే ఆవిధంగా కాలమును గడపుటవల్ల నా మనస్సు రోజురోజుకూ మరింత ఉల్లాసంగా ఉండేది. కాని నాలో ఉన్న ద్వంద్వప్రకృతి, నాకుగల భిన్నజీవితాభిలాషలూ నన్ను పీడిస్తూనే ఉన్నాయి. నాకు కలిగిన మనస్సంతాప దీప్తి తగ్గిపోయిన తర్వాత, నాలో యిటీవల అణగద్రొక్కి యుంచబడినట్టియు, అంతకుపూర్వము చిరకాలంగా యథేచ్ఛగా ప్రవర్తించినట్టియు, నాలోని నికృష్ట నీచప్రకృతి తిరిగి తనకు స్వేచ్ఛావకాశము కావాలని నాలో గుర్రుపెట్టడం సాగించింది. హైడ్ యొక్క మూర్తిని తిరిగి బయటికి తీసికొనిరావాలని నేను కలలోనైనా కోరడంలేదు. ఆ మాట మనస్సులో అనుకుంటే చాలు నాకు ఒళ్లు కంపించిపోతుంది. నాకు ఉన్న ప్రస్తుత రూపంలోనే, నా మనస్సాక్షిని నా అంతరాత్మనూ లెక్కచేయకుండా కొంచెం స్వైరవిహారం చెయ్యాలనే కుతూహలం ఏర్పడింది. సాధారణంగా చాటుమాటు దుర్మార్గాలు చేసే ప్రతి పాపాత్ముడు ఏ విధమైన వ్యామోహాభిలాషకు పాల్పడుతూ ఉంటాడో, అదేవిధంగా నా మతిభ్రమలకు నేనుకూడా లొంగిపోయినాను.

ఏ కథకైనా ఒక అంత్యం అనేది ఉంది. ఎంత పెద్ద ఘటమైనా నింపగా నింపగా నిండి పొర్లిపోతుంది. ఇప్పుడు నేను దుష్టప్రవృత్తికి కొంత అవకాశం ఇచ్చాను. కొద్ది కాలం దాని అలవాటు సాగనిచ్చాను. ఇదే నా అంతరాత్మ యొక్క సమస్థాయిని పూర్తిగా చెడగొట్టింది. అప్పటికీ, నేను జాగ్రత్తపోలేను. ఈ కామరూపసాధమును కనిపెట్టక పూర్వము నేను ఏవిధంగా ఉండేవాడినో, ఆ ధోరణిలోనికే నేను వస్తున్నానన్నట్లుగా నాలో సహజక్రమానుగతంగా మార్పు కన్పించింది. అది జనవరి మాసం. అది పగటిపూట. ఆకాశం నిర్మలంగా ఉంది. నేలమీద కురిసిన మంచు అంతా కరిగి నేల తడితడిగా ఉంది. రీజెంటుపార్కు ఉద్యానవనంలో శీతకాలపు పక్షులు కిచకిచలాడుతున్నాయి. వసంతాగమన సువాసనలు పరిమళిస్తున్నాయి. అక్కడ ఆ పార్కులో ఎండలో ఒక బల్లమీద కూర్చున్నాను. నాలో అణగియున్న మృగప్రవృత్తి ఎట్లా ఎట్లా ప్రవర్తించినదో ఆ పూర్వపు విషయాలను స్మరించుకొంటూ లోలోపల లొట్టలు వేస్తున్నాను. నాలోని దైవభక్తిప్రవృత్తి ఆ ముహూర్తంలో మందగించి కునుకుపాట్లు పడుతూ ఉంది. అవసరమైతే, పశ్చాత్తాపపడవచ్చు, ప్రాయశ్చిత్తం చేసికోవచ్చు అనే ధోరణిలో ఉంది అది. కాని, అట్టి పశ్చాత్తాప ధోరణికి అది యింకా రాలేదు. చుట్టుప్రక్కల ఉండే సాటివాళ్ళందరిమాదిరిగానే నేనుకూడా ఉన్నానని

నాలో నేను భావించుకొన్నాను. ఇతర మానవులంతో నన్ను నేను సరిపోల్చుకొని ఒక చిరునవ్వు నవ్వుకొన్నాను. నా సద్గుణవినియోగాచరణలూ, అట్టి సద్గుణముల నిర్దాక్షిణ్య నిర్లక్ష్య నిరుపయోగమునూ సరిపోల్చి నాలో నేనే తేడా చూసుకున్నాను. ఈ అహంభావ భావాలు నా తలలో తిరుగుతున్న ముహూర్తంలో నా ఒళ్లు జలదరించి కంపించింది. తల తిరిగి పోయినంత పైత్యవికారం కలిగింది. శరీరం గజగజలాడి పోయింది. ఇవన్నీ క్రమేణ తగ్గిపోయినాయి కాని నేను మూర్ఛపోయినాను. ఈ మూర్ఛనుంచి తెప్పరిల్లినాను. అప్పుడు నా భావముల పోకడ అంతా మారిపోతున్నట్లుగా గ్రహించాను. నాలో తెగింపు ఎక్కువైంది. ప్రమాదం అంటే లక్ష్యం పోయింది. ఎవరితోనూ ఏ మొగమాటమూ ఉండనక్కరలేదనే భావం ఏర్పడింది. నేను తలవంచి చూచాను. నా అవయవాలు కుదించుకొనిపోయినాయి నా పొట్టి చేతులకూ కాళ్ళకూ నా దుస్తులు పొడుగై జీరాడుతూ వ్రేలాడుతూ ఉన్నాయి. నా మోకాళ్ళపై ఆనింపబడిన చేతిమీది నరాలు మోటుగా పేనినట్లున్నాయి. చేతిపైన అంతా వెండ్రుకలు మొలిచి ఉన్నాయి. నేను తిరిగి ఎడ్వర్డ్ హైడ్ అయినాను. ఒక క్షణమునకు పూర్వము నేను లోకానికి గౌరవపాత్రుడనై ఉపద్రవ భయరహితుడనై శ్రీమంతుడనై సకలజనాభిమాన పాత్రుడనై ఉన్నాను. నా భోజనశాలలో నాకోసం భోజనం బల్ల

మీాదఅమర్చబడి తెల్లనివస్త్రం కప్పబడి ఉంది. ఇప్పుడు నేను లోకమెరిగిన హంతకుడను. ఉరి స్తంభానికి మెడ యొగ్గవలసిన గులామును. లోకము వేటాడుచున్న మృగాన్ని - ప్రపంచం అంతా గాలించి పరిశోధిస్తున్న రాళ్ళగట్టను నేను ఇప్పుడు ఇల్లువాకిలి లేని నిరా ధారుడను నేను.

నా బుద్ధికి స్థిమితం పోయింది. కాని, అది నాకు పూర్తిగా స్వాధీనం తప్పిపోలేదు. నా యొక్క యీ రెండవ ప్రకృతియందు, నేనిదివరలో పలుమార్లు సూచించియుండిన ప్రకారంగా, నా తెలివితేటలు ఎక్కువ చురుకుగా, నూరిన కత్తిలాగున ఉంటాయి. నా ధైర్యసాహసం వంచిన విల్లులాగున ధాటీగా ఉంటుంది ఆ కారణం చేతనే. జెకిల్ యొక్క ప్రకృతి బేజారైపోయే పరిస్థితులలో, హైడ్, సమయ స్ఫూర్తి కలిగి నడుముకట్టి, కార్యసాధకుడయ్యేవాడు. నామందులన్నీ నా గదిలో ఒక బీరువాలో ఉన్నాయి. కాని, అక్కడికి నేను వెళ్ళడం ఎట్లా? (నా కణతలను రెంటిని గట్టిగా నా చేతులతో నొక్కి) ఏమిటి కర్తవ్యం అని ఆలోచించాను. పరిశోధనా మందిరంలోనికి వెళ్లే తలుపును నేను ఇదివరకే బంధించి వేశాను. ఇంటి ద్వారంగుండా నేను ప్రవేశించడానికి ప్రయత్నించినట్లయితే నాయింటి నవుకర్లే నన్ను ఉరి తీయించడానికి పంపిస్తారు. అందువల్ల నేను మరొకరి సహాయం ఉపయోగించుకోవాలని నిశ్చయించాను.

అది ఎవరిసహాయం అంటే లాన్యన్ సహాయం - అతనిని నేను కలిసికొనడం ఎట్లా? అతనిని నేను ఒప్పించి పని చేయించుకొనేది ఎట్లా? నేను వీధులలో ఎవరికీ పట్టుబడకుండా తప్పించుకొని పోయి నప్పటికీ, అతని సముఖానికి నేను వెళ్ళడం ఎట్లా? అతనికి అసహ్యాకారంగా ఉండే పరాయి క్రొత్తమనిషి నగు నేను, అతని సహచర వైద్యవిద్యాంసుడగు డక్టరు జెకిల్ ఇంటి పరిశోధనమందిరంలోనికి భేదించుకొని బలాత్కారంగా ప్రవేశించవలసినదిగా ఈ సుప్రసిద్ధ వైద్యశిఖామణిని నేనెట్లా ఒప్పించడం? నా పూర్వ ప్రకృతికి సంబంధించిన ఒక సామర్థ్యం మాత్రం నాకు మిగిలి ఉన్నదని నేను జ్ఞప్తికి తెచ్చుకున్నాను. నా అసలు పూర్వపు దస్తూరిలోనే ఇప్పటికూడా వ్రాయగలను: ఈ విషయం నాకు మెరుపు మెరిసినట్లుగా మనస్సుకు స్ఫురించేసరికి, నేను తయారు చేయవలసిన వ్యూహ పథకం అంతా, ఆమూలనుంచి యీమూలకు ఆమూలాగ్రంగా తేటతెల్లమయింది.

అంతట నా దుస్తులను నేను సాధ్యమైనంతవరకు సరిచేసికొని త్రోవలో పోతున్న ఒక కిరాయిబండీని పిలిచి అందులో ఎక్కి పోర్టులాండువీధిలోని ఒక హోటలుకు చేరాను. దానిపేరు నాకు జ్ఞాపకముండడం చేత అక్కడికి చేరాను. (నా వికృత ఆకారమును నా దుస్తులు ఎంతతీరుగా కప్పిపుచ్చినప్పటికీ) నా రూపం నా వేషం చూచేసరికి బండివాడు నవ్వు ఆపుకొనలేక

పోయినాడు. నేను పిశాచావేశంతో వాడిమీద పళ్ళుపట పట కొరికాను. అంతటితో అతని ముఖంలో ఆ మందహాసం మాయమైపోయింది. అంతవరకు వాడు అదృష్టవంతుడే. అంతకంటే అదృష్టవంతుణ్ని నేను- ఎందు చేతనంటే మరుక్షణంలో నేను వాణ్ని వాని పీఠంలోనుంచి క్రిందకు పడగొట్టి ఉండేవాణ్ని. హోటలుకు చేరిన పిమ్మట అక్కడ ఉన్న వాళ్ళందరినీ నేను నా కొరివి ముఖంతో తేరిపార చూచేసరికి, వాళ్లంతా హడలిపోయినారు. నా ఎదుటమాత్రం వాళ్లల్లో వాళ్లు నన్ను చూచి కన్నుగీటుకోలేదు. కాని, విధిలేక చిత్తం చిత్తం అంటూ నేనుకోరిన ప్రకారంగా నాకొక ప్రయివేటుగది చూపించారు. వ్రాసికొనుటకు కావలసిన పరికరములు తెచ్చియిచ్చారు. అంతులేని ఆగ్రహావేశంతో మండిపడుతూ, చంపి హతమార్చే స్థాయిలో తాండవమాడుతూ, పీడించి హింసించవలెననే దాహంతో ఉండేటటువంటి వాడు హైడ్. కాని, తన ప్రాణానికి తానే హడలిపోతున్న పిరికి హైడ్‌ను నే నిదివరకెన్నడూ ఎరుగను. అయినప్పటికీ ఆ జీవి చాలా నిగ్రహంతో ఉన్నాడు. తన ఆగ్రహావేశాన్ని స్వసంకల్పబలంతో అణచివేశాడు. రెండు ముఖ్యమైన ఉత్తరాలను ఒకటి లాన్యనుకూ, రెండవది పూల్‌కూ వ్రాశాడు. ఆ రెండు ఉత్తరములూ పోస్టులో వేయబడినవని తనకు రూఢిగా తెలిసే నిమిత్తమై, వీటిని రిజిస్టర్డు పోస్టుద్వారా పంపవలసి యున్నదని ఉత్తరువు చేశాడు.

అటుపిమ్మట రోజంతా, ఆ ప్రయివేటు గది లోనే నెగడువద్ద తనగోళ్లు కొరుక్కుంటూ కూర్చున్నాడు. అక్కడే తన గుండె దిగులుతో ఏకాంతంగా కూర్చుండి భోజనం చేశాడు. ఎదురుగుండా ఉన్న నవుకరు వణికిపోతూనే ఉన్నాడు. అటుపిమ్మట రాత్రి బాగా చీకటిపడిన తర్వాత, నలువైపులా తలుపులు మూసిన బండీలో ఒకమూలగా కూర్చున్నాడు. నగరవీధులలో అటుయిటు అడ్డదిడ్డంగా అతనిబండీ నడచింది. "అతడు" అనే మాటనే వాడగలను. "నేను" అనేమాట నేను వాడలేను. యమలోకంలో నుంచి ఊడిపడినటువంటి ఆవ్యక్తికి మానవత్వం అనేది ఏమీ లేదు. వానిలో మూర్తీభవించినది ఏమిటంటే అమితభయం; అందరిమీదా అసహ్యం, ద్వేషం- చిట్టచివరకు, ఆ బండీవానికి తనమీద అనుమానం కలుగుతున్నట్లుగా తోచి ఆబండీని విడిచిపెట్టి, తన జీరాడు వ్రేలాడు మితిమించిన భారీదుస్తులతో, పదిమందినీ ఆకర్షించే ఆకారసౌరూపంతో, రాత్రిసమయ వీధి పాదచారుల మధ్యలోనుంచి వెళ్లిపోయినాడు. అమిత భయం, అందరిమీదా అసహ్యం, అతనిలో తుపాను వలె ప్రచండంగా చెలరేగుతున్నాయి. తొందర తొందరగా నడిచాడు. అతని భయములు అతన్ని వేటాడినట్లు వెంటాడుతున్నాయి. తనలో తాను గొణుగుకుంటున్నాడు. జనసమ్మర్దం తక్కువగా ఉన్న రస్తాలమీదుగా నక్కి నక్కి నడుస్తూ, నడిరాత్రివేళ

యగుటకింకా ఎన్ని నిమిషాలున్నాయో లెక్కపెట్టు కుంటూ వెళ్లాను. త్రోవలో ఒక అమ్మి అతనిని పలుకరించింది అతనికి చిరుతిండి దినుసుల పెట్టె నొకటి ఈ అమ్మి అమ్మచూపింది. ఆమె దవడమీద అతడొకటి వేసేసరికి ఆమె దవ్వుకు తీసింది.

లాన్యను యింటికి నేను చేరి అక్కడ నా స్వస్వ రూపం పొందిన తర్వాత, నా ప్రాణమిత్రునకు అప్పుడు కలిగిన ప్రళయభీతి నామీద ఒకవేళ కొంత పనిచేసిన దేమో నాకు బాగా తెలియదు. కాని, ఆనాటిరాత్రి ఆఖరిది గంటలసేపు నడచిన కథాకలాపం అంతా నేను తలచుకున్నందువల్ల నాకు కలిగిన అమితమైన రోతలో, అమితమైన వెగటులో, నామిత్రుని కంగారు వల్ల నాకు కలిగిన బాధ సముద్రంలో కాకిరెట్టవంటిది. నాలో ఒకమార్పు వచ్చింది. నేను పట్టుబడితే నన్ను ఉరితీస్తారనే భయం కాదు యిప్పుడు నన్ను బాధించేది. అప్రయత్నంగా హఠాత్తుగా హైడ్‌గా మారిపోతా నేమో అనే భయం యిప్పుడు నన్ను బాధిస్తోంది. నన్ను నిందిస్తూ లాన్యను చేసిన బోధ అంతా అప్పుడు విన్నానుగాని, అదంతా నాకు స్వప్నలీలగా స్మరణకు వస్తోంది నేను ఒక విగమైన స్వప్నావస్థలో నే అక్కడినుంచి నా యింటికివచ్చి పరుపుమీద పడు కున్నాను. క్రిందటి రోజంతా నేను అమితమైన అల సట పడుటచేత ఆ నిస్త్రాణవల్ల నాకు బండనిద్ర పట్టింది. రాత్రిళ్లు నాకు కలిగేటటువంటిగుండె ఉలు

కులుకూడా ఆనాటిరాత్రి నాకు నిద్రాభంగం చేయ లేనంత బందోబస్తు చేసింది. మరునాడుదయం నేను నిద్రలేచేసరికి చాలా నీరసంగా, దివాలా తీసినట్లుగా ఉన్నాను. కాని, విశ్రాంతిపొంది అలసట తీరినట్లుగా ఉన్నాను. నాలో అంతర్గతంగా మాటు మణిగి నిద్రాణంగా ఉన్న వ్యాకరణాన్ని తలుచు కుంటే నాకు భయం పుట్టుతోంది. క్రిందటి రోజున నేను ఎటువంటి ప్రమాదావస్థలపాలైనదీ ఎంత మాత్రమూ మరచిపోలేదు. కాని, తిరిగి నాస్వాస్థ్యానికి నేను చేరుకొన్నాను. నాఔషధాలన్నీ నాదగ్గరనే ఉన్నాయి. నాకొక గండం తప్పినందుకు మహత్తమమైన కృతజ్ఞతానందం నా ముఖారవిందంలో ప్రకాశించింది. మున్నెన్నడూ బాగుపడ్డాననే ఆశోల్లాసంకంటె ఆ కృతజ్ఞతానందమే నా అంతరాత్మలో అధికతరంగా ప్రకాశించినదని చెప్పవచ్చు.

ప్రాతఃకాల భోజనంచేసి నా యింటి పెరటి జాగాలో విశ్రాంతిగా తిరుగుతున్నాను. చలిచలిగా ఉన్నగాలినే సరదాగా అనుభవిస్తున్నాను. ఆసమయంలో, నాకు రూపపరివర్తనాపూర్వం సంభవించే అనిర్వచనీయ పైత్యవికార లక్షణములన్నీ ప్రారంభమైనాయి. నేను తిరిగి హైడ్ తత్వంలోకి మారిపోయి

కాని ఉగ్ర ఉద్రేకములన్నీ నాకు పూనకపూర్వము, నా కచ్చేరీగదిలోకి నేను చేరుకొనుటకు కావలసినంత స్వల్ప వ్యవధిమాత్రం ఉంది. నాకు స్వస్వరూపం తిరిగి రావడానికి యీసారి నేను రెండింతలు మోతాదుగా మందు పుచ్చుకోవలసి వచ్చింది. కాని, హారహారా! ఆరుగంటలు గడచినతోడనే, నేనేదో దిగులుగా నెగడు వద్ద కూర్చున్న సమయంలో, నాకు రూపాంతర ప్రసవవేదన మళ్ళీ ప్రారంభమైంది. మందును మళ్ళీ సేవించవలసివచ్చింది. ఇంకెందుకు? ఆనాటినుంచీ నేను ప్రాణాలు బిగబట్టినట్లుగా కసరత్తు చేస్తూ, నా మందును ఎప్పటికప్పుడు సేవిస్తూ ఉండడంవల్లనే నా జెకిల్ రూపమును నేను నిలువబెట్టుకోగలిగినాను. హైడ్ గా మారిపోతున్నానేమోననే భయం అహోరాత్రాలూ అనుక్షణమూ నన్ను వెంటాడుతూనే ఉంది. అన్నింటికంటె పెద్ద విశేషం ఏమిటంటే, నేను నిద్రపోయినా సరే, రవ్వంతసేపు కునికిపాట్లుపడి లేచినాసరే, మెలకువరాగానే హైడ్ రూపంలో ఉండేవాడిని. నా మనస్సునొక పీడ నా నీడవలె వెంటాడుతూ ఉండడంవల్ల, నిద్రపోవుట కూడా మానివేశాను. మానవమాత్రుడైనవాడెంత వరకు నిద్రను వర్జించగలడో అంతవరకూ వర్జించాను.

ఈ గుండెదడతో, యీ భయవిరహతాప జ్వరంతో నాలో నేను కృశించి జీర్ణించిపోతున్నాను. శరీరం, మనస్సు కూడా బేజారై దిగజారిపోతున్నాయి. నా రెండో అవతారమే నా పెనుభూతమై నన్ను భయపెట్తోంది. నేను నిద్రపోయి లేచినప్పుడుగాని, నేను త్రాగిన మందు ధాటీపోయినతర్వాతగాని, నేను లేచీ లేవడంతోనే ఒకపూనకం వచ్చినట్లుగా లేస్తాను. (నా రూపాంతర ప్రసవవేదన పూర్వమువలె తీవ్రంగా రాకుండా రోజురోజుకూ అది తగ్గిపోతోంది.) నేను లేవగానే, నా మెదడులో భీకరభీభత్స వీరావేశభావములు చిందులు త్రొక్కుతూ ఉంటాయి. లోకంయెడల కారణం ప్రేరణంలేని అసహ్యద్వేషధోరణి పుట్టుకొని వస్తుంది. కాని నా శరీరం ఈ ఉగ్రావేశములకు తాళుకొనలేని నిరసస్థితిలో ఉంటున్నది. జెకిల్ శరీరం జబ్బు శరీరం అయినకొలదీ, హైడ్ తత్వ ప్రభావం ప్రబలమవుతోంది. వీరిద్దరికీ ఒకరియెడల యింకొకరికి ద్వేషం ఉభయత్ర సమానమైపోతోంది. హైడ్ యందు ఎటువంటి వైకల్యం ఎటువంటి వంకరటింకరతత్వం ఉన్నదో జెకిల్ బాగా గ్రహించాడు. కాని, ఆత్మ పరివర్తన విషయములో ఉభయులకూ సమష్టి భాగస్వామ్యం ఉంది. తనతోపాటు అతనుకూడా ఆమరణం

ఆ స్థితికి అధికారి. ఈ రెండు సమష్టింతగుణములు తప్ప, వేరే యేవిధమైన లంకె యిద్దరికీ లేదు. కాని, యీలంకెయే అతని మనోవేదనకు ముఖ్యకారణమైపోయింది. హైడ్ అనేవాడు రాక్షసిఅనిన్నీ, చైతన్య శూన్యుడనిన్నీ, జెకిల్ తన యావజ్జీవిత సాఫల్యాన కృతకృత్యో పరిగణించి భావించాడు. అన్నింటికన్నా చిత్రమేమిటంటే, ఈ ఘటంలో అథమస్థమై పడియుండవలసిన పనికిరాని మురికి పైకి యికిలించి సకిలించి గీపెట్టి కూతలుకూయుచున్నట్లుగా ఉంది. నామరూపాలు లేని ఈ కుళ్లు యీ ఘటంలోనుంచి సైగలుచేసి సైతాను చేష్టలు చేస్తోంది. అంతరించి ఆకారవిచ్ఛిత్తయి, విచ్చి చచ్చిన కొరివి ఒక జీవిని నెట్టి తన పీఠం అక్కడ పెట్టుకోవలెనని ప్రయత్నిస్తోంది. ఇదే అత్యంత ఘోర దురంతం. అతనిలోని ఆ ఘోరపిశాచి, ఆ జేజమ్మ, అతని అర్ధాంగికంటె అత్యంత సన్నిహిత సాహచర్యంతో వర్తిస్తోంది. కంటికి రెప్పవలె కనిపెట్టి విడువకుండా ఉంది. అతని అస్థిపంజరంలో, అది దాగి ఉంది దాని గొణుగుడు, దాని సణుగుడు అంతా అతనికి వినబడుతోంది. అది నిజస్వరూపంతో పైకి ఆవిర్భవించవలెనని తన్నుకొనుచున్నట్లుగా స్పష్టంగా కన్పిస్తోంది. ఏ మాత్రం ఏమరియున్నప్పటికీ,

ఏమాత్రం దుర్బలంగా ఉన్నప్పటికీ, నిశ్చింతగా నిద్ర పోవుటకై కన్ను మూసినప్పటికీ, అతనివి వశం చేసికొని, అతనిని అంత మొందించి తన పీఠం ఏర్పరచుకుంటూ ఉన్నది. జెకిల్ యెడల హైడ్ కు ఉన్నటువంటి ద్వేషం మరొకవిధమైనది. తనకు ఉరిశిక్ష పడుతుందనే భయంచేత హైడ్ తన రూపాన్ని తానే హాతం చేసికొని, జెకిల్ లో ఒక భాగస్థుడై తల దాచుకుంటున్నాడు. పూర్తిగా తానొక ప్రత్యేక సంపూర్ణ స్వతంత్రవ్యక్తిగా ఉండక, మరొక వ్యక్తిలో భాగస్థుడై ఉంటున్నాడు. కాని యీ శరణ్యం అనివార్యం కావడమే అతనికి అసహ్యంగా ఉంది. జెకిల్ యిప్పుడు దిగులుపడిఉండడంవల్ల, జెకిల్ విషాద కారణం హైడ్ కు విద్వేష కారణం అయింది. తనయెడల జెకిల్ కు రోత పుట్టడం చూస్తే, హైడ్ కు కడుపుమంటగా ఉంది. అందువల్ల నాలోఉన్న హైడ్ కొంటి కోతి చేష్టలు చేస్తున్నాడు. నా గ్రంథాలమీద నా చేతితోనే అనేక భగవద్దూషణ వాక్యాలు వ్రాయిస్తాడు. నా చేత ఉత్తరాలు తగులబెట్టిస్తాడు. నా తండ్రి పటమును నా చేత ధ్వంసం చేయించాడు. వానికి చావంటే భయం లేకపోయినట్లయితే, తనతోబాటు నన్ను కూడా అంత మొందించుటకై అతడెన్నడో ఆత్మ

నాశనం చేసికొనేవాడే. కాని, అతనికి అతని బ్రతుకు మీదఉన్న ప్రేమ అద్భుతమైనది. అంతే కాదు. మరింత విస్తరించి వివరిస్తాను. వాడి పేరు చెప్తేనే నాకు ఒళ్లు జల్లుమంటుంది. కాని, అతనికీ నాకూ ఉన్న గాఢ మమకారమున్నూ, దాసోహం అన్నంత వ్యామోహమున్నూ తెలుసుకొన్నప్పుడు, నా ఆత్మహత్య మూలంగా అతనినికూడా అంతరింపజేయగల శక్తి నాకున్నదని తెలుసుకొన్నప్పుడు, ఎందుచేతనో అతని మీద నా ఎదలో దయపుట్టుకొని వస్తుంది.

ఇదంతా వృథా గాథ. ఈ వర్ణన యింకా పెంచి వ్రాయడానికి కాలవ్యవధి లేదు. ఇటువంటి దారుణవేదనలు యిదివర కేమానవుడూ అనుభవించ లేదు. ఈ ఒక్క విషయం చెప్తే చాలు. ఈ యమ బాధలకు నేను అలవాటుపడినంత మాత్రంచేత, నా బాధ ఏమీ ఉపశమించలేదు. కాని, నా అంతరాత్మ బండబారిపోయింది. నిస్పృహ చేత తలయొగ్గినట్లయింది. నాకు యీ యమదండనల వేదన యింకా కొన్ని సంవత్సరాలవరకూ సాగుతూఉండేదే. కాని, యిప్పుడు నాకు సంభవించిన ఆపత్తుమూలంగా, నేనూ, నాస్వరూప స్వభావములూ నిర్మూలింపబడినవి. నేను నా ఔషధ పరిశోధన ప్రయోగమును మొట్టమొదట చేసినప్పుడు

కొంత క్షారమును భారీగా తెప్పించినాను అటు తర్వాత ఆ క్షారమును ఎప్పుడూ తెప్పించలేదు. మొదట తెప్పించిన క్షారం క్రమేణా అయిపోయింది. క్రొత్తగా మరికొంత క్షారం తెప్పించి ఔషధం తయారు చేసినాను. బుసబుసమని పొంగింది. మొదటి రంగు మార్పు వచ్చింది. కాని రెండో రంగుమార్పు కన్పించ లేదు. ఆ మందును త్రాగితిని. కాని, అది పనిచేయు లేదు. లండను నగరంఅంతా వెతికించి సోదా చేయించాను. ఈ విషయం మీకు పూల్ ద్వారా తెలియగలదు. ఎంత వెతికించినా, ప్రయోజనం లేకపోయింది. నాకు మొట్టమొదట లభించిన క్షారంలో కొంత కల్తీ ఉంది. నాకు తెలియని ఆ కల్తీపదార్థం అందులో చేరి ఉండుటమూలంగానే నామందు ఇదివరలో అమోఘంగా గుణమిచ్చిందని నే నిప్పుడు గ్రహించాను.

ఒక వారంరోజులు గడిచాయి. ప్రాత క్షారంతో చేసిన మందును త్రాగి దాని గుణప్రభావంవల్ల నేను యీ వాఙ్మూలం పూర్తి చేస్తున్నాను. ఇదే ఆఖరు పర్యాయంగా హెన్రీ జెకిల్ తన సహజభావాలతో యోచించగల్గుతున్నాడు. తన సహజ ముఖవైఖరిని (బహు విషాదకరంగా మారిన రూపును) అద్దంలో చూచుకోగల్గినాడు. ఇంతకన్న మహాత్కార్యం

మరొకటి లేదు. ఇక నా వ్రాతను నేను కాలయాపన చేయక త్వరగా ముగించాలి. నా నిజకథాని వేదిక యింతవరకూ ధ్వంసం చేయబడక తప్పించుకొన్న దంటే, అది అంతా అతిజాగరూకతవల్లనూ, అదృష్ట వశముననూ సాధ్యమైంది. దానిని వ్రాస్తూ వ్రాస్తూ ఉండగానే, నారూపపరివర్తనా వేదన ప్రారంభమైన ట్లయితే, హైడ్ అవతరించి, యీ కాగితాన్ని ముక్కలు ముక్కలుగా చించి పారవేస్తాడు. దీనిని వ్రాసి దాచివేసినపిమ్మట కొంతకాలం గడచి నట్లయితే, అతనికి సద్యఃకాలావసరస్వప్రయోజనమే స్వతస్సిద్ధలక్షణమగుటచేత, యీ కాగితము బహుశః అతని మర్కట సదృశవిద్వేషమున కాహుతి కాకుండా సురక్షితమై ఉండవచ్చు. అదిన్నీ గాక, మా ఇద్దరి అంత్యదశ సమీపిస్తోంది. సమీపిస్తున్న యీ యమగండం అతనిని యీవరకే చాలా మార్చి పరి మార్చినది. ఇంకో అరగంటలో నేను సదా శాశ్వ తంగా ఆ దుస్పృహ అనహ్య ఆకారంలో అవతరింప బోవుచున్నాను. అప్పుడు నా కుర్చీలో నేను గజగజ లాడుతూ, వెక్కి వెక్కి ఏడుస్తూ కూర్చోవాలి. లేదా, (నాకు యీ దురవస్థలో మిగిలిన కట్టకడపటి శరణ్యమైన) యీ గదిలో ఒళ్లు తెలియని భీతితో,

నాకేమి పుట్టి మునుగనున్నదో యని వెరచి, ఎక్కడ ఏ శబ్దమైనా చెవులు నిక్కించి, అటు యిటు చర లాడుతూ ఉండాలి.

హైడ్ ఉరికంబాన ఉసురులు వీడునా? ఆఖరు క్షణములో అతని కతడే ఆత్మవిమోచన కల్పించుకొన గలుగు తెగువ యతనికి కలుగునా? ఈశ్వరునకే ఎరుక! ఇక ఏది ఎట్లాగైనా, నాకేమీ లక్ష్యం లేదు. ఇది నిశ్చయంగా నా మృత్యు ఘడియ. ఇకమీదట జరిగేది అంతా, ఇతరులకు సంబంధించిన విషయమే గాని నాకు కాదు. ఇక నా నిజ కథా నివేదికకు సీలు ముద్ర వేస్తున్నాను. హెన్రీ జెకిల్ అనెడి అభాగ్యుని జీవితకలాపం సమాప్తం చేస్తున్నాను.



# తప్పొప్పులు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 30 | 19 | నా మిత్రుడైన నీ | నీ క్రొత్త మిత్రుని |
| 36 | 6 | లాన్యన్ | జెకిల్ |